# ఆధ్యాత్మిక జీవనము



mohan
PUBLICATIONS
Mohanpublication.com
Granthanidhi.blogspot.in
ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక
విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
FB@mohanpublications
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533 101.
Granthanidhi.blogspot.in

# విషయ సూచిక



## సూక్తి :

మానవజన్మ మహత్తరమైనది. అది జ్ఞానాన్ని భక్తిని పొందుటకు సాధకమైనది. దేవతలు కూడా మానవజన్మనో కోరుదురు.



ఓం శ్రీ వటపత్ర శాయినే నమః

# పరిచయము

బ్రహ్మశ్రీ భక్తగోవిందంగారు 67 సంవత్సరముల ఆధ్యాత్మిక జీవన ఆకళింపుతో సామాజిక స్పృహ కలవారు. ఆంధ్రప్రదేశ్‌లో వై. గోవిందరావు నామధేయముతో జిల్లా జడ్జిగా సేవలు అందించారు. శ్రీమతి గంగమాంబ బ్రహ్మశ్రీ కనకయ్య గార్లు వీరి జననీ జనకులు.

ఆలోచన తట్టిన నాటినుండి భగవదాలోచనలో ఉంటున్న భగవద్భక్తులు. బహుముఖ ప్రజ్ఞాశాలి. సమసమాజమును నిర్మించాలన్న ఆశయము కలవారు. సాంఘిక, సాంస్కృతిక, విద్యా, సంగీత సాహిత్య క్రీడారంగములలో ప్రతిభ కనపరచి పథకాలు పొందిన ప్రతిభావంతులు.

భాగ్యనగరపు బంగారు బిడ్డయైన వీరు భాగ్యనగరమునందే ఉన్నత విద్యను అభ్యసించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయమున న్యాయవాద విద్యాభ్యాస సమయము ననే న్యాయవాద (విద్య) పాఠ్యాంశమునందు లేబర్‌కోర్సుయొక్క ఆవశ్యకతపై చక్కని ఆర్టికల్ వ్రాయగా పత్రికలో ఆర్టికల్ చూసిన అధికారులు ఎంతగానో ప్రశంసించు టయే గాక అదే సంవత్సరము ఎల్.ఎల్.ఎమ్. నందు లేబర్‌కోర్సు ప్రవేశపెట్టుచున్నట్లుగా విశ్వవిద్యాలయము వారు ప్రకటించారు. పై ఒక్క విషయము చాలు వీరి నైపుణ్యము చాటుటకు.

పత్రికారంగమున అమితమైన కృషిసల్పుటకై కృతనిశ్చయులైన వారు, ఒక పత్రికనే పోషించవలెననిన నిర్ణయముతో న్యాయవాదిగా ఉన్నప్పుడు ఏర్పాట్లుకూడ చేయుట జరిగింది. జర్నలిజంలో పట్టాలేవి లేకపోయినా కొంతకాలముపాటు విశ్వరచన పత్రికకు సెక్రటరీగా (కార్యదర్శిగా) ఉండి తమ రచనలతో సమృద్ధిపరచినారు. ఆంధ్ర వార్తాపత్రిక, ఆంధ్రజ్యోతి, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, డక్కన్ క్రానికల్

మొదలగు పత్రికలలో వీరి రచనలు ప్రచురితములు. రేడియో నాటికలు. ఉదయం వెలువడే రత్నావళి ప్రసంగాలతో అందరు సుపరిచతులే కదా!

జీవనయానంలో వీరు ప్రప్రథముగా సెంట్రల్ గవర్నమెంట్ సంస్థలో కొంత కాలము (L.D.C.) దిగువశ్రేణి గుమాస్తాగా చక్కని సేవలు అందించినారు. తదనంతరము న్యాయవాద జీవితంలో అడుగుపెట్టి హైదరాబాద్ సిటికోర్ట్ మరియు హైకోర్టునందు తమ ప్రతిభను చూపించినారు.

1981వ సంవత్సరములో న్యాయాధికారిగా బాధ్యతలు స్వీకరించినారు. నాటి నుండి ఆంధ్రప్రదేశ్ అన్ని ప్రాంతములలో వివిధ హోదాల్లో న్యాయాధిపతిగా పనిచేశారు. వృత్తిరీత్యా భవ్యమైన సౌధాన్ని నిర్మించి, భవబంధములోపడి బాగునాశించే కోరిక ఇసుమంత కలిగిన వారికైనా మార్గము చూపించాలన్న తపనతో చక్కని భాష, భావముతో సులభమైన పదజాలముతో రసవంతముగా పరివర్తన-ద్వైతం గ్రంథం సామాన్య జనావళికి మార్గదర్శకముగా అందిస్తున్నారు.

మానవజీవిత సార్థక్యమునకై మనన నిధిధ్యానలు పెంపొందుటకై వీరి రచనలు ఎంతయో సహాయకారులుగా ఉండవగలవు అనుటలో అతిశయోక్తిలేదు. చిన్ననాటి నుండి భక్తిపారవశులగు వీరు 18 అధ్యాయాల భగవద్గీత, 18 గ్రంథాలుగా మలచి, మానవాళికి అందించారు. ఇతర ఆధ్యాత్మిక గ్రంథాలతో బాటు అనేక గద్యపద్య రచనలు గావించారు. ఇప్పుడు పరివర్తన-ద్వైతం, ఆధ్యాత్మిక జీవనము గ్రంథాల్ని అనేక అలౌకిక విషయాతో బాటు లౌకిక విషయాల్ని మేళవించి, జీవితంలో అందరూ చదివే వీలుగా అందు బాటులోకి తెచ్చారు, ఈ విషయము చదివి ప్రతి ఒక్కరికి తెలియగలదని సంతోష పూర్వకంగా తెలియపరచుచున్నాము.

కళాప్రపూర్ణ

న్యాయవాది, రచయిత

**డా॥ పోతుకూచి సాంబశివరావు**

# ఒక కవి భావన

శ్రీ వటపత్రశాయి మది చింతనతోగల నైజరూపమున్
కావలెనన్న కోరికలు గల్గిన సేవల సాధు మూర్తిగా
నీవయి సత్యప్రేమగుణ నిశ్చిత నిర్మల ధర్మకర్మలన్
రావె సభాంగణంబు నను రంజిలు నాయము పీఠమేయుగన్ ॥
గోవిందా హరికృష్ణ సాక్షిగను కోరంబోని ధర్మార్థముల్
భావింపన్ తగు నాయముంచుచునుమేల్ భాగ్యాల గోవిందుడే
సేవింపన్ దిగివచ్చి దాన ఫలముల్ చేకూర్చగా నిచ్చలున్
కన్పించే సభగాంచు మీ చరితముల్ కల్పించు మోక్షార్థముల్ ॥
సత్యవచో వివేకముల సంపద చేయుచు నిత్యజీవనా
గత్యము ప్రేమ భాగ్యముల కల్పన సేయుచు తోటివారికిన్
ముత్యపు జల్లు కీర్తిలగ మూర్తిలు శ్రీహరిపాదపూజలం
సత్య విజేయ సత్కరుణ సంబరమందుచు మైత్రి జూపెడన్ ॥
మంచిపెద్దల మాన్యతన్ సమముగా మళ్ళించు ధర్మార్థముల్
పంచే నిష్కృతి తోడి సత్కృతులు పారాడంగనే గ్రంధముల్
నింపే వ్యాగ్మతుస్రష్టగా రచనలం నీతి నియంత్రించుచున్
ముంచే మోసములన్ తొలంగగన్ మూర్తిల్లు గోవిందుడా ॥
భక్తగోవిందము పరగు మానససేవ
పెద్ద మనసుతో పెంచు ప్రజల
నిత్యపూజార్చ నెరపుచు జనకోటి
సేమమ్ము సాగగ నేయు కర్మ
మంగళార్చన బుద్ధ మసలు హరి గోవింద
యన్న సంకీర్తన నలర నిలుపు
వత్సలత యోగాత్మవరలు ప్రేమాదర్శ
సత్యజీవన సేవ సంతరించు

# పెద్దల శుద్ధులు

## మూడు ముత్యాలు

శ్రీ భక్తగోవిందంగారు రచిచంచిన 'ఆధ్యాత్మిక జీవనం' అన్న గ్రంథంలో అచ్చవుతున్న కొన్ని వ్యాసాలను వారు పంపగా చదివాను. వాటిలో ఒకటి 'బాలవాక్కు- బ్రహ్మవాక్కు' వాక్కే ఋక్కు - నాదమే బ్రహ్మ అని చెప్పే వాక్యంతో ఈ ప్రకరణం మొదలయింది. 'సృష్టి చేయదలచినపరమాత్మ, మహతత్త్వంగా రూపాంతరం చెందడం, దాని నుంచి ఆకాశభూతమూ ఏర్పడడం మొ॥ అంశాలను వివరిస్తూ వాక్కుకున్న ప్రాముఖ్యాన్ని తెలిపారు. దాని శక్తిని మంత్రప్రయోగం ద్వారా ఎలా తెలుసుకోవచ్చునో చెప్పారు. నిర్మలహృదయాలైన పిల్లలు దైవసమానులు కాబట్టి బాలవాక్కు బ్రహ్మవాక్కన్న నానుడిని వారు నిష్కర్ష చేశారు.

మరొక ప్రకరణం, 'ప్రేమించబడు' అన్నది ప్రేమతత్వం వర్ణనాతీతమన్న వాక్యంతో ఈ ప్రకరణం మొదలయింది. మనస్సులో పుట్టిన ప్రేమ కామపరమయినదీ, హృదయపులోతులోంచి పుట్టినది నిస్వార్థమయినదీ అని గుర్తించారు రచయిత. ఈ సర్వసృష్టి ప్రేమమయంగా ఆవిర్భవించిందనీ ప్రేమ ఒక దివ్యానుభూతి అనీ అన్నారు. ప్రేమకు ప్రేమ పరమావధి, భూమిమీద అన్ని శక్తులనూ మించినది ప్రేమే నన్నారు. ప్రేమానురాగాలకూ మోహకామాలకుగల బేధాన్ని పరిశీలన చేశారు.

సృష్టిలో ఏ మానవుడయినా పొందదగినదీ అత్యంత అమూల్యమయినదీ భగవత్ప్రీతేనని రచయిత చెప్పడం సముచితంగా ఉంది. ఏక పక్షంగా ఉండే ప్రేమలో పరిపూర్ణత ఉండదు కాబట్టి పరస్పర ప్రేమసాధన అభిలషణీయమే కదా! సాహిత్యంలో మనకు కనిపించే ప్రేమగాథలను పేర్కొంటూవారు, "నిన్ను ఎవ్వరూ ప్రేమించకుండా ఉంటే అది తప్పకుండా నీ ఘోర తప్పిదమవుతుంది. అందుకే

ప్రేమించబడటం తెలుసుకో, ప్రేమ మజా ఏమిటో తెలుస్తుంది. అని హితవు చెప్పారు.

'నవ్వు - నజరాన' అన్నది ఇంకొక ప్రకరణం "నవ్వు సర్వరోగ నివారిణి" అంటూ దానికున్న మనో వైజ్ఞానిక విశిష్టతను వారు ఉదాహరించారు. నవ్వుల్లో రకాలు కొన్ని తెలిపారు. మనుషులు ఎన్ని రకాలుగా ఉన్నారో అన్ని విధాలయిన నవ్వులు ఉంటాయట. వాటి తీరుతీరులను వివరించడమే కాక, ఈ నాటి 'లాఫింగ్ క్లబ్బులు' ప్రపంచంలో ఎందరెందరికో ఆరోగ్యాన్ని పరిరక్షిస్తున్నాయని మనకు గుర్తు చేశారు. "నవ్వలేనివాడు ఎన్ని సంపదలున్నా నిర్భాగ్యుడే" నన్న మాట ఎవరు కాదనగలరు?

భక్త గోవిందంగారు ఇదివరలో, భగవద్గీతలోని ఒక్కొక్క అధ్యాయంలో ఉన్న శ్లోకాలను అర్థవివరణలిస్తూ ఒక్కొక్క ప్రత్యేక పుస్తకంగా ప్రకటించారు. వాటిలో పన్నెండో అధ్యాయానికి 'శ్రీ గోవింద భక్తిగీతము' పేరుతో రచయిత రాసిన వివరణం చదివి ఆనందించాను. ఇప్పుడు 'పరివర్తన ద్వైతం'లోని మూడు ప్రకరణాలు చదివి సంతోషించాను. రచయిత కేవలం ఆధ్యాత్మిక విషయబోధకో లౌకిక విషయ విన్యాసానికో పరిమితులు కాక, రెంటినీ మేళవించడానికి ప్రయత్నించడం ముచ్చట గొలిపే విషయం. సామాన్య పాఠకులను బాగా ఆకట్టుకొనే విధంగా సాగింది రచన.

భాషాపరంగా వీరిది స్వచ్ఛంద శైలి. కాబట్టి కావ్యభాషా శైలికొంత వాడుక భాష కొంత ఇందులో సమ్మిశ్రం కావడం దానికి నిదర్శనం.

మనసులో మెదలిన భావాలను వ్యక్తీకరించడంలో రచయిత కృతకృత్యు లయ్యారు.

న్యాయపాలన విధి నిర్వహణకు, మానవధర్మసాధనోద్దీపనను తోడుచేసుకున్న భక్త గోవిందం గారికి 'వటపత్రశాయి' ఎల్లప్పుడూ చేదోడు వాదోడుగా ఉంటాడని నా విశ్వాసం వారికి నా అభినందనలు.

**పోరంకి దక్షిణామూర్తి**

# క్రొత్త వెలుగుబాట

'భక్త గోవిందం' వ్రాసిన "పరివర్తనం ద్వైతం", "ఆధ్యాత్మిక జీవనం" గ్రంథాల్ని ఆసాంతం పరిశీలించాను. ఇందులో రచయిత పాండిత్యం, ప్రకృతి పరివర్తనావగాహన, సృష్టిలోని ద్వైత సిద్ధాంతం విశ్లేషణ వర్ణనీయంగా పరిశోధనాత్మకంగా కనిపిస్తాయి.

ప్రకృతిలోని త్రిగుణధర్మం, త్రిగుణాతీత దైవ పరమాత్మ పరివర్తన భక్త గోవిందం ఆలోచనాత్మకంగా అందించారు. ప్రకృతిపురుషుల సంయోగం తెరవెనుక ఉన్న అదృశ్య శక్తిని నిశితంగా వీక్షించారు భక్తగోవిందం. అపరాప్రకృతి కంటే వేరైనది సమస్త జీవనాధారమైన ప్రకృతి యీ జగత్తు ఆ శ్రీకృష్ణతత్వం యీ గ్రంధానికి ప్రాణం పోసింది.

రాక్షసుల లక్షణాలకంటె భయంకరమైన కలికాలం పరిణామాలు భక్త గోవిందం విపులంగా విశదీకరించారు. శాస్త్రమంటే, అయన చెప్పిన వరుసకాక, తెలివి, జ్ఞానము ఆజ్ఞ అంటే పరిణామం పరాకాష్ఠ చెందగలదు.

సృష్టి అంతా నాదబ్రహ్మంతో నిండివుంది - శబ్దం రూపంలో వెలుగుచుండు దైవశక్తి మంత్రం అన్న భక్తగోవిందం నిర్వచనం అక్షరసత్యం.

మానవ జీవితం - కోరిక - పోలిస్తే కోరిక వల్ల జీవితం సాగుతుందా - జీవితం వల్ల కోరికలు తీరుతున్నాయా అన్న ప్రశ్న దుర్భేధ్యం. భక్త గోవిందం యీ గ్రంథాల అధ్యయనం చేయడానికి ఈ గ్రంధాలు చాల ప్రయోజనకారం కాగలవు. భక్త గోవింద చివర ప్రచురించిన 'సృష్టి పరిణామం' పటం చాలా అర్థవంతంగా సత్య చైతన్యంగా, ఆధ్యాత్మిక విద్యార్థులకు వెలుగుబాటగా రాణిస్తుంది.

జీవితము, సృష్టి, ప్రకృతి, పరమాత్మ అధ్యయనం చేయడానికి ఈ గ్రంథాలు చాలా ప్రయోజనకారం కాగలవు. భక్తగోవిందం కృషి,

రచనా విశ్లేషణ, ఆధ్యాత్మిక సంశ్లిష్ట పొరలను శోధించగల నిశిత దృష్టి ప్రశంసనీయం.

నాకు మిత్రులు, నాతో కలిసి ఎదుగుతున్న ఆధ్యాత్మిక బాటసారి, భక్తగోవిందం యింకా క్రొత్త వెలుగులు చూడాలని నా హృదయపూర్వక ఆకాంక్ష.

కృష్ణానంద, కళాప్రపూర్ణ,
**డా॥ పోతుకూచి సాంబశివరావు**
కేంద్ర సాహిత్య అకాడమీ
తెలుగు సలహా సంఘ సభ్యులు,
అధ్యక్షులు విశ్వసాహితి

ఓం శ్రీ వటపత్రసాయినే నమః

# ఆధ్యాత్మిక జీవనము

## పీఠిక

జీవించాలంటే ఆహారం అవసరం. జీవితం అంటే సుఖ దుఃఖాల సంఘమము. దుఃఖాలని దూరం చేసుకొనటానికి, సుఖాన్ని సొంతం చేసుకోవటానికి 'నవ్వు నజరానా' లాంటి అంశాలు ఉన్నాయి. కేవలం డబ్బే సంతోషాన్నిస్తుందా! లేక మరే కారణాలు మనకి సంతోషాన్ని కలుగజేస్తాయోకూడా చెప్పబడినది.

శాస్త్రాలు చెప్పినట్లు మనిషి అహింసని పాటించాలి. లేదంటే హింస బలవంతుల చేతిలో ఆయుధమైన జీవితాలు నరకప్రాయ మౌతాయి. మనిషిని మంచి మార్గములో నడిపించటానికి గురువు అవసరమెంతైనా ఉంది. అంతేకాదు సాదుసంతుల సాంగత్యము వలన మనిషిలోని పశువత్వం పతనమై మనిషిగా తన ధర్మాన్ని గుర్తిస్తాడు. మానవ జీవితంలో బాల్యం మధురమైనది. పిల్లలు దేవుడు చల్లనివారే. అందుచేత చిన్నపిల్లల మాటలకు చేష్టలకు ప్రత్యేకత వుంది. ఈ విధమైన అంశాలు చెప్పబడ్డాయి.

దైవాన్ని గుర్తించి, స్మరించేవారికి దేవుడు తోడునీడగా ఉంటాడు. దైవధ్యాసన పడ్డవారికి సిరిసంపదలకంటే, చిత్తములోని శివుడే అన్నీ అని భావిస్తారు. అప్పుడు తెలుసుకొంటారు శాంతికి చిరునామాను. శాంతి స్వరూప స్వభావాలు తెలుసుకొంటే, ఆత్మానందం దొరుకుతుంది. సృష్టిలో ఎన్నో లోకాలున్నాయి. అందులో అనేక జీవులున్నాయని శాస్త్రాలు చెబుతున్నాయి. అన్ని జీవులకు అధిపత్యం వహించే మనిషి అంతః కరణము అధిక ప్రాధాన్యత కలిగి ఉన్నది. బాహ్య శరీరంలో దాగి ఉన్నా అంతఃకరణాలు మనిషితో చెప్పరాని చేష్టలు చేయిస్తాయని, ఇవి చేసే మాయాజాలం తెలుసుకొని వాటిని అధికమించడానికి ప్రయత్నించిన మనిషి మహాత్ము డౌతాడు.

మానవతా విలువలు తెలిసిన మనిషి, స్వార్థాన్ని విస్మరించి, పది మందికి పనికి వచ్చే కార్యాలతో బాటు తనదన్న దాన్ని కూడా పంచిపెడతాడు. స్వార్థాన్ని కాలదన్ని పరార్థానికి పాటుపడే త్యాగధనులు ఏకాలంలోను వుంటారు. దాన గుణం కొందరికే వుంటుంది. దాతృత్వం గలవారి లోగిళ్ళు దైవత్వములో ముందుంటాయి. వీరు పూజాది కార్యములు చేసేవాళ్ళను ప్రోత్సహించటమే కాదు, స్వయంగా వారు దైవారాధనలు తగు రీతుల్లో చేస్తారు. ఆదర్శమూర్తులైన సంఘసంస్కర్తలు భగవంతుడే సర్వస్వమని సంకీర్తనల ద్వారా ఇతర సేవల ద్వారా మంచిని పెంచే మహాత్ములు ఆనందమయంగా కాలాన్ని గడిపేస్తారు. ఈ విధమైన ఎన్నో ముఖ్య అంశాలు ఈ కావ్యంలో చోటుచేసుకున్నాయి.

పుట్టిన ప్రతిజీవి మరణించక తప్పదు. మరణించింది పునర్జీవింపక తప్పదు. ఇది గీత ఉవాచ "జాతస్య హి ధ్రువో మృత్యుః" ప్రతి జీవికి గత జన్మకర్మ ఫలకారణంగా. వర్తమాన జీవితం వస్తుంది. పుట్టటం, పెరగటం జీవించటం, గిట్టటం అనేవి శారీరక ధర్మాలు. మానవులు తాము చేసే కర్మలు సంస్కారంగా ఏర్పడతాయి. వీటిని వాసనలంటారు. సుజ్ఞాని యైన మానవుడు సుగుణాలు అలవర్చుకొని, మాయ బంధములోపడకుండా, బుద్ధిని, మనస్సును స్వాధీన మొనర్చుకొని నిష్కామకర్మలు చేసిన దైవానికి దగ్గరవుతాడు.

ప్రతిజీవికి కోరికలు, ఆశలుంటాయి. అవి తగిన మోతాదులో ఉండాలి. అతిగాపోతే అనర్థాలే మిగులుతాయి. ఈ సృష్టి మాయా సంబంధమైనది. అది ఎప్పుడూ జీవిని తనలోనే బంధించి, దైవానికి దూరం చేస్తుంది. మాయా యొక్క మర్మాలు తెలుసుకొని, మనిషి నీతి నియమాలతో ప్రవర్తించి భగవంతుని చేరుకోవాలనే కోర్కెను సఫలం చేసుకోవాలి. మనిషికి మనస్సే అన్నిటికి మూలం. ఆలోచనల్ని ఆచరణల్ని చెయించే మనస్సును యోగసాధనల ద్వారా భక్తి ప్రపత్తుల ద్వారా సేవల ద్వారా నిర్మలంచేసుకొన్న వ్యక్తి, చెప్పేది చేసేది ఒక్కటే ఉంటుంది. అందుకు విరుద్ధముగా ఉండదు.

దేవునికి నమస్కరిస్తాం, పెద్దలకు దండం పెడతాము, గొప్పవారికి సత్పురుషులకు ప్రణామం చేస్తాము. మనిషి ఎంతటివాడు గాని, యోగి, త్యాగి, భోగి, జ్ఞాని, భక్తుడు లేదు దుష్టుడు, దుర్మార్గుడు, చెండాలుడు, దొంగ, దోషి, నరహంతకుడు, రాక్షసుడు, చెడ్డవారు గాని, గొప్పవాడు గాని, తన సమయం వచ్చినప్పుడు ఈ లోకాన్ని విడిచిపెట్టి పోకతప్పదు. చావు పుట్టుకలు ప్రకృతి శాసనాలు. అవి ఎట్టి పరిస్థితులలో నైనా అమలయి తీరుతాయి.

ప్రతి మనిషి శాంతిని కోరుకుంటాడు. మనం ఏ కార్యం చేసినా, చివరగా శాంతి కావాలని, శాంతి మంత్రాన్ని ఉచ్చరిస్తారు. ఓం శాంతి పేరిట సంస్థ కూడా ఉన్నది. ప్రతి కార్యముగింపుకు శాంతి వచనాలు చెప్పటం పరిపాటి. కనుక, ఓం శాంతి గూర్చి వివరంగా వ్రాస్తూ ఈ గ్రంధానికి ముగింపు ఇచ్చాము.

ఈ గ్రంతకర్త ఆంధ్రప్రదేశ్ న్యాయ స్థానంలో ఒక న్యాయ నిర్ణేతగా పనిచేసి, తన దైనందిన కార్యక్రమాలతో బాటు, ఆధ్యాత్మికం మీద దృష్టి పెట్టి శ్రీమద్భవద్గీత 18 అధ్యాయాలును 18 గ్రంధాలుగా మలచి ప్రజలకు అందజేసారు. భక్తిపరమైన ఇతర గ్రంథాలు వ్రాసినారు.

గీతా గ్రంధాల తరువాత తనకున్న ఆధ్యాత్మికానుభవంతో ఆధ్యాత్మిక జీవనం మీద మరింత వ్రాయాలని సంకల్పించి, ఈ కావ్యం వ్రాయటం జరిగింది. ఈ కావ్యరచనలో తోడ్పడిన ప్రతి ఒక్కరికి నా ధన్యవాదాలు. అదే విధంగా ఆర్థిక సహాయం చేసి ఈ గ్రంథం అచ్చు వేయుటకు కారకులైన టి.టి.డి. దేవస్థానము వారికి ప్రత్యేక ధన్యవాదాలు.

ఆధ్యాత్మికవేత్త

**భక్తగోవిందం**

# వినిమయ వితరణ

సృష్టి పుట్టిన కొన్ని లక్షల సంవత్సరాలకు జీవులు జన్మించాయి. ఈ జీవరాసులు వివిధ దశలలో పరిణామము చెంది వానరుడు నరుడుగా మార్పు చెందాడు అని విజ్ఞానశాస్త్రాలు వివరిస్తున్నాయి. తత్త్వశాస్త్రాలు ప్రకృతి పుట్టుక ఈశ్వర సంకల్పముతో జరిగిందని, అద్వైత బ్రహ్మ ద్వైత సృష్టిని ఆవిర్భవింపజేసాడని తెలియజేస్తున్నాయి.

జీవుల పుట్టుక స్థానము ఏదిగాని అవి సూక్ష్మ రూపముగా నుండి దిన దినము క్రమాభివృద్ధి నొంది, స్థూల శరీరము ధరించి కొంతకాలము జీవించి ఆయువు తీరినంతనే మరణించుచున్నవి. సృష్టితోపాటు అందుబుట్టిన ప్రతిజీవి మరణిస్తుంది. మరణించినది మరల జన్మిస్తుంది. ఇది ప్రకృతి శాసనం. జాతస్యహిధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ తస్మాద పరిహార్యేஉర్థేన త్వం శోచితు మర్హసి" (భ.గీ.)

ఈ విధంగా సూక్ష్మ జగత్తు వివిధ దశలలో పరిణామంచెంది, స్థూల రూపము ధరించి అందు జన్మించిన జీవులు వివిధ కర్మలనాచరించగా తగిన సమయం వచ్చినప్పుడు ఇవన్నీ కాలగర్భంలో కలిసిపోవుచున్నవి". ఇదే సృష్టి పరివర్తనము.

పరమాత్మ నుండి త్రిగుణరూపమైన పరాశక్తి ప్రధానముగా ఆవిర్భవించినది. తరువాత పరమాత్మనుండి క్రియాశక్తి వెలువడింది. ఇది సూత్రాత్మకమయింది. ఆ తరువాత జ్ఞానశక్తి ఉదయించింది. ఇది మహతత్త్వం అయింది. తరువాత అహంకార శక్తి వెలువడింది. ఇది జీవనోపాధి అయింది. జ్ఞానశక్తి దేవతా శక్తులుగా, క్రియాశక్తి ఇంద్రియశక్తులుగా, అర్థశక్తి విషయాలుగా, ఫలాశక్తి సుఖదుఃఖాలుగా పరిణమించాయి.

ఈ శక్తులు, వాటి పరిణామ శక్తులు అయా రూపాలలో నున్న బ్రహ్మమే. పరమాత్మ సృష్టి సంకల్పములో మొదట పంచభూతాలను సృజించాడు. ఈ భూతాల కలయిక వలన బ్రహ్మాండము ఏర్పడినది. ఈ అండములో భగవానుడు ప్రవేశించాడు. అప్పుడు విరాట్రూపం ఏర్పడినది.

. విరాట్పురుషుని ఇంద్రియాలతో జ్ఞాన కర్మేంద్రియాలు, వాటి స్వరూప స్ఫురణతో జ్ఞానం, ప్రాణం వలన దేహేంద్రియ క్రియాశక్తులై, సమిష్టి వ్యష్టి, జీవరాశి ఏర్పడినది.

సృష్టిలోని క్రియా శీలక శక్తులకు ఒక్కొక్క ప్రత్యేకత ఉన్నది. అత్యంత ప్రధానమైనది "కాలం" దీని స్వరూప స్వభావాలవు గూర్చి తెల్పుకుందాము. కాలం భగవస్వరూపం. త్రిగుణాల పరివర్తన కాలం. పరమాత్మకు అద్యంతాలులేవు. అదే విధముగా కాలానికి అది అంతములు లేవు. అది నిర్విశేషం, కాలం అవ్యక్తరూపం.

పరమాత్మ ప్రథమ రూపాంతరం మహత్తు. భగవానుడు సంకల్పించినప్పడు ఆయన శక్తికి చలనం కలుగుతుంది. ఈ చలనం వల్ల మహత్తత్త్వము ఉదయించింది. ఈ మహత్తు జగత్తు అంకుర కారణం. పరమాత్మ తత్త్వములలో అంతరముగా ఉన్నప్పడు పురుషరూపాన ఉంటాడు. బహిర్భాగంలో ఉన్నప్పడు కాల రూపమున ఉంటాడు. కనుక భగవంతుడే కాల రూపంలో ఉన్నాడు.

భగవంతుని సాకార స్థూల రూపం విశ్వం. ఈ విశ్వం భూత వర్తమాన భవిష్యత్తను మూడు అంశములుగా నున్నది. ఇది సమిష్ట ప్రపంచము లేక బ్రహ్మాండము. ఇది భగవశ్చరీరం. దీనిలో పరమాత్మ సూక్ష్మశరీరంతో ఉంటాడు. ఇదియే కాల రూపం.

పరమాత్మ సృష్టి సంకల్పముతో ఆయనశక్తి, కాల, స్వభావ, కర్మ రూపాలు దాల్చాయి. కాల రూపాంశము భగవశ్శక్తి యందు

ముప్పిరిత్రాడులా పెనవేసుకొని త్రిగుణాలను కదిలిస్తుంది. స్వభావాంశము పరిణామావస్థను కూర్చుతుంది. కర్మాంశము దానిని విస్తరిస్తుంది. భగవత్ శక్తి మొదట కాలరూపాంశముగా ఏర్పడినది. అందుకే కాలము స్వయం భగవానుడు.

సృష్టి మహాకల్పం, అవాంతర కల్పంగా గ్రహించబడినది. మహాకల్పములో ప్రకృతి, మహత్తు ఏర్పడ్డాయి. అవాంతర కల్పంలో స్థావరాదులు కలిగాయి. కాలానికి స్థూల, సూక్ష్మ లక్షణాలున్నాయి. కాల పరిణామం కల్పం, అవాంతర కల్పం, మన్వంతరుగా విభజింపబడినవి. ఇప్పుడు జరిగేది పాద్మ కల్పం. బ్రహ్మకు పగటి భాగం.

"అహమ్ ఏక అక్షయః కాలః" అనంతమయిన కాలము బగవానుడని గీతావచనము. అవ్యక్తమైన కాలంలో భగవంతుని లీలలు కనిపిస్తాయి. భగవానుని కార్యకలాపాల వ్యవధిని బట్టి కాల విభాగాలు ఏర్పడ్డాయి. పరిచ్ఛిన్నమైన బ్రహ్మ స్వరూపమే ఈ విశ్వము. ఇది కార్యపదార్థం.

అతి స్వల్పమైనది పరమాణువు. సూక్ష్మాతి సూక్ష్మమైనది విభాజన లేనిది కూడాను. పరమాణువుకు క్షణం అనే పేరున్నది. పరమాణువుల కలయికవల్ల ప్రపంచము విస్తరించినది.

రెండు పరమాణువులు కలిస్తే అణువగును. రెండు అణువులు కలిసి ఒక త్రసరేణువు అగును. సూర్యకిరణాలు ఇంటి ద్వార బంధ రంధ్రాల ద్వారా ఇంటిలో ప్రవేశించే కాంతిలో సన్నని నెరసులు కనబడతాయి. ఇవి చాలా తేలికగా ఉండి క్రింద పడక గాలిలోనే ఎగురుతుంటాయి. వీటినే త్రసరేణువులంటారు.

ఒక త్రసరేణువును చూడటానికి పట్టే సమయాన్ని త్రుటి అంటారు. 100 త్రుటుల కాలం ఒక వేధ. మూడు వేధల కాలం ఒకలవం. మూడు లవముల కాలం ఒక నిమీషము. మూడ నిమేషాలు

ఒక క్షణం. ఐదు క్షణాలు ఒక కాష్ట. పదిహేను కాష్టలు ఒక లఘువు. 15 లఘువులు ఒక నాడి లేక గడియ, రెండు గడియలు ఒక ముహూర్తం. ఆరు లేక ఏడు గడియలు ఒక జాముకాలం. నాలుగు జాములు ఒక పగలు. అంతే కాలం రాత్రి, రెండు కలిపి ఒక దినమగును.

కాలాన్ని మనాల్లో లెక్కిస్తారు. 60 లిప్తలు ఒక విఘడియ. అంటే 24 సెకన్లు. అరువది విఘడియలు ఒక ఘడియ లేక 24 నిమిషములు. 2 1/2 ఘడియలు ఒక గంట కాలము. 2 ఘడియలు ఒక ముహూర్తం లేక 40 నిమిషములు. 7 1/2 ఘడియలు ఒక ఝాము. మూడు గంటల 8 ఝాములు ఒక రోజు లేక 24 గంటలు. 7 రోజులు ఒక వారము. 2 వారాలు ఒక పక్షము. రెండు పక్షాలు ఒకనెల. 12 నెలలు ఒక సంవత్సరు లేక 365 రోజులు. 100 సంవత్సరాలు నరులకు ఆయువు. ఇది కలికాలము, మనుష్య మానముతో నిర్ణయించిన కాల విభాగం.

మనుష్య మాన ప్రకారం ఒక నెల పితృదేవతలకు ఒక అహోరాత్రం. అనగా ఒకరోజు. పితృదేవతల కాలమానంలో 12 రోజులు దేవతలకు ఒక దినము. మనుష్య మానంలో ఇది ఒక సంవత్సరము. మానవులకు 100 సంవత్సరాలు ఆయువు మాదిరిగా పితృదేవతలకు, దేవతలకు వారి కాలమానం ప్రకారం 100 సంవత్సరాలు వారి పరమాయువు. మనుష్యమానంలో పితృదేవతలకు 3,000 సం॥ దేవతలకు 36,000 సంవత్సరాలు ఆయుష్కాలం.

"కాలః కలయతామహం" లెక్కలు చూచువారిలో కాలము దైవము. పరమేశ్వరునికి తన సృష్టియందు గల అనుగ్రహమే కాలం. భగవానుడు సృష్టి క్షేమాన్ని కోరి తన అంశాన్ని విభజనగావించాడు అదియే కాలము. ఋక్సంహితలో కాలాన్ని గూర్చి కాలమనే నిత్య చక్రానికి పన్నెండాకులున్నాయని, నిరంతరము భ్రమించే ఈ చక్రానికే 720 కొడుకులున్నారు అవి (360-360) పగలు, రాత్రులు అని చెప్పబడినది.

యజుర్వేదము అంకగణితము బీజగణితము, రేఖాగణితము నకు సంబంధించిన విద్యను తెలియజేయుచున్నది. ఏ పదార్థముల సంఖ్య తెలియదో దానిని తెలుసుకొనుటకు ఉపయోగించునది బీజగణితము. దీని సంకేతముల వలన అజ్ఞాత సంఖ్యను తెలుసుకొనవచ్చును.

సృష్టి ఉత్పత్తి స్థితి లయములను బ్రహ్మ యొక్క పగలు, రాత్రిగ లెక్కకట్టెను. మన్వంతరము మారినప్పుడు సృష్టి నైమిత్తిక గుణములో మార్పు వచ్చును. వర్తమాన సృష్టి కి కల్పమని, ప్రళయము నకు వికల్పమని పేర్లు పెట్టి కాలసంఖ్యను సూర్య సిద్ధాంతాది జ్యోతిష్యగ్రంధాలలో సంజ్ఞామానమును ప్రత్యేకమైన పద్ధతిలో చూపించారు.

| | | |
|---|---|---|
| 0 | - | ఒకటి |
| 10 | - | పది |
| 100 | - | నూరు |
| 1000 | - | వెయ్యి |
| 10000 | - | పదివేలు |
| 100000 | - | లక్ష |
| 1000000 | - | పదిలక్షలు |
| 10000000 | - | కోటి |
| 100000000 | - | పదికోట్లు |
| 1000000000 | - | శతకోటి |
| 10000000000 | - | అర్బుదము |
| 100000000000 | - | న్యర్బుదము |
| 1000000000000 | - | ఖర్వం |
| 10000000000000 | - | మహాఖర్వం |
| 100000000000000 | - | పద్మం |

| | | |
|---|---|---|
| 1000000000000000 | - | మహాపద్మం |
| 10000000000000000 | - | క్షోణి |
| 100000000000000000 | - | మహాక్షోణి |
| 1000000000000000000 | - | శంఖము |
| 10000000000000000000 | - | మహాశంఖము |
| 100000000000000000000 | - | క్షితి |

ఈ విధముగా 1 ప్రక్కన 21 సున్నాలు చేర్చిన మహక్షితి, 22 సున్నాలు చేర్చిన క్షోభము, 23 సున్నాలు చేర్చిన మహా క్షోభము, 24 సున్నాలు చేర్చిన నిధి, 25 సున్నాలు చేర్చిన మహానిధి, 26 సున్నాలు చేర్చిన పదార్థం, 27 సున్నాలు చేర్చిన మహా పదార్థం, 28 సున్నాలు చేర్చిన అనంతరం, 29 సున్నాలు చేర్చిన సాగరం, 30 సున్నాలు చేర్చిన అవ్యాయము, 31 సున్నాలు చేర్చిన అమృతం, 32 సున్నాలుచేర్చిన అచింత్యము, 33 సున్నాలు చేర్చిన అమేయము, 34 సున్నాలు చేర్చిన భూరి, 35 సున్నాలు చేర్చిన మహాభూరి.

గణిత మొక శాస్త్రము. ఇది వివిధ సంఖ్యామానాల్ని తెలియజేస్తుంది. ప్రపంచములోని వివిధ దేశాలలో సంఖ్యా మానాన్ని భిన్న భిన్న పద్ధతిలో గణిస్తారు. ఇందు దశాంత పద్ధతి ముఖ్యమైనది. అంటే '0' నుండి '9' అంకెల వరకు గలది. ఇది బారతదేశంలోనే ప్రారంభమైనది. శూన్యము (0) జిరో అనే భావనకు మూలస్థానము భారతదేశం. '1' నుండి '9' సూచించే సంఖ్య అరబిక్, ౧-౯ తెలుగు, 1-(1×) రోమన్ పద్ధతి. ఈ విధముగా వివిధ దేశాలు సంఖ్యామానాన్ని తయారు చేసుకొన్నాయి. గణతశాస్త్రము పుట్టటానికి కారణం కాలం.

శాస్త్రవేత్తలు కాలాన్ని సంవత్సరము, అయనము, ఋతువులు, మాసం, పక్షం, దినం అని ఆరు విధాలుగా విభజించి ధర్మాచరణమునకు, శ్రేయస్సుకు మార్గాన్ని చూపించారు. సంవత్సరంలో ఐదు భాగాలున్నాయి. అయనాలు-2, ఋతువులు - 6, మాసములవు

-12, దినము-24 గంటలు లేక 60 ఘడియల కాలం, ఇది సూర్యోదయము మొదలుకొని రాత్రి గడిచి మళ్ళీ సూర్యోదయము వరకు గల కాలం.

సూర్యుడు 12 రాసులందు చుట్టి వచ్చుటకు ఒక సంవత్సర కాలము పట్టును. ఇట్టి సంవత్సరములు 4,32,00 కలిగయుగము. (2) అట్లే 8, 64,000 సంవత్సరాలు ద్వాపర యుగము. (3) 12,96,000 సంవత్సరాలు త్రేతాయుగము, (4) 17, 28,000 సంవత్సరాలు కృతయుగముగా మొత్తం 43,20,000 సంవత్సరాలు ఒక మహాయుగము.

71 మహాయుగాలు ఒక మన్వంతరము. 14 మన్వంతరాలు బ్రహ్మదేవునికి ఒక పగలు. బ్రహ్మయొక్క పగటి కాలము 1000 మహాయుగాలు. ఇది ఉదయ కల్పము. ఇంతే పరిమాణము గలరాత్రి కాలము క్షయ కల్పము. ఉదయ, క్షయ కల్పాలు రెండును బ్రహ్మకు అహోరాత్రము అనగా ఒక దినము. ఇటువంటి 360 దినములు బ్రహ్మకు ఒక సంవత్సరము. ఇట్టి 100 సంవత్సరాలు చతుర్ముఖ బ్రహ్మ యొక్కఆయుస్సు. ఈ విధంగా అంకెలతో, సంఖ్యలతో గణాంకాలతో లెక్క కట్టలేని కాలము స్వయం పరబ్రహ్మ.

ఈ కాలం చక్రం లాగు తిరుగుతూ ఉంటుంది. ఇది 12 రాసులు కలిగి భువన కోశంలో గిరగిరా తిరుగుతూ ఉంటుంది. ఆదిత్యుని ఆదేశానుసారము గ్రహాలు, నక్షత్రాలు, ఇతర తారలు తమ తమ పరిధులును దాటక ఈ చక్రంలో పరిభ్రమిస్తూ కాల పరివర్తనము తెలుపుతుంటాయి.

కాలమానానికి మూలపురుషుడు సూర్యుడు. ఈయన 12 రూపాలుగా విభజించుకొని 2 మాసాలు ఒక ఋతువుగా కల్పించి వానికి తగినట్టుగా శీతోష్ణాది గుణాలను ఏర్పరచాడు. సూర్యుని చుట్టూ

తిరిగే గ్రహాలు ఒక నియమిత వేగంతో నిర్ణీత, కక్ష్య మార్గంలో తిరుగుతుంటాయి. భూమి ఒక గ్రహం. అది తన చుట్టూ తాను తిరుగుటకు 24 గంటల కాలం పడుతుంది. సూర్యుని చుట్టూ తిరగడానికి 365 రోజులు పడుతుంది. భూభ్రమణం వలన రాత్రింబవళ్లు, ఋతువులు, శీతోష్ణాదులు కలిగాయి. భూమి వయస్సు సుమారు 460 కోట్ల సంవత్సరాలు అని ఒక అంచన.

దైవమే సూర్య దేవుడిగా అవతరించాడు, ప్రాణి కోటి మనుగడకు మూల కారకుడైనాడు. ఈ విశాల విశ్వంలో సూర్యుడు ఒక నక్షత్రం. ఈ సూర్యుని వయస్సు ఇప్పటికి 5 వందలకోట్ల సంవత్సరాలు గడచాయని ఇంకో 500 కోట్ల సంవత్సరాలు ప్రకాశిస్తాడని శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుచున్నారు. సూర్యతలంపై సుమారు $5,540^0$ ఉష్ణోగ్రత ఉంటుంది.

సూర్యభగవానుని ఆత్మశక్తి కాలరూపంలో ప్రకాశిస్తూ ఉంటుంది. కర్మభూమైన భారతదేశమందు ప్రజల పంచాంగముననుసరించి కార్యములు జరుపుకొంటారు. వేదాంగమగు జ్యోతిశ్శాస్త్రం మానవులకు అన్ని విధాల ఉపయోగపడుతుంది. జ్యోతిశ్శాస్త్రము జాతక, ముహూర్త, సిద్ధాంత భాగములతో ఐదు (5) అంగములతో కూడిన పంచాంగము మానవుల దైనందిన జీవనయాత్రలో సహాయపడుతుంది.

తల్లి గర్భంలో పిండోత్పత్తి జరిగిన దగ్గర నుండి ఆ శిశువు భూమి మీదకు వచ్చింది మొదలు అంటే జన్మించడం దగ్గర నుండి నిత్యనైమిత్తిక కామ్యకర్మలు తరువాత ఆ జీవి మరణించిన తరువాత కూడా చేయు కర్మలకు కూడా పంచాంగమే ఆధారం. మానవ జీనవ విధానమే కాదు చరాచరసృష్టి పరిణామం, నడక, వయస్సును చెప్పేది కాలమేకదా!

ఐన్‌స్టీన్ విశ్వాన్ని, కాలాన్ని కలిపి కాలంగా గుర్తించాడు. కాల గమనంలో అన్ని పదార్థాలు మార్పులు చెందుతుంటాయి. కాని కాలం మాత్రం మారదు. అవధులు, పరిధులు లేనిదే కాలం "కాలో సర్వస్య భక్షకః" ప్రపంచంలో సర్వాన్ని కాలం నమిలేస్తుంది. అది మాత్రం కాలంగానే ఉంటుంది. పరమాత్మకు మరో పేరు కాలం. అందుకే "గీత"లో భగవంతుడు కాలం నావిభూతి అంటాడు.

కాలశక్తికి ఆశ్రయభూతుడై అంతరిక్షంలో ఎల్లప్పుడు ప్రయాణించే ఆదిత్యుడు కాలునిరూపం. కాలాన్ని మానంతో కొలిచి, విభాగించి యుగాలుగా చెప్పారు. సృష్టిలో మహర్లోకం మొదలు బ్రహ్మలోకం వరకు ఇతర లొకాలున్నాయి. మానవ కాలమాన ప్రకారం వాటికి కూడా 1000 మహాయుగాలు ఒక పగలు, అట్లే 1000 మహాయుగాలు ఒకరేయి. ఈ లోకాలకి 100 సంవత్సరాలు ఆయుప్రమాణం. బ్రహ్మ పగటికాలంలో సృష్టికావించి రాత్రికాగానే శయనిస్తాడు. అప్పుడు ప్రళయం సంభవించి లోకాలన్ని కాల గర్భంలో కలిసిపోతాయి. మరల బ్రహ్మ మేలుకొని పునఃసృష్టి గావించుతాడు. కాని కాలము మాత్రము మార్పుని లేకుండా ఆద్యంతాలు లేకుండా నిర్విశేషంగా ఉంటుంది.

"కాలోఽ స్మిలోక క్షయ కృత్ప్రవృద్ధో,
లోకాన్ సమాహర్తు మిహప్రవృత్తః" (భగ.గీత.)

ప్రపంచము నెల్ల నశింపజేయు బలిష్టమైన కాల స్వరూపుడను, లోకాలను పెంపొందించువాడను, హానిని నశింపచేయువాడను నేనే. ఇప్పుడు లోక సంహారమే నా ప్రవృత్తి అంటాడు గీతాచార్యుడు.

మానవ ప్రవృత్తులు వారివారి భావాల మీద ఆధారపడి రకరకాలుగా ఉంటాయి. కాని భగవానుని ప్రవృత్తి సృష్టిని పుట్టించడం, దానిని వివిధ గతుల్లో పెంచడం, పెరిగిన దానిని విరగ్గొట్టి తనలో విలీనం

చేసుకోవటం. సృష్టిస్థితి లయలు ఆయన ప్రవృత్తి. దీనికి కాలం ఒక అంశము. కాలము భగవంతుని శక్తి విశేషము. అయితే లోక వ్యవహారం కోసం ఆకాశ మార్గంలో సూర్య సంచారాన్ని బట్టి కాల స్వరూపం తెలియజేస్తుంది. సూర్యభ్రమణం వల్లనే బ్రహ్మాండానికి వయస్సు ఏర్పడింది.

"కాలఃఅస్మి" నేను లోకాల్ని హరించే కాలుడను. సూర్యుడు కాలానికి, యముడు మరణానికి అధిపతులు. చలనం కలిగిన ప్రతిది మరణించేదే. ఆ మరణాన్ని యముడు కలుగజేస్తాడు. అందుకే ఆయన కాలుడు. ఈయన జీవులను మాత్రమే హరిస్తాడు. కాని పరమాత్మ మృత్యురూపంలో సర్వజీవులతోబాటు వృధి వ్యాధిలోకాలన్నింటిని నాశనం చేస్తానంటున్నాడు. నేను శక్తివంతమగు కాలమునని చెబుతున్నాడు భగవానుడు. భగవన్నామాలలో మహాకాలుడు ఒకటి.

కాలము సృష్టికి పూర్వము, లయము తరువాత కూడా అఖండాకారముగా నున్నది. ప్రాణుల స్థితిగతులకు ఆటంకము గానున్నది. కాలము మానవుల నడవడికలకు కొలమాన మగుచున్నది. కాలము మిగిలిన నాలుగు భూతములను తనయందు నిక్షిప్తముగావించుకొనియున్నది. కాలం మానవుల ప్రతి ప్రవర్తనను తనలో నింపుకొని ఉన్నది. కనుకే కాలం మహాశక్తివంతమైనది. భూతవర్తమాన భవిష్యత్తుగా లెక్కించే కాలం సృష్టిలోని ప్రతి పదార్థము ప్రతి నిమిషము పరివర్తనకు కారణమగుచున్నది.

కాలం గూర్చి తెలియని వారుండరు. కవులు, రచయితలు కాలం మీద కవిత్వాలు, కథలు మరియు వివిధ పద్ధతుల ద్వారాకాలాన్ని వర్ణించి ఉన్నారు. ఏదైనా ఒక సంఘటన జరిగినప్పుడు దానికి కాలమే సమాధానం చెబుతుందనిని, విధి విధానము కాలమే నిర్ణయిస్తుందని, నీకేమి పోయేకాలం వచ్చిందని, రాజులు ఫకీర్లుగా, వారువీరుగా, వీరు వారుగా కాలమే నిర్ణయిస్తుందని, రేపేమి జరుగుతుందో చూద్దామని,

ఈ పరిపాలన వీళ్ళెంత కాలంవెలగబెడతారో చూద్దామని. ఈ పార్టీ వారి మిడసిపాటు ఇంకెంతకాలం, ఆ పార్టీవారు రాకపోతారాని, ఓడలు బండ్లు, బండ్లు ఓడలుగా మారవాయని, జరిగేది తెలియదు, జరగబోయేది ఎవడు చూడొచ్చాడని, మాకు రాకపోతాయా మంచిరోజులని, కాలం గూర్చి ఎంతెంతగానో మట్లాడటం కద్దు.

ప్రేమరోగికి కాలమే మందు. మానసిక రోగికి సమయమే చికిత్స. మానవుల స్థితి గతులను చెప్పేదే కాలం. దేవదానవులను మార్చేది కాలం. మంచి చెడ్డలను చెప్పేదే కాలం. త్రికాలలే కాదు అందర్ని తీసుకుపోయేది కూడా కాలమే. ఎవరున్నా లేకున్నా, ఏదున్నా లేకపోయినా, ఎవరితో సంబంధం లేకుండా ఒంటరిగా సాగే కాలం, చిరకాలం చిరంజీవిగా ఉండి పరివర్తన చెందేది కాలం, చివరకు మిగిలేది కూడా కాలమే.

చరిత్ర అంటే కాల నిర్ణయమే. ప్రతి సమస్యకు పరిష్కారం చూపేది కాలం. సృష్టిలో అది ఏదిగాని జన్మ తీసుకున్నది మొదలు అది మళ్ళీ సృష్టిలో కలిసిపోయే వరకు పరివర్తన చెందుతూ ఉంటుంది. బ్రహ్మ మొదటి జన్మ తీసుకున్నాక సృష్టిని విస్తరించటానికి ఆ రూపం పరివర్తన చెందగా కొత్త రూపం దాల్చి కొన్నింటిని సృజిస్తాడు. ఆ విధంగా సూక్ష్మరూపంలో ఉన్న సృష్టిని అనేక పరివర్తనలు గావించి బ్రహ్మాండాన్ని నిర్మించాడు. ఇప్పుడున్న విశ్వం యొక్క వయస్సు 1500 కోట్ల సంవత్సరాలట. ఇంకా ఈ విశ్వం విస్తరిస్తుందట.

ఇప్పటి వరకు అనేక పరిణామాలు పరివర్తనలు చెందిన విశ్వము అర్ధశాతము జరిగిపోయినదట. ఇంకో అర్ధశాతం భవిష్యత్ రూపంలోనున్నదని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ఈ విధంగా ప్రతి నిమిషం పరివర్తన చెందే కాలం అనంతమైన పరమాత్మ స్వరూపం. కాలమే అన్నిటికీ మూలాధారం. కాల స్వభావమే పరివర్తనము. అదే జీవన రహస్యం.

"సత్త్వేవ సోమ్యే దమగ్ర ఆసీదేకమే వాద్వితీయమ్" (ఛాం.ఉ.) సోమ్య! సృష్టి ప్రారంభమయిన సత్తే ఉండెను. అది ఏకము, అద్వితీయము. సృష్టి ఆరపారంభమునకు ముందు సత్పదార్థమే ఉన్నది. అది ఏకము. అద్వితీయమని శ్వేతకేతుకు తనతండ్రి ఉపదేశించెను. దాని నుండి భూతసృష్టి త్రయము ఏర్పడెను. ప్రపంచములోని పదార్థములన్ని అగ్ని, జలము, అన్నము చేత ఏర్పడినవే. వాటియందు సద్రూప బ్రహ్మం ప్రవేశించి నామ రూపముగల జగత్తును విస్తృతము గావించెను.

"సత్త్వం స్థావర జంగమమ్" (భ.గీ.) ఈ విశ్వమందు స్థావర జంగమాత్మకమగు భూతములు బ్రహ్మము వలనే పుట్టుచున్నవి. ఈ జగత్తులో రెండు రకాలైన పదార్థాలున్నాయి. ఒకటి కదిలేది, రెండ కదలనిది. ఇది తిరగాలి కాదు. ఈరెండింటి యందు ప్రాణమున్నది. కదలనివి స్థావరాలు. హిమాలయాలు, మేరుపర్వతం, గ్రహాలు, చెట్లు, పుట్టలు వగైరా.

మేరుపర్వతం, హిమాలయాలు దేవతలకు స్థావరాలు. ఇవి అనేక మహిమలు కలిగి ఉన్నవి. కొన్ని గ్రహాలు కదలవు. కొన్ని కదులుతాయి. వీటిలో అద్భుతమైన శక్తులున్నాయి. చైతన్యమైన వాటిలో కొంతశక్తి ఉంటుంది. చెట్లు చేమలు వీటిలో ప్రాణమున్నదని అవి కూడా ఇతర ప్రాణులవలె సుఖదుఃఖాలు అనుభవిస్తూ చావు పుట్టుకలు కలిగి ఉన్నవని శాస్త్ర ప్రమాణాలు చెప్పచున్నాయి. అయితే వీటికి గమనమున్నదా అంటే లేదనేది అందరూ చెప్పేదే.

జంగములు : కదలాడేవి జరాయుజములు. మావితో జన్మించే మనుష్యులతో బాటు జంతువులు వగైరా. అండజములు గ్రుడ్ల నుండి జన్మించిన తాబేళ్ళు, పాములు, బల్లులు, ఈగలు మొదలగునవి. స్వేదజములు చెమట వలన పుట్టిన పేలు, కొన్ని క్రిములు వగైరాలు. ఉద్భిజములు భూమిని చీల్చుకుపుట్టిన చెట్లు, క్రిములు, వగైరాలు.

జలజములు నీటినుండి పుట్టినవి చేపలు, కొన్ని చెట్లు ఇతర జంతువులు, క్రిములు పురుగులు వగైరాలు. ఈ విధముగా జగతంతా చరాచరములతో, 14 భువనబాంధములతో అలరారుచున్నది.

ఇంతటి అద్భుతమైన సృష్టి, ప్రకృతి పురుషుల సంయోగము వలన ఏర్పడినది. ఈ నామరూపములు గల జగత్తును నడిపించే అదృశ్యశక్తి ఏదో ఉన్నదనేది అందరూ అనేదే. భగవానుని సృష్టిలో ఎన్నో లోకాలున్నాయి. ఆ లోకాలన్నింటిలో జీవరాసులున్నాయి. అన్ని లోకాలకంటే స్వర్గలోకం సమస్త భోగభాగ్యాలతో అందర్ని ఊరిస్తుంది. నేనైతే భూలోకం అందునా భారతదేశం ఆ స్వర్గలోకం కన్నా మిన్నా అనుకుంటున్నాను.

చేసుకొన్న వాడికి చేసుకొన్నంత మహదేవా అని, ఇక్కడ ఎవరికి ఏమితక్కువైనది. కొంతమంది దరిద్ర నారాయణులను, ఆకలితో మాడిపోయే వారిని, అనారోగ్యంతో కుమిలిపోయే వారిని తప్పించితే, కొన్ని వర్గాలవారు అన్ని భోగాలను అనుభవిస్తున్నారు. భారతదేశంలో ఇప్పుడు రాజకీయ నాయకులే ప్రధమ పౌరులు. దేశాన్ని, రాష్ట్రాలను ఏలటంతో బాటు స్వర్గసుఖాలకు కావలసిన సౌకర్యాలు, వసతులు, వారికే కాదు తరతరాలకు కూడా అమర్చిపెడుతున్నారు, అనుభవిస్తున్నారు.

రెండో తరగతి వారు పెద్దపెద్ద వ్యాపారవేత్తలు, దేశదేశాలలో నున్న సంపదను సద్వినియోగం చేసుకొని అతి సంపన్నులై పోయారువీరు. వాళ్ళ భవంతులలో శుభ కార్యాలు జరుగుతున్నాయంటే ఆకాశమంత పందిళ్ళుఅంటే అన్ని దేశాలలో పందిళ్ళు వేయించి, అన్ని దేశాలలో ఆయా కళలలో నైపుణ్యం సంపాదించిన వారి చేత ఆటపాటలు, వగైరాలు చేయిస్తూ, దిక్కులు పిక్కటిల్లే జేసే కార్యక్రమాలు చేయించి 'భళా' ఆనాటి కుబేరుడేమి చేసాడేమో గాని దానికి మించిన విధంగా మన శ్రీమంతుడు జరిపించాడని దేశదేశాల ప్రజలు ముక్కుమీద వ్రేలు

వేసుకొని చెప్పుకొనేలాగు చేయటం లేదా! స్వర్గంలో ఇంతకంటే బాగా చేస్తారంటే 'డౌటే'. ఈ కుబేరులు కూడా ప్రథమ తరగతి పౌరులే కదా!

ఇకపోతే అత్యుత్తమ స్థాయి సర్వీసు చేస్తున్నవారు ఐ.ఎ.యస్., ఐ.పి.యస్., కేటగిరికి చెందినవారు కూడా మేమేమి తక్కువ కాదని ప్రథమ పౌరుల స్థయికి తగ్గట్టు పేరు సంపాదిస్తూ శుభ సుఖ కార్యాలు అలాగే జరిపిస్తున్నారు.

పైసా పెట్టుబడి లేకుండా అందరిచేత మ్రొక్కించుకొని, కేవలం దీవెనలిచ్చి కోట్లు గడించి ఈ దేశంలో ఇప్పట్లో ఈ బాబా, ఈ స్వామి, ఈ మహారాజ్. ఈ మాయమ్మ యే మిన్న యని చెప్పించుకొనే జ్ఞాన రూపులు, అంతా మాయగా జీవితం అనుభవించటం లేదా! స్వర్గంలో ఇంతకంటే స్వామిజీలు సౌఖ్యాలు పొందుతున్నారంటే గొప్పడౌట్. ఈవిధంగా భూలోకం అందునా భారతావని ఆ స్వర్గం కన్నా మిన్న అంటాను నేను.

ఇదంతా భావావేసంతో వ్రాస్తున్నాడు అనుకుంటున్నారా! యదార్థాన్ని అట్లే చెప్పకూడదని పెద్దలన్నారు. "సత్యం బ్రూయాత్ ప్రియం భూయత్ నబ్రూయత్ సత్యమ ప్రియః" యదార్థవాదులు పనికిరాని వాళ్ళు. సత్యానికి భయపడే పిరికివాళ్ళు అలాగే అంటారు. దానికి చిన్న సవరణ ఏమిటంటే? చాలా ఎక్కువ మంది నీతి నిజాయితీగా నడిచే వాడంటే ఇష్టపడతారు. కాని సమయం వచ్చేసరికి అవినీతి పరుడికి, మాటకారికి, మోసకారికి ఓటువేస్తారు. ఇదేక్కడి న్యాయమో వాళ్ళకే తెలియాలి.

భూలోకంలో ఎన్నోన్నో దేశాలు, ఆయాదేశాల ఆచార వ్యవహారాలు సాగిస్తూ జీవిస్తున్న జనం. ఎక్కువ జనం నవీన నాగరిక జీవనం సాగిస్తున్నవారే. సృష్టిలో జీవులు ఉద్భవించినప్పటి నుండి ఎన్నెన్నో మార్పులకు చేర్పులకు లోనయి ప్రస్తుతం మనం చూస్తున్న జన జీవనం సాగిపోతుంది.

ఒకసారి గతంలకి తొంగిచూస్తే సృష్టిలోని జీవులు చిత్ర విచిత్రమైన మార్పులు చెంది ఇప్పటి రూపములు వచ్చిన సంగతి తెలుస్తుంది. ఇప్పటికి సుమారుగా భూమి పుట్టి 460 కోట్ల సంవత్సరాలు అయినదని శాస్త్రజ్ఞుల అంచన. భూగోళంపై కనబడే జీవకోటి 65 కోట్ల సంవత్సరాలకు పూర్వం నుండి ఉన్నవని కూడా వీరు చెబుతున్నారు. ఆ విధముగా భూమి యొక్క చరిత్రను లెక్కగట్టి జీవయుగాలు చెబుతున్నారు.

1. అర్కియోజాయిక్, ఆదిమ జీవ మహాయుగము. ఇది 290 కోట్ల సంవత్సరాలు కొనసాగినదట. అప్పుడు ఏక కణవృక్షాలు, జంతువులు పుట్టాయి. ఉదాహరణకు అమీబా.

2. ప్రొటిరోజాయిక్. ప్రాథమిక జీవ మహాయుగము. 150 కోట్ల సంవత్సరాలు నడిచింది. ఈ యుగంలో అతిచిన్న మొక్కలు జంతువులు పుట్టినవి. ఉదాహరణకు అల్గె, ఫంగస్, హైడ్రా మొదలగునవి.

3. పేలియోజాయిక్. ప్రాచీన జీవ మహాయుగము. 36 కోట్ల సంవత్సరాలు జరిగింది. ఆ జంతు ప్రాధాన్యతను బట్టి ఆయా పేర్లు కూడా వచ్చాయి. ట్రైలో బైట్ యుగమందు పగడము, క్రెనాయిడ్, నత్త, ట్రైలో బైట్ జంతువులు జన్మించినవి. మధ్యయుగ మందు సొరచేపలు, డినిక్తస్‌లు పుట్టాయి.

4. మోసజాయిక్ : మధ్యము జీవ మహాయుగము. ఇది 16 కోట్ల సంవత్సరాలు కొనసాగింది. ఇందు అనేక రకాలైన పాములు, డైనోసార్స్ మొదలగునవి సంచరించినట్లు తెలుస్తుంది. దీనినే జురాసిక్ యుగమని కూడా అన్నారు. డైనోసార్స్ 35 టన్నుల బరువుతో భయంకరమైన అకారంతో ఉండేవి.

5. సినో జాయిక్ : అధునిక జీవ మహాయుగము. ఇది 6 కోట్ల సంవత్సరాలు ఉన్నది. ఈ యుగంలో కోతులు, గుఱ్ఱాలు, పక్షులు, పుష్పజాతుల మొక్కలు పుట్టినట్లు శాస్త్రల అంచనా.

కోతి రూప మానవులు ఈ కాలంలోనే జీవపరిమాణం చెందినట్లు చెబుతున్నారు.

సాంఖ్య తత్త్వజ్ఞాన రూపుడైన కపిల మహర్షి తన తల్లికి తత్త్వ లక్షణాలను వివరిస్తాడు. ఒక పదార్థాన్ని ఆత్మయని, పురుషుడని పిలుస్తారు. అది సూక్ష్మాతి సుక్ష్మంగా ఉండటం వలన ఇంద్రియాలు ఏ విధముగాను ఆ పదార్థాన్ని తెలుసుకోలేవని అందుచేత అది అవ్యక్తము, నిరాకారమని చెబుతాడు.

ఆ పరమ పదార్థము చైతన్యాత్మకము. ఈ చైతన్యములోని శక్తిని మాయ లేక ప్రకృతి అని చెప్పబడుతుంది. ఈ కనిపించే దృశ్యమాన జగత్తు ప్రకృతి చేత ఏర్పడినది. ఈ ప్రకృతి 24 తత్త్వాలతో కలదని చెబుతాడు. ఐదు పంచభూతాలు, ఐదు పంచతన్మాత్రలు ఇవి పంచభూతాల గుణాలు. దశజ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు, అంతరికరణ చతుష్టయం, ఇందుకాలం కూడా చేర్చి 25 తత్త్వాలుగా చెప్పబడ్డాయి.

పరబ్రహ్మ యోగ నిద్రలో ఉన్నప్పుడు సృష్టి అంతా ఆయన కుక్షిలో నిక్షిప్తమయి ఉంటుంది. అప్పుడు ఆయన ప్రళ నీరథిపై పవళించి ఉంటాడు. పురుషుడు ప్రకృతి గర్భస్థాపనం చేసినప్పుడు జగత్తు అవిర్భవిస్తుంది. పరమాత్మ శక్తియైన ప్రకృతి త్రిగుణాల మిశ్రమంగా ఉంటుంది. ఆ విధంగా పరమాత్మ సగుణ రూపుడవుతాడు. సత్త్వ గుణంచేత విష్ణువు, రజస్సుచేత బ్రహ్మ, తమస్సు వల్ల శివుడు ఉద్భవిస్తారు. ఈ త్రిమూర్తులు సృష్టి స్థితి లయకారకులౌతారు. ఈ విధంగా సృష్టి సృష్టించబడినదని వివిధ పురాణాలు వివరిస్తున్నాయి.

సృష్టి కొత్తగా ఏర్పడినది కాదు. సూక్ష్మరూపంలో పరమాత్మలో విలీనమైనది కల్పారంభమున ప్రవాహ సరణిని విస్తరిస్తుంది. సృష్టి రెండు విధాలుగా ఉంటుంది. (1) ప్రాకృత సృష్టి. పరమాత్మ చిద్రూపుడు. ఈ రూపం అవస్థాత్రయ వికారాన్ని పొందక కేవలం స్వస్థితిలో ఉన్నది. ఇది

శుద్ధ సత్త్వ ప్రధానమైనది. దీనిని ప్రాకృత సృష్టి లేక మూల ప్రకృతి అందురు.

పరమాత్మ శుద్ధ జ్ఞానరూపుడు. జ్ఞానికి మూడు అవస్థలున్నాయి. సత్త్వ, రజ, తమస్సులు. వీటినే గుణములంటారు. ప్రాకృతి సృష్టి గుణాత్మకమైన వికృతిని దాల్చినప్పుడు అది (2) వైకృత సృష్టి అయినది. ఈ సృష్టికి గుణత్రయం ఉపాధిగా ఉంటుంది. ఆత్మ సర్వ వ్యాపాత్మకం, అంటే విస్తరించి ఉంటుంది. పరమాత్మ సంకల్పముతో తన శక్తి కాల, స్వభావ కర్మరూపాలను దాల్చుతుంది. ఈ త్రివధాంశాలు సృష్టిని విస్తరింపజేస్తాయి. పరమాత్మ ప్రకృతి పరా అపరా అని ద్వివిధములు)

"భూమి రాపో నలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టదా॥ (భ.గీ.)

పంచభూతాలు, అంతఃకరణ చతుష్టయము, అపరా ప్రకృతి. వీటినుండే భౌతిక ప్రపంచము వృద్ధిగాంచినది. పరమాత్మ నుండి ప్రకృతి పుట్టింది. దాని నుండి మహతత్త్వము ఉదయించినది. అందుండి అహంకారము, దానినుండి త్రిగుణాలు, వీటి నుండి ఆది దేవతలు, అంటే వేదాలలో చెప్పబడిన దేవతలు, మనో బుద్ధి చిత్తాహంకారాలు, కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలు, పంచతన్మాత్రలు, పంచభూతాలు కలిసి బ్రహ్మాండం రూపొందినది.

మూలవస్తువును విభజించినప్పుడు వేరొక వస్తువు రాదు. ప్రాణ వాయువు మూల పదార్థము. మూల వస్తువులు మిశ్రమంగా ప్రపంచమున వస్తువులన్ని ఏర్పడినవి. నీరు మూల వస్తువు కాదు. జల వాయువు ప్రాణ వాయువు కలిసి నీరు అగుచున్నది. అగ్ని పదార్థము కాదు శక్తి. ఆకాశము మూలవస్తువు. మట్టి, గాలి మిశ్రమ పదార్థాలు స్థూల సూక్ష్మములైన పంచభూతాలు కారణంగా విశ్వం ఏర్పడినది.

"యే పరాం! జీవ భూతం మహాబాహో యమేదం ధార్యతే జగత్తు..." (భ.గీ.) అపరాప్రకృతి కంటే వేరైనది సమస్త జీవాధారమైన

పరాప్రకృతి ఈ జగత్తును ధరించుచున్నదని శ్రీకృష్ణ ఉవాచ. పరా అంటే చైతన్యము. అపరా ప్రకృతికి కారణమైన సూక్ష్మరూపం ఒకటున్నది. ఇది అవ్యక్తము. ఏ విధమైన వికారాలు దీనికి లేవు. ఏక రూపంలో ఉంటుంది. దీని నుండి సర్వ భూతములకు ప్రాణశక్తి లభిస్తుంది. ఈ పరా స్వరూపమే జగత్తులోని సర్వ ప్రాణులను ధరించి, భరించి జగన్నాటకాన్ని జరిపిస్తుంది. అపరా ప్రకృతి పరమాత్ముని క్రీడ. పరా ప్రకృతి ఆయన చైతన్యము. ఈ రెండింటి సమాహారమే ఇదంతా! మనమంతా!

విరాటుపురుషుని నాభి కమలం నుండి చతుర్ముఖ బ్రహ్మ ఉద్భవించాడు. బ్రహ్మ జననం గాంచిన వెంటనే పరమాత్మను యాజించాలనే తలంపు కలిగినది. అన్నింటిని అన్వేషించాడు. అన్ని ఆయన అవయవాలుగా అంతటా ఆయనే వ్యాపించి ఉన్నాడు. అప్పుడు ఆ అంగాలనే సాధనాలుగా తీసుకొని భగవంతుణ్ణి యాజించాడు.

అంతట బ్రహ్మ చతుర్దశ భువనాలను కల్పించాడు. భూలోకం మొదలుకొని సత్యలోకం వరకు 7 ఊర్ధ్వ లోకాలు. అతల నుండి పాతాళలోకం వరకు 7 అధోలోకాలు. బ్రహ్మ పద్మ కోశాన్ని మూడుగా విభజించాడు. అవి త్రిలోకాలైనవి. ఈ దేవ, పితృ, మర్త్యలోకాలు పరిశీలించగా చతుర్దశలోకాలు కనిపించాయి.

ఈ త్రిలోకాలు కామ్యకర్మ ఫలరూపాలు. అందువల్ల వీటి ఉత్పత్తులు వినాశనం ప్రతి కల్పంలోను జరుగుతుంది. మహర్లోకం మొదలు సత్యలోకం నిష్కామ కర్మ రూపాలు. ఇవి ప్రతి కల్పంలోను మార్పులు చెందవు.

లోకాల నిర్మాణం తరువాత సప్తకుల పర్వతాలను సృజించాడు. అవి ఉదయాచలం, అస్తాచలం, హిమాచలం, వింధ్యాచలం, మేరువు, త్రికూటాచలం, లోకాలోక పర్వతం వరకు. తరువాత సప్తద్వీపాలను

సృష్టించాడు. జంబుద్వీపం, ప్లక్షద్వీపం, శాలల్మీద్వీపం, కుశద్వీపం, క్రౌంచ ద్వీపం, శాకద్వీపం, పుష్కర ద్వీపం అనే ఏడు ద్వీపాలు. ఇవి ఒకదాని కంటే రెండవది రెండింతలు విస్తీర్ణం కలిగి ఉన్నాయి.

తరువాత సప్త మహాసముద్రాలను సృష్టించాడు. అవి ఉప్పు సముద్రం మొదలు మంచినీటి సముద్రం వరకు ఉన్నాయి. అటు పిమ్మట నవ బ్రహ్మలను సృజించాడు. భృగు, అత్రి, దక్షుడు, క్రతువు, కర్దముడు, పులస్యుడు, మరీచి, పులహుడు, అంగీరసుడు. వీరు తదుపరి సృష్టిని విస్తరించారు. వీరిని ప్రజాపతులు అంటారు. అట్లే సప్తమహర్షులను సృష్టించాడు. 1) అత్రి, గౌతమ, కశ్యప, వశిష్ట, భరద్వాజ, విశ్వామిత్ర, జమదగ్ని. వీరు కూడా తమ శక్తి వంచన లేకుండా సృష్టిని పెంచారు.

సృష్టి కాలవ్యవస్థను 14 మన్వంతరములుగా విభజించటం జరిగింది. బ్రహ్మకు ఒక పగటి కాలం 14 మన్వంతరాలు. ఒక్కొక్క మన్వంతరము 71 మహాయుగాలు. ఒక మహాయుగ కాలం 43, 12,000 సంవత్సరాలు. ప్రతి మన్వంతరములోను ఆయా మనువు వంశంలో బుట్టినవారు పాలిస్తు ఉంటారు. తరువాత అవిద్యావృత్తి పంచకాన్ని సృష్టించాడు. అవిద్య ఐదు అంశాలుగా ఉన్నది. 1) తమస్సు, మోహం, మహా మోహం, తామిస్రం, అంధతామిస్రం, అజ్ఞాన వృత్తులు. జీవులకు స్వరూప జ్ఞానాన్ని కప్పిపుచ్చి, స్వరూప ప్రకాశం లేకుండా చేయటానికి తమస్సు పనిచేస్తుంది. 'నేను నాది' అనే దేహాభిమానాన్ని కలిగించేది మోహం. అన్నిటిని అనుభవించాలనే కోరిక కలుగజేయునది మహామోహం. కోరిక తీరనప్పుడు కలిగే క్రోధము తామిస్రం. శరీరం నశిస్తే అది మరణంగా భావించడం అందతామిస్రం. వీటిని పంచ క్లేశాలు అంటారు.

ఈ పంచ అవిద్యావృత్తులను ప్రకల్పించిన తరువాత బ్రహ్మకు అవి పాపాత్మక మనిపించింది. తరువాత ఉత్తమ సృష్టిచేయాలని

నిష్క్రియులు, ఊర్ధ్వరేతస్కులు అయిన సనక సనందన, సనాతన, సనత్కుమారులకు జన్మనిచ్చాడు. వీరిని ప్రజోత్పత్తి గావించామంటాడు బ్రహ్మ. పుట్టుకతోనే బ్రహ్మవేత్తలైన వీరు అందుకు సమ్మతించరు. సనకాదులకు ప్రతికల్పంలోను పునఃసృష్టి ఉండదు. వీరు బ్రహ్మకల్పంలో జన్మించినవారు. ఈ కల్పంలో జన్మించిన వారందరు ప్రతి కల్పంలోను వర్థిల్లుతుంటారు.

సృష్టి కర్త బ్రహ్మకు నూరేడ్లు ఆయుస్సు. మొదటి అర్థ శతం ప్రథమ పరార్థమని, బ్రహ్మకల్పమని, రెండవ అర్థశతం, ద్వితీయ పరార్థం పాద్మ మహాకల్పమశి వ్యవహరిస్తారు. ప్రథమ, పరార్థ ప్రారంభంలో శబ్ద బ్రహ్మం ఉదయించినది. అందువల్లదానికి బ్రహ్మం అన్న పేరు అన్వర్థమైనది. ద్వితీయ పరార్థం ప్రారంభమైనప్పుడు భగవానుని నాభినందు పద్మం జనించింది. అందువల్ల అది పాద్మమహ కల్పమైనది. సనకాదులు సృష్టికార్యాన్ని నిరాకరించినందున బ్రహ్మకు క్రోధం జనించింది. దీని పర్యవసానంగా బ్రహ్మ భ్రూమద్యమునుండి నీలలోహిత వర్ణుడైన బాలుడదయించాడు. పుడుతూనే రోదించాడు కనుక అతనికి రుద్రుడని నామకరణం చేసాడు.

పంచ భూతాలు, ఇంద్రియాలు, హృదయం, ప్రాణం, సూర్యుడు, తపస్సు, అనే స్థానానాలు రుద్రునికి నివాసాలైనవి. అట్లే అయనకు మన్యువు మొదలు ధృతవ్రతుడునే పేర్లు వచ్చాయి. ఉమా, అంబిక, మరి, ధీవృత్తి, అనశ, నియుత్తు,, సర్పి, ఇళ, ఇరావతి, సుధ, దీక్ష, రుద్రాణి, అను పదకొండు మంది భార్యలతో ప్రజాసృష్టి గావించాడు. మొదటగా రుద్రగణాలను సృష్టించాడు. రుద్రగణాలు లోకాల్ని బాధిస్తున్నాయి. అది తెలిసిన బ్రహ్మ రుద్రునికి అట్టి వారిని సృష్టించవద్దని హితవు పలికాడు. సృష్టి పరిణామ కార్యములో బ్రహ్మ ప్రతిసారి ఆ తనువును చాలిస్తాడు.

బ్రహ్మ సాత్త్విక శరీరాన్ని ధరించినప్పుడు, ఆయన చతుర్ముఖముల నుండి నాలుగు వేదాలు ఉద్భవించాయి. పూర్వముఖము నుండి ఋగ్వేదం, దక్షిణ ముఖం నుండి యజుర్వేదం, పశ్చిమ ముఖము నుండి సామవేదం, ఉత్తర ముఖం నుండి అధర్వణ వేదం ప్రభవించాయి. అదే విధంగా శాస్త్రము, ఇజ్య, స్తుతి, స్తోమం, ప్రాయశ్చిత్త, పూర్వాది ముఖం నుండి వెలువడజ్డాయి. ఈ నాలుగు యజ్ఞప్రధానంగా ఉంటాయి.

పిదప బ్రహ్మ నుండి కర్మ తంత్రము, ఉపదేశాలు, న్యాయాలు, నాలుగు పాదాల నుండి చాతుర్యాలు, ఆశ్రమ ధర్మాలు వెలువడ్డాయి. తరువాత ఆయన చతుర్ముఖముల నుండి ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధార్వవేదము స్థాపత్యవేదం వెలువడ్డాయి. అటు పిమ్మట ఇతిహాసం, పురాణం ప్రభవించాయి. ఇతిహాస పురాణాలు నాలుగు ముఖాల నుండి ఉద్భవించినందున అన్ని విషయాలను ఇవి సూక్ష్మంగా వివరిస్తాయి.

యాగరూప కర్మతంత్రముచే అగ్నిష్టోమాలు, అప్తోర్యామ, అతిరాత్రులు, వాజపేయ, గోసవనాలు, ధర్మ చతుష్పాదములైన శౌచము, దయ, తపస్సు, సత్యము సృజించాడు. అన్వీక్షకి, ఆత్మానాత్మ వివేక విద్య, కర్మకాండను త్రయీ విద్య, కృష్యాదిరూపమైన వార్త ధర్మ రక్షణ, రాజ్యపాలనకు సంభిందించిన దండ నీతి విద్యలు బ్రహ్మ పూర్వ ముఖం నుండి వెలువడ్డాయి.

బ్రహ్మ దక్షిణ ముఖం నుండి సప్త వ్యాహృతులు, బ్రహ్మహృదయము నుండి ప్రణవము, రోమాలు నుండి ఉష్ణిక్ఛందస్సు, త్వక్కు నుండి గాయత్రి చందస్సు, అస్థుల నుండి జగతీచందస్సు, మాంసంసారం నుండి పజ్త్శ్ఛందస్సు, ప్రాణం నుండి బృహతీచ్ఛందస్సు వెలువడ్డాయి.

ప్రజోత్పత్తి కొరకు 'నేను' బ్రహ్మను ఇంతచేసినను అనుకున్నతగా లోక విస్తృతి జరగలేదని పరికించి, అప్పుడు రెండు భాగాలు చీలిపోయారు. ఒకటి పురుష రూపాన్ని మరొకటి స్త్రీ రూపాన్ని ధరించాయి. ఆ పురుషుడు స్వాయంభవుడయ్యాడు. స్త్రీ శతరూపా అయ్యింది. వారిద్దరికి వివాహం అయ్యింది. వారకి ఇద్దరు కుమారులు ప్రియవతుడు, ఉత్తానపాదుడు, ముగ్గురు కుమార్తెలు, ఆకూతి, దేవహూతి, ప్రసూతి జన్మించారు. ఆకూతిని రుచి మహిర్షి, దేవహూతిని కర్దముడు, ప్రహూతిని దక్షుడు పరిగ్రహించారు.

అప్పుడు భూమండలం జలదిగ్భందములో నున్నది. స్వాయంభువు ప్రార్థన విన్న బ్రహ్మ తన ధ్యానంతో వరాహావతారం ధరించి భూమిని పైకి తెచ్చి నిల్పాడు. స్వాయంభవ మనవు నుండి దేవదానవ మానవ మొదలగు జీవులు ఉద్భవించాయి

కశ్య ప్రజాపతి భార్యలైన అధితి, దితి, వినత, కద్రువ, భార్య ల వలన దేవతలు, రాక్షసులు, అనూరుడు, గరుత్మంతకుడు, ఆదిశేషుడు, వాసుకి, అనంతుడు మొదలగు సర్పాలు వారికి జన్మించారు. ఆ తరువాత వర్ణ సంకరము చేత బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనే నాలుగు వర్ణాలుగల మానవ జాతులు ఏర్పాడ్డాయి.

"చాతుర్వర్ణం మయాసృష్టం..." మానవుల గుణ స్వభావాలను, వారు చేయు కర్మలను బట్టి మానవ జాతకినంతటిని నాలుగు వార్ణాలుగా విభాగింపబడినది. భగవానుడు మొత్తం మానవజాతిని వారి బుధ్యానుసారంగా, వారు చేసే పనుల ఆధారంగా నాలుగు వర్ణాలుగా గావించారు. ఇందెచ్చటను కుల ప్రసక్తి కానరాదు. కాని ఈనాడూ ఏ రాష్ట్రంలో చూసిన, దేశంలో చూసిన నా కులం, నాజాతి అని కులాల పేర్లుచెప్పుకొని రాజ్యాంగ పరంగా మరి ఇతరంగా లాభాలు పొందుతున్నారు. దీనిని గూర్చి ఏ ధర్మ శాస్త్రం చెప్పలేదు. కాని కలికాలపు

మానవులు కలిప్రభావంలో పడి దుష్కృత కార్యాలు అధిక సంఖ్యలో చేస్తూ జీవిస్తున్నారు.

కాలం పరమాత్మ స్వభావం కాలమే అన్నింటిని నిర్ణయించగలదు. కాలశక్తిముందు మరే ఇతర శక్తులు పనిచేయవు. ఇంత సృష్టిచేసిన బ్రహ్మకు కూడా పోయే కాలం ఉంది. అయితే కాలాన్ని లెక్కలు గట్టి ప్రతి పదార్థానికి, జీవులకు, చివరకుసృష్టికి కూడా వయస్సు నిర్ణయించారు ప్రాచీనులు. కాలాన్ని బట్టి యుగాలు వచ్చాయి. అవి కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలుగా చెప్పబడ్డాయి. అన్ని యుగాలనందు సృష్టి విధానంలో కొన్ని మార్పులు ఉన్నట్లు శాస్త్రాలు తెలియజేస్తున్నాయి. అందుచేత ఆ యుగాలలో మానవులు జీవన విధానం ఏవిధంగా ఉన్నది పరిశీలిద్దాం.

1) కృతయుగంలో ధర్మదేవత నాలుగు పాదాలతో నడచి సంతోషంగా ఉన్నది. ఈ యుగమనుష్యులు సత్త్వగుణం ప్రధానంగా ఉన్నవారు. అధర్మమనేది ఈయుగ మావులకు తెలియదు. దీర్ఘాయువులు, రోగబాధలు, ఈతి బాధలు వారికి తెలియవు. ఒకే మానవజాతిగా జీవనం సాగించేవారు. తపస్సు చేసుకొంటూ సుఖంగా ఉండేవారు. ఆహారపదార్థాలు సంమృద్ధిగా ఉండేవి. కనుక పొట్టతిప్పలు లేవు. పర్వత గుహల్లో, అడువులలో, భూసారంగాలలో నివసించేవారట. ఇప్పటిలాగా అతి సుందరమైన వందల అంతస్థులతో నిర్మించిన హార్మ్యాలు లేవు. ఇవి వారికి తెలియవు.

అప్పుడు కాలం సమశీతోష్ణముగా ఉండేది. కీటకాలు, పాములు మొదలగు విషజంతువులు లేవట. కామ క్రోధ లోభ మోహములను జయించినవారు, స్త్రీ పురుషులు బ్రహ్మచర్యం పాటించేవారట. కావాలనుకొంటేనే సంతానం కలిగేది. అన్నిటా సత్యసంధులుగా జీవించేవరాట. (బ్రహ్మాండపురాణం). అందుకే ఈ యుగాన్ని సత్యయుగమని కూడా అంటారు. ఈ యుగ ప్రజలు జీవన విధానం.

ఇప్పటి ప్రజల జీవన విధానం చూస్తే భూమమికి ఆకాశానికి ఉన్నంత వ్యత్యాసం కనబడుతుంది. ఎంతో మనోహరమైన జీవన విధానం ఆ యుగ మానవులది. ఇప్పుడు అదే జీవన పద్ధతి నడిస్తే ఎంతో బాగుండునో? అవిధమైన సృష్టిని ఆ పరమాత్మ ఎప్పుడు ప్రవేశపెడతాడో ఏమో!

కృతయుగం అంతమై త్రేతాయుగ ప్రారంభానికి ముందు సంధికాలం ఉంటుంది. అప్పుడు ఈ రెండు యుగాల మిశ్రమ ధర్మాలు కొనసాగుతాయి.

2) త్రేతా యుగపు మనుష్యులు రజోగుణ స్వభావాలుగా ఉంటారు. వర్షాలు సకాలంలో కురుస్తాయి. పంటలు సమృద్ధిగా పండుతాయి. జనులకు ఆహార సమస్య కొరతలేదు. సత్యమార్గాన్ని అవలంబించి నడుచుకొనేవారు. చెట్లక్రింద నివసిస్తూ ఉండేవారట. సంఘాలుగా ఏర్పడి జాతులుగా నివసింపసాగారు. అప్పుడు వారిలో ఇష్టా అయిష్టాలు ఏర్పడ్డాయి. స్త్రీ ఋతుమతులౌతారు. కుటీరాలు ఏర్పరచుకొని జీవిస్తారు. తేనెను ఆహారంగా స్వీకరించారు. తపస్సు చేయలేని స్థితి కలిగి వివిధ వ్యాపారాలు చేసేవారు. రక్షణ కోసం చక్కటి మందిరాలు, దుర్గాలు నిర్మించుకొన్నారు. గ్రామాలు, పట్టణాలు ఏర్పడ్డాయి. వాస్తుశాస్త్ర ప్రకారం గృహనిర్మాణాలు జరిగేవి.

ఒకజాతి వర్గం వారు అధిక బలవంతులై ఇతరులను వారికి అనుగుణంగా నడిచే లాగు చేసుకొన్నారు. వీరు రాజలయ్యారు. ప్రజలను న్యాయంగాను, ధర్మంగాను నడిపించడం రాజుల విధి అయింది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతుల వారిగా ఆయా కార్యాలను నిర్వర్తించేవారు. తమ నియమం ప్రకారం వర్తించే చాతుర్వార్ణాలవారికి బ్రహ్మ ప్రజాపత్యఇంద్ర, మారుత గంధర్వలోకాలను సృష్టించాడు. (బ్రహ్మాండ పురాణం) ధర్మపాదములో తపస్సు

కుంటుపడింది. శ్రీరాముడు ఈ యుగమువారేకదా! వారి పూర్వులు సూర్యవంశరాజులు రాజ్యపాలన జేసినారు.

3) ద్వాపరయుగంలో ధర్మం రెండు పాదాల మీదా నడుస్తుంది. అధర్మం పెరిగుపోతుంది. ఈ యుగంలో జనులకు రజతమస్సు గుణాలు సమపాళ్ళగా నుండి సత్యాన్ని మీరి ప్రవర్తిస్తారు. అందువలన ప్రజల్లో కామకర్మాసక్తి ఎక్కువగా ఉంటుంది. దాని వలన జనులు లోభగుణం కలవారవుతారు. దీనివలన కష్టాలు ప్రారంభమౌతాయి. అన్ని వర్గాలవారు వాణిజ్యాన్ని ప్రధానంగా తీసుకుంటారు. వర్ణసంకరము ఏర్పడుతుంది. కామక్రోధ లోభమోహాలు మనుష్యుల్లో మితిమీరిపోతాయి. వేదశాస్త్రాల యందు శ్రద్ధ సన్నగిల్లుతుంది. జ్ఞానాసక్తి సన్నగిల్లుతుంది. అందుచే వేద వ్యాసుడు వేదాన్ని నాలుగు భాగాలుచేస్తాడు. యశస్సు, శీలము, అధ్యయనాసక్తి కుటుంబ భరణము ముఖ్యమవుతాయి. ఈ లక్షణాలు గలవారు బ్రాహ్మణులు క్షత్రియులుగా పిలవబడతారు. జనులు పాపాలు చేస్తారు. అనావృష్టి, అకాల మరణాలు వ్యాధి బాధలతో దుఃఖాలు అనుభవిస్తారు. కలికాలం పొకడలు పొడచూవుతాయి. యజ్ఞయాగాదులు సన్నగిల్లి విగ్రహారాధన, పూజలు ప్రారంభమవుతాయి.

ప్రస్తుతం ప్రపంచము కలియుగములో నడకసాగిస్తున్నది. గతకాలంలో జనులకన్నా ఈ కాలం వారు అద్భుతమైన తెలివితేటలు కలిగి అన్ని రంగాలలో విశేషమైన అభివృద్ధి సాధించి నాగరిక జీవనం చేస్తున్నామని చెప్పుకుంటున్నారు.

ఆనాటి వారు ఆచార వ్యవహారాలు, మూఢనమ్మకాల మీద నడిచారని, ఈ నవీన నాగరిక మనుష్యులు వాటిని అధిగమించి వారివారి ఇష్టానురంగంగా సర్వస్వతంత్రులై సంతోషముగా జీవిస్తున్నామని చెప్పుకొంటున్నారు. దీనిలో నిజమెంత? లేక నేతి బీరకాయ చందమా? అందుకు కలియుగ మావుల జీవన విధానం ఏ రూపంలో సాగుతుందో భవిష్యపురాణాన్ని పరిశీలిద్దాము.

4) ధర్మానికున్న నాలుగు పాదాలలో మూడు విరిగిపోగా ఒక్కపాదం మీద కలికాల మానవుల నడవడిక కొనసాగుతుంది. శౌచము, తపస్సు, సత్యము ఈ మూడింటిని కలికాలం మానవులు ఆచరించటానికి ఇష్టపడరు. తనకు ఏదో రకంగా కలిసొస్తే అంతో ఇంతో దానము చేదామనుకొంటారు. కష్టపడి సంపాదించిన సొమ్ము దానం చేయటానికి మనసొప్పదు. డబ్బు రాబట్టు కోవడానికి ఎన్ని మార్గాలు లేవు. సవాలక్ష ఉన్నాయి. అలా సంపాదించిన దానిలో ఇంత ఇందా అని విదులుస్తారు దాతృత్వమున్న దాతలు.

కొందరు తెలివి గలవాళ్ళైతే ,ఎక్కడో, ఏదో ఆపద వచ్చినప్పుడు దానిని ఆధారంగా చేసుకొని ప్రజల దగ్గర నుండి విరాళాలు పోగుచేసి వీరిపేరు మీదగా దానం చేస్తారు. వేరేవారు వారి సంపాదనలో రాబడి పన్ను మిగుల్చుకోవటం కోసం ఇంత ధర్మము చేస్తారు. ఇలా ఈనాడు దానము చేసే విధానం కలికాలం మానవుల బుద్ధిలాగే ఉన్నది.

కలిలో దానమనే ధర్మపాదం మీద ఈ యుగం నడుస్తుంది. కలినొకశక్తి రూపిణిగా వర్ణించింది కలిపురాణం. అధర్మానికి అసత్యం అనే భార్య ఉంటుందట. వీరికి అంభుడనే కొడుకు, మాయ అనే కూతురు జన్మిస్తారు. వీరిద్దరూ మోహంలోపడి వివాహమాడతారు. వారికి దంభుడనే కొడుకు వికృతి అనే కుమార్తె కలుగుతారు. మళ్ళీ విరిద్దరు పెండ్లి చేసుకొంటారు. వీరికి క్రోధమనే కొడుకు, హింస అనే కూతురు పుడతారు. వీళ్ళు కూడా వాళ్ళలాగే దాంపత్య జీవితం సాగించి 'కలి'ని కంటారు.

కలి పురుషుని అవతారం రాక్షసుల లక్షణాల కంటే భయంకరంగా ఉంటాయి. ఇతని శరీరం దుర్వాసన కొడుతూ ఉంటుందట. తాగుడు, జూదం, స్త్రీలోలత్వం, మరణం, హింస, అసత్యము, మదం, కామం, శత్రుత్వము అనే తొమ్మిది చోట్ల నివసిస్తూ కలి పాలన చేస్తూ ఉంటాడు. ఇతని భార్య ద్విరుక్తి. వీరికి భయం

అనే కొడుకు, అకాల మృత్యువు అనే కూతురు కలుగుతారు. ఈ ఇద్దరూ తోబుట్టువులుగా ఉంటూ నరకం అనే కొడుకును, యాతన అనే కూతుర్ని కంటారు. మళ్ళీ వీళ్ళిద్దరూ కలిసి పెక్కు దురాచారులను పుట్టిస్తారు.

ఈ దుర్మార్గులు చెలరేగిపోయి అన్ని చోట్ల ధర్మకార్యాలను ధ్వంసం చేయటం, యజ్ఞయాగాదులను పాడుచేయటం, జరావ్యాధులను వృద్ధి చేయటం, అకాల మరణాలు కల్పించటం వంటి దుష్ట కర్మలు ప్రజలచే చేయిస్తూ ఉంటారు. అధర్మదేవత విచ్చల విడిగా సంచరిస్తూ ప్రజలకు సుఖశాంతులను దూరం చేయటమే కాదు వారు ధర్మ మార్గంలో నడచి భగవంతుని చేరుకోవటానికి దూరం చేస్తారు.

ఈ లక్షణాల ఆధారంగా కలికాలం మానవుల ప్రవర్తన జుగుప్సాకరంగా ఉంటుంది. కన్న వాళ్ళను కడతేర్చటానికి పూనుకుంటారు వారి సంతానం. వేదాలు పనికి రాని గ్రంధాలవుతాయి. వితండవాదులు ఎక్కువౌతారు. విద్యను అమ్ముకుంటారు. ఆచార వ్యవహారాలు అడుగంటుతాయి. అబద్ధం చెప్పే వాళ్ళే అజేయులౌతారు. మోసగాళ్ళు నెగ్గుతారు. దంబాచారులే కీర్తించబడతారు డబ్బుగలవాడే గొప్పవాడు, కీర్తివంతుడు, బుద్ధిమంతుడు, పరిపాలకుడు, న్యాయము చెప్పగలవాడు, అందరిలో శ్రేష్టుడు.

బ్రాహ్మణులతో సహా వర్ణ సంకరం జరుగుతుంది. పతివ్రతలు పతితలుగా, కులటలుగా కులకాంతలుగా మారతారు. సన్యాసులు గృహస్థులవుతారు. కాషాయవస్త్రం కట్టిన వాడల్లా యతులౌతారు. వితంతు వివాహాలు సర్వసాధారణ మౌతాయి. భ్రూణ హత్యలు పెరిగిపోతాయి. బ్రాహ్మణులు చండాలుని వద్ద యాజకుడౌతాడు. అతివృష్టి, అనావృష్టి, జనులను భయంకర రోగాలు పట్టుకొని పీడిస్తాయి. స్వార్థపరులు ఎక్కువౌతారు. నీతి నిజాయితీగల వాళ్ళను తరిమి తరిమి కొడతారు. మేమే దైవం, భగవంతులమనే బాబాలు, స్వామీజీలు పెరిగి పోతారు.

శ్రీకృష్ణుడు దేవుడేమిటని ఆయన్ని దూషిస్తారు. రానురాను వైష్ణవభక్తి ప్రపత్తులు సన్నగిల్లుతాయి. అవిద్యాపరులు కాషాయ వస్త్రాలు ధరించి గెడ్డమీసాలతో క్రొత్తక్రొత్త పోకడలను కల్పించి వాటిని అనుసరిస్తే వారి బాధలు తీరటమే కాదు, యోగా క్లాసులతో రోగరొష్టులు దూరమయి సుఖశాంతులతో బ్రతకవచ్చుననే భ్రమలు కల్పించి, ఏవేవో తాత్కాలిక ప్రయోజనాలు చూపించి ప్రజలను వాళ్ళవెంట తిప్పుకుంటారు.

ఇప్పటి కలియుగం ప్రారంభమై 5000 సం॥రాలు దాటింది. దీనివల్ల ధర్మాలను, ధర్మాన్ని ఆచరించే కొద్దిమంది నిందలకు గురి అవుతారు. హేతువాదం, వితండవాదం పెరిగిపోయి కేవలం భౌతికపరమైన వాటికే పట్టం కడతారు. శాస్త్రధర్మాలు పనికి రానివిగా భావించబడతాయి. భౌతికవాద పరమైన పద్ధతులు, విధనాలు ఎక్కువగా అమలౌతాయి. గృహ వ్యవస్థలో మార్పులు జరుగుతాయి. వర్ణసంకరం జరుగుతుంది. ధన సంపాదనే ధ్యేయంగా, లక్ష్యంగా ఉంటుంది. సమిష్టి కుటుంబ వ్యవస్థ పోయి ఏక కుటుంబ వ్యవస్థ వ్రేళ్ళూనుకుంటుంది. అన్ని రంగాల్లో పోటి పెరిగిపోతుంది. కాని ఆధ్యాత్మిక చింతన అడుగంటి బాహ్యాప్రేరణ భక్తి పెరిగినట్లు కనబడుతుంది. పితృకార్యాలు సన్నగిల్లుతాయి నాస్తికత్వం ప్రచారం ఎక్కువ అవుతుంది.

కలియుగం పదివేల సంవత్సరాలు గడిచేటప్పటికి క్షుద్రదేవతల పూజలు ఎక్కువౌతాయి. బౌద్ధ ధర్మాలు పాటిస్తూ సనాత ధర్మాలకు స్వస్తి చెబుతారు. హరినామ స్మరణ, విష్ణుభక్తులు తక్కువైపోతారు. బ్రాహ్మణులు నిందలకు గురి అవుతారు. వేదవేదాంతాలను, పురాణాది శాస్త్ర గ్రందాలను అర్థం చేసుకోలేని వారు పండిత ప్రకాండులౌతారు. పశుమాంస భక్షణ, మద్యపానం, వ్యబిచారం, సర్వసామన్యమైపోతాయి.

స్వగోత్రులలో వివాహాలు జరుగుతాయి. మృతులకు ఉత్తర క్రియలు జరుగవు. స్త్రీ పురుషులు వారి ఇష్టాను సారం వివాహం

చేసుకొని ఇష్టమైన రీతిలో ప్రవర్తిస్తారు. దంపతులలో ప్రేమాభిమానాలు నశిస్తాయి. కామేచ్ఛయే ప్రధానంగా ఉంటుంది. మాటల్లోనే అహింస, దయ, శీలము ఉంటాయి. చేతల్లో ఇవి శూన్యం. ఆడవాళ్ళ సంపాదనతో కుటుంబ పోషణ జరుగుతుంది. అన్ని జాతుల వారు కన్యలనువిక్రయిస్తారు.

లోభమోహాలు మనుష్యుల్లో జీర్ణించుకుపోతాయి. ఇచ్చిన డబ్బు మళ్ళీ కొట్టేసేదాక ఊరుకోరు. క్రొత్తక్రొత్త రోగాలు పీడించుకు తింటాయి. పశుసంపద తగ్గిపోతుంది. అన్ని కార్యాలు యంత్రాలే చేస్తాయి. మరమనుష్యులే తోడౌతారు. అన్ని అవసరాలు ప్రాణం లేని బొమ్మలే తీరుస్తాయి. విధి నిషేధాలు పాటించబడవు. పరధనాన్ని, పరస్త్రీలను కబళిస్తారు. భార్యాభర్తల మధ్య కట్టుబాట్లు, సర్దుబాట్లు ఉండవు. కామవాంఛలు బహిరంగముగానే జరుగుతాయి.

స్వదేశి పరదేశి కట్టుబాట్లు తారుమారవుతాయి. ప్రాచీన సంస్కృతి సాంప్రదాయా స్థానాల్లో క్రొత్తక్రొత్త సంస్కృతులు అలవాట్లు, వ్యవహారాలు వస్తాయి. శీతోష్ణ స్థితులలో చాలా మార్పులొస్తాయి. పల్లెసీమ కట్టుబాట్లు, ఆచార వ్యవహారాలు తారుమారవుతాయి. ఆహారం అలవాట్లు మారతాయి. అంతా సైన్స్ పరంగా జీవించటానికి అలవాటు పడతారు. ఇక్కడ చెప్పినవి కలియుగములో జరగబోయేవి కొన్ని మాత్రమే. ఇంకా ఎన్నెన్నో విపరీతాలు, విడ్డూరాలు జరగడంతోబాటు మనిషి మేధస్సు కందని మార్పుల సరళిలో కలియుగ మానవుల జీవనం సాగుతుంది.

ఇప్పటి వరకు తత్త్వశాస్త్రాలు చెప్పిన సృష్టి పుట్టుక నుండి అది అనేక పరిణామాలు చెంది అందలి మానవులు ఏయే పద్ధతులలో జీవనం సాగించారో చెప్పటం జరిగింది. ఇప్పుడు అదే సృష్టి విజ్ఞాన శాస్త్రం (సైన్స్) ప్రకారంగా ఏయే విధముగా వృద్ధి నొందినదో చూద్దాము.

ఆది మానవుడు భూమి మీద సంచరించుచున్నప్పటి నుండి ఈ ప్రకృతిని పరిశీలిస్తూనే ఉన్నాడు. తాను జీవించటానికి ఆహారాన్నిచ్చే భూమిని దానిపైనున్న వివిధ వనరులను తన బుద్ధికి తోచినట్లుగా వాటిని ఉపయోగించుకొని జీవనం సాగిస్తున్నాడు.

మనిషి వంటచేసుకోవటం, బట్టకట్టు కోవటం తెలుసుకొన్నాక ఆడమగ కలిసి గుంపులు గుంపులుగా కొండల్లో కోనల్లో, అడవుల్లో, చెట్ల క్రింద, పుట్ల క్రింద పర్వతాల మీద, భూగుహలలో ఇలా తనకు అనువైన చోటునల్లా ఉపయోగించుకొని జీవనం సాగిస్తున్నాడు.

తినగ తినగ వేము తియ్యనన్నట్లు. మొదట మానవులు తాము నిత్యము చూసే ప్రకృతి వానలు పడ్డప్పుడు ఒక విధంగా ఎండ గాచినప్పుడు మరో విధంగా, ఇతర సమయాల్లో ఇంకో విధంగా ఉండటాన్ని గ్రహించాడు. అలా శీతోష్ణములు కలగటం అవగతమైంది. ఈ పరిస్థితులు తిరిగి తిరిగి రావటం చూసాడు.

మానవ మేధస్సు పెరగటంతో ప్రకృతిని పరిశీలించడము మొదలు పెట్టాడు. అప్పటి నుండి విజ్ఞాన శాస్త్రము అభివృద్ధికి మార్గం ఏర్పడినది. నిప్పును తయారు చేయటం తెలుసుకొని దానిని వినియోగించుకొంటున్నాడు. ఆకాశములో నిత్యము చూసే సూర్యచంద్రులను నక్షత్రములను గమనిస్తున్నాడు. పగలు రాత్రుళ్ళు కలగటం చూస్తున్నాడు. ఒక చోటనుండి మరోచోటుకు వెళ్ళటానికి నడక ప్రారంభించి, జంతువులను ప్రయాణ సాధనాలుగా ఉపయోగించుకొన్నాడు. ఆ విధంగా మానవుడు ప్రకృతిలో లభించే వివిధ పదార్థాలను, వస్తువులను వినియోగించుకొంటూ వైజ్ఞానికముగా ఎంతో ఎత్తుకు ఎదిగిపోయాడు.

సైన్సుపరంగా ప్రకృతిని పరిశీలన చేయసాగాడు. కాలం పెరుగుతూనే ఉంది. మానవ మేధస్సు కూడా అందుకు తగ్గట్టుగా

అభివృద్ధి చెందుతూనే ఉంది. అలా ప్రారంభమైన పరిశీలన ఈనాటి వరకు కొనసాగుతూనే ఉంది. ఇక ముందు కూడ నిరంతరము ఈ పరిశీలన సాగుతుంది. దీనినే విజ్ఞానాభివృద్ధి అన్నారు.

ఒక విజ్ఞాన శాస్త్రము నుండి ఎన్నెన్నో విజ్ఞాన రూపశాస్త్రాలు బయలుదేరాయి. ఆ విధంగా ప్రారంభమైన విజ్ఞానశాస్త్రము ఈనాడు ఒక సెకనుకు నాలుగు కోట్ల సమీకరణలు చేయగల కంప్యూటర్లు ప్రపంచంలో వ్యాప్తికి వచ్చి ఏ మూరుమూల ప్రాంతానికైనా కొద్ది సెకండ్లలో సమాచారం పంపటంతో బాటు ఆ ప్రాంతమునగల వివిధ స్థితిగతులను అంచనా వేస్తున్నారు. ఆ విధంగా విశేషంగా విజ్ఞాన శాస్త్రము అన్ని రంగాల్లో అభివృద్ధి సాధించింది.

మొట్టమొదటిగా మానవుడు పరిశీలించినది ఖగోళశాస్త్రము. ఆకాశం, అక్కడ కనిపించే నక్షత్రాలు, గ్రహాలు, గ్రహకలశాలు మొదలైనవి. భూమి, గాలి, నీరు, వెలుతురు ఇలా కనిపించేవి, కనబడని వాటిని కలిపి విశ్వం అని వ్యవహరించబడినది. శాస్త్రజ్ఞులు అంచనాల ప్రకారం ఈ విశ్వం 1500 కోట్ల సంవత్సరాల నుండి ఉంటుందని ఇది ఇంకా విస్తరిస్తుందని అభిప్రాయపడ్డారు.

ఆకాశం అంటే నక్షత్రాలు, గ్రహాలు, సూర్యచంద్రులు గుర్తుకొస్తారు. నక్షత్రాలు స్వయం ప్రాశకాలు. కొన్ని నక్షత్రాల కాంతి భూమిని చేరటానికి 4 సం॥ పడుతుందట. అదే సూర్యుని వెలుతురు భూమిని చేరటానికి 8 నిమిషాలు చాలనట. నక్షత్రాలు కొన్ని కోట్ల సంఖ్యలో ఉన్నాయి. కొన్ని నక్షత్రాలు గుంపులు గుంపులుగా ఉన్నాయట. వీటిలో కొన్నిటిని జ్యోతిశాస్త్ర రాసులుగా పరిగణించి వాటి ఆకారాన్ని బట్టి జంతువుల, దేవతల పేర్లతో పిలుస్తారు భారతీయులు.

సౌరకుటుంబంలో సూర్యుడు ప్రధాన గ్రహం. మనకు కనబడే సూర్యుడు 500 కోట్ల సం॥రాల నుండి ప్రకాశిస్తున్నాడని ఇంకా ఇంతే

కాలం ప్రకాశిస్తాడని చెబుతున్నారు. సూర్యుని ఉపరితలంపై సుమారు 5540 సి ఉష్ణోగ్రత ఉంటుందట. ఈ సూర్యుడు భూమికి 14,96,00,000 కిలోమీటర్ల దూరంలో ఉన్నాడట. ఇలాంటి సూర్యులు విశ్వంలో ఇంకా చాలామంది ఉన్నారని చెబుతున్నారు.

సూర్యుడు నియమిత వేగంతో ఒక నిర్ణీత కక్ష్యా మార్గంలో తిరిగుతుంటాడు. ప్రధానంగా 9 గ్రహాలను బుధుడు మొదలు ప్లూటో వరకు చెబుతారు. భూమి కూడా ఒక గ్రహం. ఇది సూర్యుని చుట్టూ ఒకసారి పరిభ్రమించటానికి 365 రోజులు కాలం పడుతుందట. ఇలా భూమి సూర్యుని చుట్టూ పరిభ్రమించటం వలన శీతోష్ణాదులు ఏర్పడ్డాయి.

మనమందరము నివసించేది, మనకు తెలిసింది భూమి. భూమి మీద తగిన వాతావరణం ఉండటంతో ప్రాణికోటి జీవించగలుగుతున్నది. భూమి వయస్సు సుమారు 460 కోట్ల సంవత్సరాలని శాస్త్రజ్ఞులు అంటున్నారు. భూమిచుట్టూ మూడు వంతులు నీరున్నది. భూమి 7 ఖండాలుగా విభజింపబడినది. భూమి తన చుట్టూ తాను తిరుగుట వలన రాత్రింబవళ్ళు ఏర్పడ్డాయి. గంటలు, రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు, యుగాలు కాలమానంలో గణించబడ్డాయి.

ఈ ధరిత్రి మీద 200 దేశాలు పైబడి వున్నాయి. భిన్నభిన్న వర్ణాల ప్రజలు వివిధ నాగరికతలతో పల్లెల్లో, పట్టణాలలో, నగరాలలో నివశిస్తున్నారు. సుమారు 600 కోట్లకు పైబడిన జనాభా ఈ భూ ప్రపంచం మీద జీవిస్తున్నారు. ఏ దేశ సంస్కృతి సాంప్రదాయాలు ఆ దేశానికున్నాయి. ప్రాచీనకాలంలో ఒక ప్రదేశానికే కట్టుబడియున్న ప్రజలు నేడు ఆకాశయానం ద్వారా, జలమార్గాల ద్వారా ఖండఖండాలు ప్రయాణిస్తున్నారు.

భూ ప్రపంచం మీద ఎన్ని దేశాలున్నా, ఏ దేశ చరిత్ర ఆ దేశానికున్నది. అయితే భారతావని కొన్ని ప్రత్యేకతలు కలిగియున్నది. దీనిని భరతఖండం అని కూడా అంటారు. అత్యంత పురాతనమైన సింధూనాగరికత భారతదేశానిదే. ఇది క్రమేణా హిందూ దేశముగ పిలవబడుతున్నది.

భారతదేశము, అందు నివశించు భారతీయులు చాలా ప్రత్యేకతలు కలిగియున్నారు. ఇది వేదాలు వెలసిన దేశం, నాదాలు అంటే సంగీతం పలికించిన దేశం. అనేక కళలకు కాణాచి, ప్రత్యేక సంస్కృతీ సాంప్రదాయాలకు ప్రతీక. ఈ దేశ నాగరికతను ఎంతగానో కొనియాడుటమేకాదు వాటిని ఇతర దేశస్థులు కూడా అనుసరిస్తున్నారు.

రామాయణ, మహాభారత, భాగవత, పురాణ ఇతిహాసాలు మొదలగు గ్రంథాలు వెలసిన దేశం. వైద్య, గణిత, ఖగోళ శాస్త్రాలేకాదు. నీతి శాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము వంటి జ్ఞాన విజ్ఞాన భాండాగారాలు వెలసిన దేశం భారతదేశం.

గౌతమ బుద్ధుడు, మహావీరుడు, శంకరాచార్యుడు, రామానుజ మధ్వాచార్యులు వివిధ మతస్థాపకులు జన్మించిన పుణ్యభూమి ఇది. కాళిదాసు, మాఘుడు, భాణుడు వంటి ఉద్ధండకవులు, కౌటిల్యుడు, చాణిక్యుడు వంటి అర్థశాస్త్ర, రాజనీతి శాస్త్ర నిపుణులు. ధన్వంతరి, చరకుడు, వాగ్భట వంటి ఆయుర్వేద శాస్త్రవేత్తలు. సూరదాసు, కబీరుదాసు, తుకారాం, త్యాగయ్య, అన్నమయ్య, మీరాబాయి, సక్కుబాయి వంటి భక్త శిఖామణులు జన్మించినది భారతదేశములోనే.

కణాదుడు, బాబావంటి పరమాణు శాస్త్రవేత్తలు అర్యభట్ట, భాస్కరాచార్యులు, వరాహమిహరుడు వంటి ఖగోళశాస్త్రజ్ఞులు, సర్. సి.వి.రామన్, జిడ్డు కృష్ణమూర్తి, సర్వేపల్లి రాధాకృష్ణన్ వంటి తత్త్వవేత్తలు,

నేతాజీ, గాంధీజీ, తిలక్ వంటి స్వాతంత్ర్య సమర యోధులు వెలసిన వీరభూమి ఇది.

ప్రపంచానికే తలమానికమైన వేదాలు అవతరించిన వేదభూమి ఇది. తత్త్వజ్ఞులు, యోగులు, ధ్యానపరులు, తపఃసంపన్నులు, విజ్ఞానులు జ్ఞానమూర్తులు, మహా భక్తులు అవతరహించి అద్వైత్వాన్ని అనుసరించి ఆధ్యాత్మికతలో జీవించి దేవుడు, జీవుడు, ప్రపంచానికి అర్థాలు చెప్పిన మహా మహాత్ములు వెలసిన భారతావని ఇది. సౌభ్రాతృత్వానికి, సహనానికి, ఐకమత్యానికి, అహింసకు, ప్రేమానురాగాలు పంచటానికి, ఆర్తులకు, అనాథలకు, జీవకారుణ్యానికి, ధర్మ రక్షణ నిలయమైనది భారతమాత. పాపం, పుణ్యం, దుర్మార్గం, సన్మార్గం, అక్రమము, సక్రమము, నీతి, అవినీతి, ధర్మాధర్మాలు, సత్యాసత్యాలు, న్యాయాన్యాయాలు వంట్ ద్వంద్వాలను గ్రహించి పాలను నీళ్ళను వేరుచేసే హంసల్లాంటి వారున్నదే భారతదేశము.

రాజ, పేద, ధనవంతుడు, దరిద్రుడు, ఆడ, మగ, సంసారులు, సన్యాసులు, అధికారులు, అనధికారులు, గొప్పవారు, తక్కువవారు, నీ, నా అనే బేదాలు లేకుండా సమాంతరంగా సాగిపోయే జీవన విధానమున్నదీ భారతావనిలో.

ప్రకృతి సౌందర్యాన్నంతటిని తనలో నింపుకున్న భారతదేశం బహు సుందరమైనది. విశేషమైన ఖనిజ నిక్షేపాలు, అపార జలసంపద, మూడు ప్రక్కల సముద్రము, మరో ప్రక్క మహోన్నతమైన హిమవత్ పర్వతాలు, పలురకాలు పంటలతో, సలపుష్పాలతో, సుందరవనాలు, సెలయేళ్ళు, జలపాతాలు, సరస్సులు, మంచి వర్షపాతంతో సరైన శీతోష్ణాలతో, అపారమైన పశుపక్షుల సంపదతో, వెలకట్టలేని రత్న మణిమాణిక్యములతో అలరారే అమరికలు లేక సమ భావముతో

భారతావనిలో సమానత్వంతో సహజీవనం సాగించే భారతీయులు శాంతిప్రియులు, దయార్ద్ర హృదయులు.

యుగయుగాలలో పరమాత్మ దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మసంస్థాపనకోసం ఎన్నో అవతారాలు దాల్చి మానవుల్లో భక్తిని, జ్ఞానాన్ని ముక్తిని కలిగించే మార్గాలు చూపించి, ప్రకృతికి పరమాత్మకు అర్థాలు చెప్పి అపమార్గంలో పయనించే వారిని సన్మార్గంలో నడిపించి, మానవత్వాన్ని ప్రబోధించి, మనిషి తలచుకొంటే అతనికి అసాధ్యమేది లేదని మనిషే మాధవుడు కాగలడని నిరూపించాడు అనేకమంది ఋషుల ద్వారా యోగుల ద్వారా, భక్తుల ద్వారా, మహాత్ముల ద్వారాను చూపించింది. భారతదేశములోనే కదా?

కొందరు ఎన్నో పుణ్యాలు చేసి స్వర్గ నివాసం కోరుకుంటారు. అక్కడ ఎక్కడ లేని సుఖాలు లభిస్తాయట. బాధలనేవి తెలియవట. అన్ని సౌకర్యాలతో అందర్నీ ఆనందంతో ఉంచుందట స్వర్గం. అందుకే స్వర్గ సుఖాలను అనుభవించటానికి అందరూ కోరుకుంటారట.

అయితే స్వర్గలోక నివాసం కొంతకాలం వరకే ఉంటుంది. "క్షీణ పుణ్యే మర్త్యలోక విశంతి." పుణ్య కర్మ ఫలానుభవము పూర్తికాగానే మళ్ళీ భూలోకంలో ఎక్కడో ఒక చోట ఎదో రూపంలో పుడతారు.

ఆత్మశక్తిచేత ప్రకటితమైన జగత్తు దాని సమయం ఆసన్నమైనప్పుడు గతించిపోతుంది. మళ్ళీకాల ప్రవాహం కదలినప్పుడు సృష్టి జన్మిస్తుంది. ఈ విధముగా సృష్టికి కూడా చావుపుట్టుకలు గలవు. ప్రకృతిచేత పుట్టి జీవించే ప్రాణులు దేహాంతరము చెందకుండా ఉండలేవు. జీవుల పుట్టుక, మరణం ప్రకృతి శాసనం. దీనికి విరుద్ధంగా ఏది జరుగదు.

"జాతస్యహి ధృవో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్యచ" పుట్టింది

గిట్టుతుంది. గిట్టింది మళ్ళా బాహ్యము లోనికి వచ్చితీరుతుంది. ఇది ప్రకృతి శాసనమని గీతాఉవాచ.

ఆద్యంతములు లేని పరమాత్మ నుండి అవిద్య ఆవిర్భవించి ఆది అంతాను కల్పిస్తుంది. అనాదినుండి ప్రారంభమయిన సృష్టి కల్పంతములో మళ్ళీ అనాదిలో ఏకమైపోతుంది. ప్రారంభముంటే అంతము కూడా ఉంటుంది.

వస్తువులుగాని, పదార్థాలుగాని, జీవులుగాని జన్మించి మొదలు ఎన్నో మార్పులకు, చేర్పులకు లోనయి అవసాన దశకు చేరుకొన్నాక అంతమైపోతాయి. అవి ఎక్కడ నుండి వచ్చినవో మళ్ళీఅక్కడికే చేరుకోవటం సృష్టి ధర్మముగా చెప్పబడుతుంది. దీనికి ఉదాహరణ భూమి గుండ్రముగా ఉన్నదని శాస్త్ర నిరూపణము.

ప్రతి ఆరంభానికి అంతముంటుంది. స్థాపితమైనది ఏనాటికైనా భూస్థాపితము కాక తప్పదు. సృష్టిలో ఎంత గొప్పదికాని, కొంతవరకే స్థితి పథంలో నుండి తరువాత లయమైపోతుంది. దీనిని విజ్ఞాన శాస్త్రాలు కూడా ధ్రువపరచాయి. పరబ్రహ్మచే ప్రారంభింపబడిన సృష్టికర్త, తాను రచించిన ఈ బ్రహ్మాండము కాలానుగుణంగా పరివర్తన చెంది కాలంలో కలిసిపోతుంది.

బుద్ధిరూపుడైన మానవుడు తెలుసుకోవలసింది తాను ఎక్కడ నుండి వచ్చాడో మళ్ళీ తిరుగు ప్రయాణములో ఎక్కడికి పోతున్నాడో ననేది. ఇది అనుభవంలోకి వచ్చినపుడు, ఈ జీవనం సాగించడానికి మాయకారణమని, అట్టి మాయను దాటే త్యాగాలు చేయనప్పుడు చావుపుట్టుకలు తప్పవని తెలుసుకొంటాడు.

ఈజగత్తులో మార్పులుచేర్పులు లేనిది, ఎప్పుడూ ఒకే విధముగా ఎప్పటికి శాశ్వితముగా ఉండేదేదైనా ఉన్నదా అంటే? ఉన్నదనే జవాబు,

అదిపరమాత్మ నిర్గుణము, నిరాకారం, నిరామయం, అనంతం, అవ్యయం, అక్షరం ఆత్మ, ఏకం, సత్, పరబ్రహ్మమునకు ఏది కల్పించి చెప్పినా అది ద్వివిధముగా అవుతుంది. అప్పుడు ద్వైతం అవుతుంది. పరబ్రహ్మ సృష్టి సంకల్పము చేయతలంచి తాను పరివర్తన చెంది ప్రపంచముగా మారినాడు. అంటే పరివర్తన అనేది మొట్టమొదటగా పరమాత్మతోనే ప్రారంభమయినది. సూక్ష్మంగానున్న తన శక్తిని స్థూలంగా విస్తరించడానికి అనేకసార్లు పరివర్తన చెందాడు.

సృష్టి విస్తరణ కార్యములో భగవానుడు పరిపరివిధాలుగా పరివర్తన చెందగా పంచభూతాత్మకమైన సృష్టి, అందులో అనేకానేక జీవులు ఉద్భవించాయి. కాలం ఆయన స్వభావం. కాల పరిణామంలో ప్రప్రథమముగా నున్న జీవుల శరీరాలు అనేక మార్పులకు లోనయ్యాయి.

కాలాన్ని యుగాలుగా మన్వంతరాలుగా, కల్పాంతము గావించబడ్డాయి. సమస్త జీవరాసుల్లో మానవులు అంటే దేవ, దానవ, యక్ష, కిన్నెర, కింపురుషాదులు కూడాను. వీరి శరీరం పరివర్తనతో బాటు అంతఃకరణ చతుష్టయం, మిష్టిగా వాటి విధులను నిర్వర్తించడం ప్రారంభించాయి. సమస్త జీవుల్లో నున్న ఈ అంతఃకరణములో ప్రత్యేకించి మానవునికి బుద్ధి అనే పదార్థము ఏర్పడినది. ఇది అమోఘమైన శక్తి కలిగి మనిషి ఆలోచనలకు విజ్ఞానాభివృద్ధికి తోడ్పడినది.

బుద్ధి ప్రాబల్యము వలన మనిషి ప్రకృతి మీద పరిశోధనలు జేసి తన అవసరాలకు అనుగుణంగా వాటిని ఉపయోగించు కొంటున్నాడు. విజ్ఞాన రూపుడైన మానవుడు ఎన్నో అంశాలను అధ్యయనం జేసి అనేక శాస్త్రాలను తయారుజేసాడు. ఎక్కువ బుద్ధి కలిగినవాడు మిగిలిన వారికి అధిపత్యం వహించడం ప్రారంభమయింది. ఆ విధంగా రాజులు, రాజ్యాలు ఏర్పడ్డాయి. తరువాత పరిపాలన మొదలైనది.

కాల పరిణామంలో ఒకరుని మించిన మరొకరు తెలివిగల వాడు కాగలిగాడు. తన బుద్ధి బలంతో శక్తియుక్తులతో వారిలో వారికి పోటిపడగా అధికబలం, తెలివి గల వారు చక్రవర్తులై రాజ్యాలు పాలించారు. ఈ విధముగా రాజ్యపాలన మొదలై యుగయుగాలు కొనసాగి నేడు కలియుగములో కొన్ని దేశాలలో ప్రజాపాలన ఏర్పడినది. ఇంకొన్ని దేశాల్లో రాజ్యపాలనే కొనసాగుతుంది. మానవాభివృద్ధి పురోగమించినప్పుడు తత్త్వశాస్త్రాలు పుట్టుకొచ్చాయి. ఇవి మానవుల జీవన విధానం, వారు పాటించవలసిన నియ నిబంధనలతో బాటు, మనల్నందరిని సృష్టించిన దేముడొకడున్నాడు, ఆయన ఎవరికంటికి కనబడడు, మూసుకుపోయివున్న నీ మూడో కన్ను తెరవగలిగితే అప్పుడు చూడవచ్చునని చెప్పాయి.

పుట్టిన జీవులు ఎందుకు మరణిస్తాయి. ఎట్లా మరణిస్తాయి. మళ్ళీ ఏ విధంగా జన్మిస్తాయి, ప్రాణులకు సుఖదుఃఖాలు ఎందుకు కలుగుతాయి, మొదలగు అనేక విషయాలను శాస్త్రాలు చెప్పాయి. అట్లే నేటి మానవుడు ఏ విధముగా జీవనం సాగించాలో కూడా వివరించాయి.

జీవితం అంటేనే అనేక ద్వంద్వాలతో కూడుకొన్నది. సుఖదుః ఖాలు, భోగభాగ్యాలు, స్త్రీపురుషులు, మంచిచెడ్డలు, పాపపుణ్యాలు, న్యాయాన్యాయాలు, ధనం దారిద్ర్యము సుగుణాలు, దుర్గుణాలు, కామక్రోధాలు, లోబమోహమద మాత్సర్యాలు, శమదమాది షట్కములు, అహంకారము అణుకువ ఇలా సృష్టిలో ప్రతిది ద్వంద్వముతో ఉన్నవే.

దీనికి కారణం? ఒకటిగా ఉన్న పరమాత్మ రెండుగా అయినందున, సృష్టిలో అన్ని ద్వైతముగానే ఉన్నవి. సృష్టిలో ప్రతి పదార్థము ప్రతి నిముషం మారుతూనే ఉంటుంది. చీకటి పోయి వెలుగు, బాల్యంనుండి సీనియర్ సిటిజన్, మగ ఆడగా మార్పులు, ఆడ మగగా మార్పులు. ఆహారం రక్తంగా మార్పు, గాలి వాసనలతో

మార్పు, అజ్ఞానం నుండి జ్ఞానం పొందే మార్పు. దుర్మార్గుడు సన్మార్గుడు కావడం. ఈ విధంగా సృష్టిలో ప్రతిది పరివర్తన చెంది ద్వైత రూపంలో కనబడుతుంది.

పరమాత్మ ప్రకృతిగా మారటంతో ప్రారంభమైన పరివర్తన, ప్రతి పదార్థములో, వస్తువుల్లో, జీవుల్లో, జీవంలేని వాటిలో మార్పులు లేనిది మారనిదేమైన ఉన్నదేమో చూడండి. గడ్డిపోచ దగ్గర నుండి బ్రహ్మాండము వరకు మార్పు చెందేదేనని, ఇంకా మార్పులు చెందుతూ ఉంటుందని నేను గ్రహించిన సత్యము. సమస్తానికి మూలమైన పరివర్తన మీద ఒక గ్రంథాన్ని సమస్త ప్రజానీకానికి అందజేయాలనే సంకల్పముతో ఈ గ్రంథరచనజేసి మీ అందరికి సమర్పించుకొంటున్నాను.

ఆనవాయితీ ప్రకారం, మన సంప్రదాయానికి అనుగుణంగా కార్యప్రారంభానికి, అంతము నందు శాంతి ప్రవచనం చెప్పటం కద్దు. అందుకే ఈ ముగింపుకు ముందు శాంతిని ప్రస్తావిస్తున్నాను.

"శాన్తః" నిష్కలం, నిష్క్రియం, శాంతమ్. ఆత్మ నిర్మలము, నిష్క్రియము శాంతమని శృతి ప్రమాణం. మనస్సుకు వికారం కలగకుండా సాధన జేసిన శాంతి దొరుకును.

ఏ పని చెయ్యాలన్నా అందుకు తగిన మానసిక స్థితి అవసరం మహర్షులు వేద పఠనమునకు ముందు మనస్సును వాటి యందు లగ్నపరచడానికి శాంతి మంత్రాలు పఠించేవారు. వేదాధ్యయనం అయిన తరువాత చివరగా కూడా శాంతి మంత్రాలు చెప్పేవారట.

వేద మంత్రాలన్ని ఇంచుమించు "ఓం శాంతి" తోనే సమాప్త మవుతాయి. శాంతి అంటే ప్రశాంతత. వెలకట్టలేనిది, దేని చేతను ఖరీదు చేయలేనిది అందరికి సాధ్యము గానిది ముఖ్యముగా, ధనిక దరిద్ర మధ్యతరగతి మనుష్యులు పొందలేనిది శాంతి. ఎంతో అభివృద్ధి

సాధించినారనే ఈనవ నాగరికులు శాంతికి చిరునామా తెలుసుకోలేని స్థితిలో ఉన్నారు.

మనిషి బౌతిక పరంగా ఎన్ని భోగభాగ్యాలు అనుభవించి ఈ ప్రపంచాన్నంతటిని పాలించే స్థితి కలిగి, ప్రశాంతముగా జీవిస్తున్నాడు అంటే అది భ్రమ, భ్రాంతియే సుమా!

మనిషి ఎంతో భౌతికముగా అభివృద్ధి చెందుతున్నాడు అంటే అంత ఆధ్యాత్మిక పరంగా పతనమవుతున్నాడు. భౌతికంగా అభివృద్ధి చెందటం అంటే మాయలో జీవించడం అవుతుంది. ఆధ్యాత్మిక జీవనం ఆత్మాను భూతితో కూడుకొన్నది. మొదటిది అసత్యం. రెండవది సత్యం. శాంతికి సాధన చేయుటంఅంటే భగవానుని పొందే ప్రయత్నమే అవుతుంది. అందుకే శాంతికి ఆర్థికపరంగా వెలకట్టలేము. ఆధ్యాత్మికపరంగా అనంతమైన విలువ కలిగినది.

ప్రాపంచిక సుఖాలతో పొందలేని శాంతిని, తత్త్వవిచారణతో, అభ్యాస వైరాగ్యములచే, జపతపాదుల వలన, ధ్యాన యోగమార్గముల ద్వారా పొందవచ్చునని శాస్త్రాలు చెబుతున్నాయి. ఎంత గొప్పను సాధించిన వారైనా చివరకు కోరుకొనేది శాంతినే కదా!

"విహాయ కామాన్...సశాంతి మధిగచ్ఛతి" సమస్త కోరికలను త్యజించినవారు, దృశ్యపదార్థములందు అభిలాష లేనివారు, అహంకార మమకారములను విసర్జించిన వారు శాంతిని పొందురని భగవద్గీత చెప్పింది.

అష్టైశ్వర్యాలు, భోగ భాగ్యాలు, సిరి సంపదలతో ఉండేవారు. కోరెకలను తీర్చుకొనేవారు, రాజ్యపాలన గావించేవారు శాంతినిపొందలేరు. శాంతిని ఎవరు పొందగలరు? "సర్వకామాన్ విషయ భోగాన్ పరిత్యజ" సమస్త కోరికలను, భోగ విషయాసక్తిని వీడినవారు శాంతిని పొందును.

దీనికి విరుద్ధముగా నేటి నాగరిక మనుష్యులు ఎక్కువ డబ్బును సంపాదించి, ఆరోగ్యంగా ఉండి భోగభాగ్యాలు అనుభవిస్తూ ఉన్నాము, శాంతముగా బ్రతుకుతున్నాము అనుకొంటున్నారు. నిజానికి వారు భ్రాంతిలో జీవిస్తున్నారు, భౌతిక సుఖాలు నిశ్చల శాంతిని ప్రసాదించలేవు.

విషయ సుఖములందు విరక్తి, మనస్తృప్తి, ఉపశమనము, జ్ఞానేంద్రియ నిగ్రహము శాంతికి అర్థాన్ని చెబుతున్నాయి. సంపూర్ణమైన శాంతి పరంధామము. భక్తి, జ్ఞాన, ధ్యాన యోగ మార్గముల సాధన చేతనే ఇంద్రియ నిగ్రహం, బాహ్య విషయములందు విరక్తి, వైరాగ్యము కలుగును. అప్పుడు చిత్తము శాంతినొందును. ఇది కేవలం మహాత్ములకు, జ్ఞానులకు, భక్తులకు మాత్రమే లభ్యమగును.

ఈ ప్రాపంచిక సుఖదుఃఖాలు అనుభవించేవారు, భాగ్యవంతులు, శ్రీమంతులు, శాస్త్రవేత్తలు, రాజ్యపాలకులు, సంసార బాధలతో జీవించే మధ్యతరగతి మనుష్యులు, ఆకలితో అలమటించే దరిద్రులు, పరమాత్మ పరమైన శాంతిని గాంచలేరు. వీరికి శాంతి అందని ద్రాక్ష పండే.

శాంతి వచనాన్ని మూడుసార్లు ఎందుకు చెబుతారు? ఈ జగత్తునందు ఆధ్యాత్మిక, అది భౌతిక, అది దైవికం అనే త్రివిధ తాపాలున్నాయి. అవిశాంతించాలని ముమ్మారు ఓంశాంతి, శాంతి, శాంతిః అని ఉచ్చరిస్తారు.

ఈ త్రివిధ దుఃఖాలతో పాటు, శారీరక రుగ్మతలు, మానసిక సమస్యలు. ఇతర జీవుల వల్ల కలిగే క్లేశాలు, ప్రకృతి పరంగా సంభవించే తుఫానులు, భూకంపాలు, సునామీలు, అగ్నివలన కలిగే వినాశాలు మొదలగు దుఃఖాల బారి నుండి కాపాడమని శాంతి స్వరూపుడనైన పరమాత్మను ముమ్మారు శాంతి వచనముతో ప్రార్థిస్తారు.

ప్రస్తుతం ప్రపంచంలో ఏ మూలను చూచినా అల్లర్లు, కల్లోలాలు, హింస, దౌర్జన్యము, దగా, మోసం మొదలైన అకృత్యాలు సాఫీగా సాగిపోతున్నాయి. ఈ ఘోరమైన పరిస్థితులు ఇలా కొనసాగితే చివరకు మానవ జాతి కూడా అంతరించిపోయే ప్రమాదమున్నదని అనేకమంది నిపుణులు, హితులు, శ్రేయోభిలాషులు హెచ్చరిస్తూనే ఉన్నారు.

ఇది వాస్తమని గ్రహించి, పాలకులు కొన్ని చర్యలు తీసుకున్నా అనుకున్న మేరకు శాంతి స్థాపన జరగటం లేదు. రోజు రోజు శాంతి క్షీణిస్తూంది. సమస్త మానవాళియే కాదు ఇతర జీవరాసులు కూడా సుఖసంతోషాలతో, శాంతి, సహనంతో సహజీవనం చెయ్యాలనే అంతర్జాతీయ ఆశయము అమలు కావటం లేదు.

అభివృద్ధి పేరిట భోగభాగ్యాలతో, సర్వసౌకర్యాలతో జీవితం అనుభవిస్తున్నంతకాలం, దైవస్థానమైన నిశ్చలశాంతిని పొందలేరు. భౌతిక అభివృద్ధితో బాటు మానవులు ఆధ్యాత్మికంగా ఎంతగా ఎదిగితే అంతగా శాంతికి దగ్గరవుతారు. అప్పుడే శాంతికి చిరునామాతో బాటు ప్రశాంతముగా జీవిచగలుగుతారు.

పరమాత్మచేత ఏర్పడ్డ సృష్టి, అందుండి వచ్చిన సమస్తజీవులు, అందులో మానవజాతి భగవానుని పొందటానికి శ్రద్ధ చూపించకపోతే సర్వమానవాళితో బాటు అన్ని జీవులు కాలగర్భంలో కలిసిపోతాయి. కనుక తత్త్వదృష్టి కలిగి పరమాత్మ చేతనే పరివర్తన చెందిన ఈ జగత్తును సరిగ్గా అర్థం చేసుకొని తదనుగుణంగా ప్రవర్తించినపుడు అంతా శుభమే జరుగుతుంది.

"దౌఃశాన్తి....సామాశాన్తి" అనే శ్లోకం ద్వారా శాంతికూడా శాంతించాలనే వేద ప్రబోధము ఆచరణాత్మకము కావాలి అని అభిలషిస్తున్నాము.

తత్త్వశాస్త్రాల రచన, పఠనము ప్రారంభము అంతమందు శాంతి మంత్రములు చెప్పడం శాస్త్రసమ్మతం "ఓం తచ్ఛంయో రావృణే మహే గాతుం యజ్ఞాయ" ఎవరు శుభాన్ని అనుగ్రహిస్తారో ఆ భగవానుని ప్రార్థిస్తున్నాను. ఆధ్యాత్మిక జీవనం గ్రంథ రచన ఒక యజ్ఞంగా సవ్యంగా జరిపించిన నా ఇష్టదైవము శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ వటపత్రశాయికి వేనవేల నమస్కారములు. అన్నివైపుల ప్రళయధారికి నమస్కారములు, అంతటా నమస్కారములు.

ఓం శాంతి, శాంతి, శాంతిః

ఓం తత్ సత్

భక్తిరూపుడు

**భక్తగోవిందం**

## అధ్యాయము - 1

# జీవనయానం

1. ఆహారమే జీవనం
2. నవ్వు నజరాన
3. శీలం కాపాడుకో
4. ప్రేమించబడు
5. ఆదర్శ జీవనం
6. పూజా పునస్కారాలు
7. పునాదిరాళ్ళకు పూజలు
8. ఉపవాసాలు - పస్తులు
9. ఉత్సవాలు - ఊరేగింపులు
10. తీర్థ ప్రసాదాలు
11. దానమేవ గృహస్థానం
12. సంతోషమే సౌభాగ్యం
13. అర్థమూలం మోక్షదాయం

ఓంశ్రీ వటపత్ర శాయినే నమః

# 1. "ఆహారమే జీవనం"

"అన్నాద్భవన్తి భూతాని, పర్జన్యాదన్న సంభవః"....(భ.గీ) అన్నం వలన సమస్త జీవులు జన్మించును. అన్నము వర్షము వలన లభించును. భూమి చుట్టూ మూడు వంతులు నీళ్ళున్నా, అవి నేరుగా భూమి మీద నివశించే జీవులకు అవసరపడవు. వర్షాధారముతో లభించిన నీళ్ళు జీవలకాధారముగా ఉన్నవి. ఈనాడు నీళ్ళావసరము తెలియని మానవడు లేడేమో! కొద్ది రోజులు తిండి లేక పోయినా ప్రాణముంటుంది, నీళ్ళు లేకపోతే కొద్ది నిమిషాలలోనే ప్రాణం హరి అంటుంది. అందుకే అన్నం వర్షజలం వల్లనే లభిస్తుందని గీత తెటతెల్లముగా చెప్పింది.

ఈ నిజం తెలుసా? జలం వల్లే భూమి ఏర్పడినది. అందుకే మూడు వంతులు నీరు, ఒక వంతు భూమి ఉన్నాయి ఈ ప్రపంచములో. వర్షం పడగానే భూమి నుండి ఓషధులు పుడతాయి. వాటి నుండి అన్నము లభిస్తుంది, అన్నం ద్వారా జీవులు ఉద్భవిస్తాయి.

ఈనాడు కొన్ని వేల సంఖ్యలో నోరూరించే ఆహార పదార్థాలను తయారు చేస్తున్నారు. ఈ స్థూల శరీరము అన్నమయ కోశము. చాలా రుచిగా ఉన్నాయని తెగలాగిస్తే, శరీరము రుగ్మతల పాలవుతుంది. అప్పుడు వైద్యుని అవసరమొస్తుంది. ఆయన నీ నోరు కట్టే ప్రయత్నము చేస్తాడు. అందుకే మితంగా తినటానికి అలవాటు పడాలి.

ఎన్నో ఆహార పదార్థాలున్నా అవన్నీ "చతుర్విధామ్" నాలుగు రకాలైన వేనట, భక్ష్య, భోజ్య, లేహ్యా, చోష్యములు, ఇవి వైశ్వానర అగ్ని చేత పచనము చేయబడతాయి. "సుగర్ వ్యాధి' ఉన్నవారు అవి తికూడదు, బ్లడ్ ప్రెజర్ ఉన్నవారు ఇవి తినకూడదు, ఆడవాళ్ళు ఇవి

తినాలి, మగవాళ్ళు అవి తినకూడదు, ముసలి వాళ్ళు ఇవేవి తినకూడదు అనే ఆంక్షలు పెట్టి నాలుకను కట్టడిచేస్తునారు మందులిచ్చేవారు, ఎన్నోన్నో రుచికర పదార్థాలిచ్చి నోరు కట్టేసి, కళ్ళప్పగించి చూడ మంటున్నారు.! ఇదెక్కడి న్యాయమండి! అంతా వింత.

అన్నం పరబ్రహ్మరూపమని స్మృతులు చెప్పుచున్నాయి. ఆ పరబ్రహ్మమే ప్రాణమంటున్నాయి వేదాంతాలు. అందుకే అన్నారు అన్నమే ప్రాణమని. "అన్నమితి హోవాచ, సర్వాణి హవా ఇమాని భూతన్యన్న యేవ" (ఛాం.ఉ) సర్వప్రాణులు అన్నమును గ్రహించి జీవించుచున్నవి. వివిధ ఆహార పదార్థములను భుజించి జీవులు శరీరాలను వృద్ధి చేసుకొంటున్నాయి.

ఏనుగు కంటే బలమైన జంతువు లేదు. అయినా అది పత్రశాఖాహారి. ఆ కాలములో భీముడి కంటే బలవంతుడు లేడేమో? ఆయన బండ్లకొద్ది ఆహారాన్ని లాగిస్తాడు. ఇప్పుడు మల్ల యోధులు ప్రతిరోజు తినే ఆహార "మెను" సామాన్యులని ఆశ్చర్య పరుస్తుంది. అంటే పుష్టికరమైన ఆహారము తిని బలవంతులాయ్యారు.

"అన్నం వావబలాద్ భూయస్తస్మాద్ యద్యపి" (ఛాం.ఉ.) బలము కంటే అన్నము గొప్పది. ఎంత బలవంతుడైనా 10 రోజులు పస్తుంటే సరిగా చూడటం, వినటం, ఆలోచించటం, తెలిసికోవటం మొదలగు పనులు చేయలేడు. అదే మళ్ళీ ఆహారం తింటే మామూలు మనిషి అయిపోతాడు. ఆహరమే ప్రాణమనటానికిది చక్కటి ఉదాహరణ.

"యత్ సప్తాన్నాని మేధయా తపసా జనయత్పితా" (బృహ.ఉ.) సృష్టి కర్త తన మేధతోను, తపస్సుతోను సప్తాన్నములను (7) సృజించెను. ఇందులో ఒకటిసాధారణ అన్నము మనమందరము భుజించేది. రెండు రకాల అన్నములను దేవతలకు ఇచ్చాడు. (1) హుతము, (2) ప్రహుతము. హవనములో వేయబడు ఆహుతులు హుతాన్నము ఇది

దేవతలు ఆరగిస్తారు. యజ్ఞము తరువాత ఇచ్చే అన్నము ప్రహుతము ఇది యజ్ఞ విధులు నిర్వర్తించిన బ్రాహ్మణులు మొదలగు వారు భుజించు అన్నము. పశువుల కొరకు ఇచ్చే అన్నము పయస్సు. పాలు-నీరు పయస్సు అనే అన్నము. మనుష్య సంతతి పుట్టగానే నెయ్యిని నాకిస్తారు. తరువాత స్తన్య పానము చేయిస్తారు. అదే విధముగా పశుసంతతి పుట్టగానే "అతృణాద"పాలు కుడుపుతారు. ఇలా మనుష్య సంతతి, పశు సంతతి మొదట పాలు నీరు త్రాగి జీవించును.

1) సాధారణ అన్నము, 2) హుతము, 3) ప్రహుతము, 4) పయస్సు ఈ నాలుగు విధములై ఆహారములు సృష్టికర్త బాహ్యాన్నములు. సృష్టికర్త తన కొరకు మనస్సు, వాణి, ప్రాణము అను మూడు ఆహారములను పెట్టుకొన్నాడు. 1) మనస్సు వాణి, ప్రాణము అను మూడు అన్నములు ఆయనకు అంతరముగా నున్న ఆహారములు.

కామము, సంకల్పము, సందేహము, శ్రద్ధ అశ్రద్ధ, ధృతి అధృతి, లజ్జ, భయము మొదలగునవి మనస్సు యొక్క రూపాలు. దానిని చూడలేదు, వినలేదు, అంటే, మనస్సు వాటిని సంకల్పించలేదు. ఇది మనస్సు అన్నము (శక్తి) వంటిది.

మనస్సున ఏది యమూర్తమగునో (రూపుదాల్చునో) దానిని వాణి శబ్దములతో రచించును. అతి స్వల్పముగా నున్న వాణి ప్రకృతిలోనున్న అనేకానేక విషయములను వ్యక్తముగాంచును. ఆ విధముగా వాణి అన్నాన్ని అందిస్తుంది. ప్రాణము - ప్రాణాపాన వ్యాన సమాన ఉదానంగా విభజించుకొని శరీరాన్ని పోషిస్తుంది. ఈ విధముగా ప్రాణం అన్నరూపం, ఇట్లు పరమేశ్వరుని స్వరూపము వాఙ్మయము, మనోమయము, ప్రాణమయము.

జీవులు శరీరములోకి తీసుకొనే ఆహారము త్రివిధములుగా పరిణామముచెందును. జీర్ణమయిన ఆహారంలో స్థూలభాగం

మలమగును, మధ్యమ భాగము మాంసమగును. సూక్ష్మ భాగము మనస్సుగా మారును. అందుకే నీవు తినే ఆహారాన్ని బట్టి నీ మనస్సుంటుంది. అది సాత్వికరాజసతామసముగా ఉండును. దీనిని బట్టి నీవు ఏ తరగతి మనిషివో ఇట్టే చెప్పేయవచ్చును. మనస్సు అన్నమయం.

అన్నంతో బాటు నీళ్ళు త్రాగుతాము. నీళ్ళు లేనిదే ముద్దిదిగదు, అన్నము కూడా జీర్ణము కాదు. అయితే త్రాగిన నీళ్ళలో ఎక్కువ భాగం మూత్రముగా, మధ్యమ భాగము రక్తముగా, సూక్ష్మభాగము ప్రాణముగా మార్పు చెందును. ప్రాణము జలమయం. అందుకే స్పృహ తప్పినవాడికి ఇన్ని నీళ్ళు పట్టిస్తే లేచికూర్చుంటాడు.

నెయ్యి, నూనెలు మొదలగునవి లోనికి తీసుకొన్నప్పుడు అందులోని ఎక్కువభాగము ఎముకలుగ, మధ్యమ భాగము మజ్జగా, సూక్ష్మభాగము వాక్కుగా మారును. వాక్కుతేజో మయము. సూక్ష్మముగా మారిన అన్నము, జలము, ఘృతాది పదార్థములు జీవులకు మనస్సు, ప్రాణము, వాక్కుగా మారగా వీటినే మానవులు వ్యక్తము చేయును. జీవులు 15 రోజులు ఆహారం తినకపోయినా, నీరు త్రాగి ప్రాణము నిలుపుకోవచ్చును. కారణం ప్రాణము జలమయము, ఆతరువాత ప్రాణము స్థూల శరీరమును విడుచును. గాంధీజి సత్యాగ్రహాన్ని ఆయుధముగా చేపట్టి భారతమాతకు విముక్తి లభింపచేసాడు. - ఈ ఆహార రహస్యాన్ని తెలుసుకునే. "నాత్యశ్నతస్తు" అధికంగా ఆహారాన్ని భుజించరాదు. అట్లాగని"నచైకాన్త మనశ్నతః" అతి స్వల్పముగా ఆహారము తీసుకోకూడదని గీతాశాస్త్రము బోధిస్తుంది. "అతి సర్వత్రా వర్జయేత్" "అల్పం నిష్ఫాత్". ఏదిగాని అతిగా చేస్తే అనర్థదాయకమౌతుంది. అతి తక్కువగాచేస్తే గుర్తింపబడదు. కనుక ఈ రెండు విధాలు కార్యసాధనకు పనికి వచ్చేవి గావు. సమపాళ్ళలో, సమన్వయంతో నడచువాడు సఫలీకృతుడౌతాడు.

మనిషి అంటే జీవితం, జీవితం అంటే ఎన్నో అవసరాలతోకూడి ఉండేది. జీవికి అన్నిటి కంటే ప్రధానావసరం తిండి. అన్నముతోనే శరీర నిర్మాణము జరిగింది. దేహమ్నుది ప్రాణము కాపురముండటానికి. అన్నం ప్రాణ రూపం. అన్నమయ ప్రాణం. ప్రాణంఅన్నం తిని జీవిస్తుంది. అన్నం లేకపోతే రూపంలేదు, ప్రాణం కూడా లేదు. "అన్నాద్భవంతి భూతాని" అని సెలవిచ్చాడు గీతకర్త.

జీవించటానికి అన్నం తినాలి. ఇది వాస్తవము. తినటానికి జీవించటము కాదు. కొందరు తినటానికే పుట్టాము, తిండి తరువాతే మిగతావన్ని అని బ్రతికి ఉండగానే తినాలని ఒకటికి నాలుగుసార్లు ఎక్కిస్తారు. అది హరించుకోవటానికి మందు బిళ్ళ తప్పదు. ఇది తిండిపోతుల తంతు.

మరి కొందరు ఆచితూచి తింటారు. ఎక్కువగా తింటే లావైపోతామని, సన్నగా ఉంటే నాజూగ్గా, అందంగా ఉంటామని, రోగ రోష్టులకు దూరంగా ఉంటామని, సోమవారం ఉపవాసం శివార్పణమని, గురువారం ఉపవాసం సాయి సమర్పణం, శుక్రవారం ఉపవాసం అమ్మవారి కోసమని, శనివారం ఒకపొద్దు శ్రీ వేంకటేశ్వరుని కని ఉపవాసాలతో ప్రొద్దు పుచ్చుతూ ఆరోగ్యాన్ని దేవుడికి ఒదిలేస్తారు. ఈ బాపతు వాళ్ళు కుడా లెక్కలోనికి రానివాళ్ళే.

"యుక్తాహార విహారస్య" ఆహారం తీసుకొనే విషయంలో మితం పాటించువారు. "యోగోభవతి దుఃఖహాః" యోగముచే దుఃఖాన్ని అధిగమించ వచ్చును. కోర్కెలను అదుపులో ఉంచుకొని మితం పాటించటం యోగము. దీని వలన మనిషి దుఃఖాన్ని అధిక మించగలడు.

పెద్దలన్నట్లు, అధికం ఏదిగాని అనర్థదాయకం. పరిమితికి మించి ఏ కార్యము చేసినా ఫలితం కూడా అదే విధంగా ఉంటుంది.

ఇది ప్రతివారికి స్వానుభవం కూడాను. ఆరోగ్యమే మహాభాగ్యమన్నారు. ఆహారం దొరక్కపోయే వాళ్ళు కొందరైతే, మితిమీరిన తిళ్ళు తిని అనారోగ్యాలు తెచ్చుకొని పోయే వాళ్ళు మరి కొందరు.

కనుక ఆరోగ్యంగా జీవించాలంటే పొట్టను అర్ధ భాగం ఆహారంతో నింపాలి. ఒక పాతిక వంతు నీళ్ళతో నింపాలి. ఒక పాతిక భాగం ఖాళీగా ఉంచాలన్నది ఆరోగ్య సూత్రం. ఏక భుక్తే యోగి, ద్విభుక్తే భోగి త్రిభుక్తే రోగి అన్నారు.

రోజుకు రెండు సార్లు మితంగా భుజించి మధ్యలో నీళ్ళు త్రాగమని చెబుతాడు భీష్ముడు. ధర్మరాజుకు ఆరోగ్యాన్ని కాపాడుకొనే విషయంలో. ఆహార నియమం ఆరోగ్య సూత్రమే కాదు, పరమార్ధ సాధనకు ఉపయోగపడే గొప్ప సాధనము. ఈ విషయాన్ని గీతాశాస్త్రం చక్కగా వివరిస్తుంది. అంతేకాదు గీతా ప్రబోధంలో ఆహారానికి ఎంతో ప్రాధాన్యాతనిచ్చినది. కారణం? ఆహారమే జీవనం. జీవమే పరబ్రహ్మము. ఇది యదార్థము.

# 2. "నవ్వు-నజరాన"

అనంతకోటి జీవరాసుల్లో నవ్వ గలిగినవాడు మానవుడొక్కడే. మానవునికి బుద్ధితోపాటు నవ్వును కూడా ప్రసాదించాడు ఆ భగవంతుడు. ఈ రెండు మనిషికి ప్రత్యేక గుణాలు.

ఆనందం నుండి ఆవిర్భవించినదే నవ్వు. సంతోషానికి ప్రతిరూపమే నవ్వు. అది కొని తెచ్చుకునే వస్తువు కాదు, ఒకరు ఇచ్చేది కాదు. నవ్వు అపూర్వమైనది. కొందరు ఎప్పుడూ నవ్వుతూ ఉంటారు. చిరు నగవు మోము వాళ్ళను చూస్తే ఇంకా చూడాలనిపిస్తుంది, ఆప్యాయంగా మాట్లాడాలనిపిస్తుంది.

ఏడ్చే వారిని చూచి ఇతరులు గబుక్కున ఏడ్వరు. కాని నవ్వే వారిని చూచి, హాస్య ప్రియులను జూచి వెంటనే నవ్వేస్తారు. ఏడ్చేవారు కూడా నవ్వుతారు. నవ్వులో అంతశక్తి వుంది, ఆకర్షణ వుంది. అనురాగం వుంది. మనం నవ్వుతూ ఇతరులను నవ్విస్తూ జీవించటం దేవుడు మనిషికిచ్చిన వరం.

నవ్వటం, నవ్వించడం అందరివల్ల కాదు. బ్రహ్మానందం, ఏవియస్, సుధాకర్ మొదలుగ సినీహాస్య ప్రియులు బాధలున్న వారిని సైతం నవ్వించగలరు. వారు మాత్రం అప్పుడు నవ్వినట్టు కనబడరు. నవ్విన క్షణంలో బాధల్ని మర్చిపోతాం. బాగా నవ్వటం వల్ల నరాలబిగువు సడలి, సహజ స్థితికి వచ్చి ఉత్సాహంగా ఉంటాము.

నవ్వు సర్వరోగ నివారిణి. హాయిగా నవ్వే నవ్వు మనస్సు మీద, శరీరం మీద పనిచేసి మనిషిని ఉత్తేజపరుస్తుంది. మానసిక ఒత్తిళ్ళను దూరం చేస్తుంది. బాధలను మరిపించి, ఆత్మ విశ్వాసాన్ని పెంచి, మనిషిలో నూతనోత్సాహాన్ని కల్గిస్తుంది.

మనో వైజ్ఞానికుడు 'పియరీ వాచెట్' నవ్వుగూర్చి నలా అన్నారు.

నవ్వు బలమైన ఉత్ప్రేరణ కలుగ చేస్తుంది. నరాల బిగి సడలి మనిషి శారీరక వ్యవస్థలో మార్పు వస్తుందంటారు. మనః పూర్వకముగా నవ్వటం వల్ల నిర్లిప్తత, నిరాసక్తి తగ్గి మనిషి మానసికంగా, శారీరకంగా ఉత్తేజితుడువుతాడు. నవ్వు భాయందోళనలను తగ్గించి, ఆవేశాలను అరికడుతుంది. గట్టిగా నవ్వే వారి ఆయుస్సు పెరుగుతుందట.

ఆనందించు, సంతోషించు, అపహసించు, మేలమాడు, పరిహాసము, వింత, ఆశ్చర్యము, మొదలగు అనేకార్థములు గలవు నగవుకు. నవ్వినా నాపచేను పండును, నవ్విన ఊళ్ళుపట్టణములగును. నవ్వు నాలుగు విధాల చెరుపు. ఇలా అనేక సామెతలు నవ్వు మీద గలవు.

మయసభలో ప్రవేశించిన ధుర్యోధనుడు ఇంద్రనీల మణులు పొదగిన మణిమయ స్థలాన్ని చూచి జలమని భ్రమించి పంచిపైకి ఎగదోసుకొని నడిచాడు. ఇంకొకచోట స్పటిక విమల కమలములచే ఉన్న జలాశయమునుచూచి స్థలమని భ్రాంతి చెంది నడవగా అతని కట్టుబట్టలు తడిసిపోయినవి. అది చూసి పాంచాలి ఫక్కున నవ్విందట.

ఈ విధముగా సుయోధనుడు తెరచిఉన్న ద్వారము మూసినట్టుగా, మూసి ఉన్న ద్వారము తెరచినట్టుగా భ్రమపడి అందులో ప్రవేశించబోయి నవ్వుల పాలయ్యాడు. సమంగా ఉన్న ప్రదేశం మిట్టనేలగా భ్రమించి పైకి ఎక్కబోయి క్రిందపడ్డాడట. ఆ విధముగా మయ సభలో తిరుగుతూ దురోధనుడు అవమానం పొంది లజ్జా వదనుడైనాడు. ఈ అవమానం భరించలేక పోయాడు. ఆ పంచభర్తృక పాంచాలి ననుచూచి పరిహసించినది, ఇంతకంటే అవమానం మరేమున్నదని పాండవులపై పగబట్టి కుచ్ఛిత కుతంత్రాలతో వాళ్ళను అనేక కష్టనష్టాల పాల్జేసాడు. స్త్రీ నవ్వు ఎంతటి పరిణామాలకు దారి తీసిందో! ఈ సంఘటన తెలియజేస్తూంది.

"నగవు నగు నవ్వు నవ్వు నా నగు వాఖ్యలు హాసమునకు నగజాధీశా"అని నవ్వును గూర్చి ఎన్నో పద్యములు వ్రాసినారు. "వదనం ప్రసన్న సదనం సదయం హృదయం-సుధాముచో వాచః" ముఖం ప్రసన్నముగా ఉండాలి. మనస్సు సహృదయంతో ఉండాలి. మాటలు అమృత పలుకులుగా ఉండాలన్నారు. చిరునవ్వు చిందించే వారిని చూచి ఇష్టపడని వారెవ్వరూ ఉండరు. నవ్వుతూ ఎదుటి వారిని పలకరిస్తే వారు కూడా అనుకూలంగా స్పందిస్తారు. నవ్వు మనుష్యులను దగ్గర చేర్చుతుంది. ఇరువురి మధ్య సయోధ్యకు మార్గము ఏర్పడుతుంది. చిరు నవ్వులు చిందులాడే కుటుంబములో సంతోషము తాండవిస్తుంది. చిన్నచిన్న అపోహలు, కలతలు దూది పింజాల్లా ఎగిరిపోతాయి.

మనుష్యులెన్ని రకాలున్నారో అన్ని విధాలైన నవ్వులున్నాయి. ఒక్కొక్క వ్యక్తి ఒక్కొక్క తీరులో నవ్వుతాడు. ఒకరు వెకిలిగా నవ్వితే మరొకడు ముసిముసిగా నవ్వడం, మరొకరు నవ్వుతుంటే ఏడ్చినట్టుంటుంది. ఒకరు మూతి బిగించుకొని నవ్వితే, వేరొకరు పళ్ళన్ని బయటపెట్టి పకపక నవ్వేస్తారు. ఒక్కొక్కరు ఎక్కిఎక్కి నవ్వుతారు. కొందరు నవ్వితే కుక్క మొరిగినట్టుంటుంది. వేరు కొందరు నవ్వితే పిల్లి అరిచినట్టుంటుంది. ఇలా నవ్వులను వర్ణించుతూ పోతే అది ఒక పెద్ద కథ అవుతుంది. జంతువులు, పక్షులు, చెట్లు కూడా నవ్వుతాయి. అది మనకు తెలియదు. కాని నవ్వు మానవులొక్కరికే సొంతమన్నారు. నవ్వుగూర్చి ఎప్పుడో ఒకప్పుడు వ్రాయని కవి, రచయిత లుండరు.

ఆరోగ్య శాస్త్ర రీత్యా, నవ్వు మనిషికి ఎంతో మేలు చేస్తుంది అని ప్రముఖ వైద్యులు, మనస్తత్వ శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. నవ్వలేనివారు ఏదో రుగ్మతతో బాధపడుతున్నట్టుచెబుతున్నారు. మనిషి నవ్వుతూ సంతోషంగా ఉన్నప్పుడు, శరీరంలో రక్త ప్రసరణ బాగా జరిగి, శరీర వృద్ధి ప్రక్రియయైన "మెటబాలిజమ్" అభివృద్ధి చెంది, వ్యాధి నిరోదక శక్తి కలుగుతుంది. నవ్వు వల్ల శరీరములో అంతర్గత రసాయన

మార్పులు కలిగి, హానికరమైన సూక్ష్మక్రిములు నశిస్తాయి. అందువల్ల ఎంతగా నవ్వితే అంత వ్యాధి నిరోధక శక్తి పెరుగుతుంది. మందుల వాడకం తగ్గుతుంది. ఆరోగ్యంగా ఉండటానికి నవ్వు టానిక్‌కు మించిన టానిక్ లేదు.

హృదయ పూర్వకంగా పగలబడి, విరగబడి నవ్వటం నిష్కల్మషమైన మనస్సును సూచిస్తుందని గోల్డ్‌స్మిత్ అన్నారు. నవ్వటం మూలంగా ఊపిరి తిత్తులకు, గుండెకు మంచి వ్యాయామం అవుతుంది. నవ్వు మూలంగా కొన్ని హార్మోన్లు ఉత్పత్తై ఆహారం బాగా జీర్ణమవుతుంది. నవ్వటం వల్ల చెడుకంటే మంచే ఎక్కువగా ఉన్నందున ప్రపంచమంతా ఈనాడు "లాఫింగ్ క్లబ్బులు" వ్యాపించాయి. నవ్వుల పువ్వులు కురిపించే సాహిత్యము వెలువడినది. ఆ బాలగోపాలం ఈనాడు నవ్వుకు ఎక్కడలేని ప్రాధాన్యత ఇచ్చి పెంచి పోషిస్తున్నారు.

చిరునవ్వే భూషణంగా గల వ్యక్తిలో వింత ఆకర్షణ ఉంటుంది. అట్టి వ్యక్తులు సభ్య సమాజంలో ప్రత్యేకమైన గుర్తింపు కలిగి ఉంటారు. వీరికి ఎంతో మంది స్నేహితులుంటారు, అభిమానులుంటారు. ఎప్పుడు నవ్వుతూ నవ్విస్తూ ఉండే వ్యక్తుల మధ్య పోటీ పెట్టి బహుమతులందజేస్తున్నారు. లాఫింగ్ బుక్ ఆఫ్ రికార్డ్, నవ్వుకు నోబుల్ బహుమతి, పద్మభూషణం వంటి బిరుదులతోబాటు నవ్వు బహుమతితో అర్హులను సత్కరిస్తే ఎంత చక్కగా ఉండునో, కదా! నగుబాటు నవ్వులు, వెకిలి నవ్వులకు స్వస్తి చెప్పి అమ్మాయే చిరునవ్వు నవ్వగా....అన్నట్టు వాలుచూపుతో చిరునవ్వుచ చిందిస్తే చిత్తుకాని ఘనుడెవ్వడు ఈ వసుధలో. నవ్వలేనివాడు ఎన్ని సంపదలున్నా నిర్భాగ్యుడే.

# 3. శీలం కాపాడుకో

"పరిమాగ్నే దుశ్చరితాద్ బాధస్వామా సుచరితే భజ..." (యజు. వే.) "ఓ పరమేశ్వరా! అన్ని విధములైన దుష్టాచారములను తొలగించి ఉత్తమ శీలాచరణ మార్గములో నన్ను ఉంచుము." ఈ విధముగా సత్శీలము ప్రసాదించమని ఆయుగ మనుష్యులు భగవానుని ప్రార్థించే వారని యజుర్వేదము చెబుతుంది. ఆ మాట వేదమే చెబుతుందంటే సత్శీల ప్రాముఖ్యత ఎంతో వేరుగా చెప్పనవసరము లేదు.

గుణ యుతులై సత్సాం - ప్రదాయాలను పాటిస్తూ, సత్ ప్రవర్తనతో జీవించటమే సత్ శీలము. "శీలం సర్వత్ర వైధనం" శీలమే మనిషికి మూలధనమని పెద్దలన్నారు. నీతి వర్తనముగా, ఉత్తమ ఆశయాలు కలిగి క్రమశిక్షణతో అహింసా మార్గాములో శాంతి యుతముగా నిస్వార్థముగా జీవించటమే సత్శీలము.

శీలముయొక్క ఔన్నత్యాన్ని చెప్పే ప్రహ్లాదుని కథ తెలుసుకొందాము. స్వర్గాన్ని కోల్పోయిన ఇంద్రుడు, కృద్ధుడై అవమానభారంతో గురువైన బృహస్పతిని ఆశ్రయిస్తాడు. తన పదవిని ఏ విధంగా తిరిగి సంపాదించాలో మార్గం చూపమని ప్రాధేయపడతాడు. అందుకు బృహస్పతి ప్రహ్లాదుని గురువైన శుక్రాచార్యుని ఆశ్రయించమంటాడు. శుక్రాచార్యులవారు ప్రహ్లాదుని సంప్రదించమని సలహా యిచ్చాడు.

దేవేంద్రుడు వేషము మార్చి ప్రహ్లాదుని వద్ద శిష్యుడిగా ఉండి ఆయన అభిమానాన్ని చూరగొంటాడు. ఒకరోజు ప్రహ్లాదునితో! అయ్యా తమరికి ముల్లోకాల్ని జయించే శక్తి ఎట్లా వచ్చిందని అడుగుతాడు. తనశక్తి రహస్యాన్ని ఇలా వివరిస్తాడు. నేను గర్వపడను, ధర్మమార్గాన్ని ఎన్నడూ వీడను. ప్రపంచ సుఖశాంతుల కొరకు తపించే వారిని నొప్పించను. అట్టి మహనీయుల అభిప్రాయాలకు అనుగుణంగా

నడుచుకొంటాను. ఈ విధమైన శీలంకలిగి ఉండుట వలన అంతటి శక్తి లభించినదని చెబుతాడు.

ప్రహ్లాదుని శక్తి రహస్యాన్ని తెలుసుకొన్న ఇంద్రుడు ఆయనకు మరిన్ని సేవలు చేసి మరింత దగ్గరవుతాడు. శిష్యుడు ఏ కోరిక కోరితే ఇచ్చే స్థితికి తెచ్చాడు గురువు గారిని.

అదునుచూచి తన కోరికను బయటపెట్టాడు. మహాత్మా! తమ ప్రియ శిష్యుని కోరికను మన్నించి మీ శీలాన్ని దానంగా ఇవ్వవలసిందని కాళ్ళమీద పడి వేడుకుంటాడు. శిష్యుని కోరికను కాదనలేక పోయాడు పరమ విష్ణుభక్తుడైన ప్రహ్లాదుడు.

దానం చేయటానికి సిద్ధపడ్డ ప్రహ్లాదుని దేహము నుండి దైవరూపాలు బయటకు రావటం ప్రారంభించాయి. మొదట శీలం, తరువాత ధర్మం, సత్యం, నీతి, శక్తి, చివరగా పద్మం వంటి ముఖంతో తేజోవంతమైన దేవతారూపం బయటకు వచ్చింది. ఇలా తనలో నుంచి వెళ్ళిపోతున్న రూపాలను చూస్తూ చివరగా కనిపించిన దేవతా రూపాన్ని 'మాతా! నీవెవరవు?' మీరంతా నా నుండి ఎందుకువెళ్ళిపోతున్నారు చెప్పమని ప్రార్థించాడు ప్రహ్లాదుడు.

అంతట ఆ తేజోరూపం, ప్రహ్లాదుని వంక జాలిగా చూస్తు 'నాయనా ప్రహ్లాదా! నేను 'సిరి'ని, నీవు నీ శీలాన్ని నీ శిష్యుడైన దేవేంద్రునికి దానంచేసావు కదా? కనుక శీలం వున్నచోటే ధర్మం, ధర్మమున్న చోట సత్యం, సత్యమున్న చోట నీతి, నీతి యున్నచోట శక్తి, శక్తి యున్నచోట 'సిరి' అంటే 'నేను' ఉంటాము. నీ శీలం నీ నుంచి తొలగిపోగానే మేమంతా వెళ్ళి పోతున్నాము' అని చెప్పి వెళ్ళిపోయింది. శీలము యొక్క ఔన్నత్యాన్ని ఎంతో రమణీయంగా, హృదయ రంజకముగా చెప్పారు వ్యాసుల వారు.

సుగుణములు ఆచరాణాత్మకంగా, ధర్మావలంబనగా ఉన్న వాని

జీవితమే సార్థకమౌతుంది. ఇవిలేని వాని జీవితం నిరర్థకమవుతుంది. ఇదియే శీలము. "స జీవతి గుణాయస్య ధర్మో యస్య సజీవతి...." మనిషి యొక్క నిజరూపాన్ని పట్టి చూపించే అద్దం లాంటిది సత్ప్రవర్తన అన్నారు. శీల హీనులు కొన్ని సందర్భాలలో వారి వద్ద ఉన్న సంపదతో ఉన్నత స్థాయిలో ఉన్నా ఇతరుల మనో భావాలలో వారి నీచత్వం ముద్రవేసుకొంటుంది. శీలం అన్నిటిలా కొనుక్కొనే వస్తువుకాదు. ఎంతో ఓర్పు, సంయమనముతో కూడిన కృషితోపాటు సదాచారముతో ప్రవర్తిస్తే అలవడే గుణం శీలం. నీ దృక్పథం, చేతలు, చేష్టలు నీ శీలాన్ని నిర్ణయిస్తాయి.

శీలమనే మూలధనం లేకుండా ఏ కార్యాన్ని సాధించ లేమంటారు మన జాతిపిత. ఆశాహంకారాలను త్యజించుట, ఓరిమి, సత్యవర్తనము కలిగి యుండుట, సజ్జనులను సేవించుట, పరిశుద్ధమైన ప్రవర్తన కలిగి యుండుట వ్యక్తి యొక్క శీల సంపదను తెలియ జేయును. సతీ సావిత్ర తన ప్రాతివత్య ప్రభావంతో తల్లిదండ్రులను, అత్తమామలను, భర్తను ఉద్ధరించి లోక ప్రసిద్ధి గాంచినది తన సౌశీల్యము వల్లనే కదా!

పతియే ప్రత్యక్ష దైవముగా మనసా వాచా కర్మణా సేవించిన పతివ్రతా రత్నాలు, అనసూయ, సుమతి, సుకన్య, అరుంధతి, చంద్రమతి, దమయంతి మొదలగు వనితా మాతలు, శ్రీరాముడు, హరిశ్చంద్రుడు, విభీషణుడు, కుచేలుడు, ఉద్ధవుడు మొదలగు పురుష పుంగవులు సత్ శీలముచే కదా లోక విఖ్యాతి నొందినారు. తనకంటేపెద్దవారిలో శీలం చెడిపోతే వారిని గౌరవించవలసిన అవసరం లేదు, సత్ప్రవర్తన కలిగినవాడు బాలుడైనా గౌరవించాలని శాస్త్ర ఉవాచ.

శీల లక్షణా లేమిటో మను ధర్మశాస్త్రం చెప్పింది. "అహింసా సత్యమస్తేయం, శౌచమింద్రియ నిగ్రహం। ఏ తస్సా మాజికం ధర్మం చాతర్వర్ణ్యే అబ్రవీన్మనుః॥" అహింసను పాటించుట, సత్యం పలుకుట,

పరుల సొమ్ము ఆశించకుండుట, త్రికరణశుద్ధి, ఇంద్రియ నిగ్రహము అందరికి ఉండవలసిన శీలగుణాలు. ఈ లక్షణాలన్నింటిని తనలో ఇముడ్చుకొన్న వారే సత్శీలురు.

శీల సంపద ఎన్నటికి తరగని నిధి, ధన ధాన్యాలు లేకపోయినా సత్ ప్రవర్తన కలవానికి జీవితములో ఏలోటూ రాదు. శీలం లేని జీవితం గడిపేవారు ఎంత ధనసంపన్నులైనా వారి జీవితం నిరర్థకం. "శీలం హి సర్వస్య భూషణం"అన్నారు పెద్దలు. అందరకు సత్ శీలమే ముఖ్యమైన ఆభరణం. సత్ శీలుర జీవితం సర్వవిధాల శోభిల్లుతుంది. భగవంతుని దృష్టిలో సిరి సంపదలున్న వాని కంటే శీలంతో నడిచే వారే శ్రేష్టులు. "సదయం హృదయం యస్య భూషితం సత్య భూషితం। కాయః పరహితో యస్య కలిస్తస్య కరోతి కిమ్" ఎవరి హృదయము దయా శీలమో!, ఎవరి వచనములు సత్యరూపమో, ఎవరి దేహం పరుల హితము కొరకు పణంగా ఉంటుందో, అట్టి వారిని కలిపురుషుడు కుడా ఏమీ చేయలేడట, వారికి అపజయమే లేదట.

మనిషి యొక్క శీల ఔన్నత్యాన్నిగూర్చి భర్తృహరి బహు చక్కగా వర్ణించారు. "ఐశ్వర్యస్య విభూషణం, సుజనతా, శౌర్యస్య వాక్సంయమో....సర్వేషా మపి సర్వ కారణ మిదం శీలం పర భూషణం" ఐశ్వర్యంతో సుజనత్వం ఉంటేనే ఐశ్వర్యానికి గుర్తింపు, శౌర్యంతో బాటు శాంతమున్నప్పుడే విజ్ఞానం రాణిస్తుంది. మంచి బుద్ధికి వినయ విధేయతలు తోడైనపుడు గుర్తింపు వస్తుతుంది. తపస్సుతోబాటు సాత్త్వికత్వము అబ్బినపుడే తపస్సు ఫలిస్తుంది, అధికారంతో బాటు క్షమా గుణము, క్రమశిక్షణ ఉన్నప్పుడు అధికారం నిలుస్తుంది. ధర్మగుణంతో బాటు న్యాయము - నిజాయితీ కలిగి నప్పుడు ధర్మ గుణం శోభిల్లుతుంది. దీనినిబట్టి తెలియునది 'శీలమే' సకల సద్గుణాలకు ఆలవాలమని.

పై అంతస్థులో, ఉన్నత స్థాయిలో నున్నవారు నీతివంతులు, సత్శీలురై ఉంటేనే నైతికత్వం, శీలగుణాలు అట్టడుగునున్న స్థానం వారి వరకు ప్రవహించును. ఫలితంగా సమాజంలో సౌశీల్యం అలవడుతుంది. శీల లక్షణాలను క్రింది వర్గాల నుండినిర్మించలేము. శీలసంపద ఉన్నత వర్గాల వారినుంచే నిర్మించుకురావాలనే హితబోధ యెల్లరు గ్రహించాలి. అప్పుడు 'యథారాజ తథా ప్రజ' సార్థక మవుతుంది. అవినీతి పరులు, అక్రమార్కులు, శీల హీనులు, శీలం గూర్చి తెలుసుకొని ఆచరించి శీలాన్ని కాపాడుకోండి.

# 4. ప్రేమించబడు

ప్రేమతత్త్వం వర్ణనాతీతం. అనిర్వచనీయమైనది ప్రేమ. మనస్సు నుండి పుట్టిన ప్రేమ కామ పరమైనది. హృదయలోతు నుండి జనించునది నిస్వార్థ ప్రేమ. నీవు ఇతరులలో ఏ గుణాన్ని బట్టి లేక రూపం చూచి ప్రేమ పెంచుకొంటావో, ఆ గుణం, రూపం లుప్తమైనప్పుడు నీ ప్రేమ భావన కూడా మరింత లుప్తమై పోతుంది. ఈ విధమైన ప్రేమను ప్రధానంగా తీసుకునేవారు సామాన్యులు. మోహానురాగాలకు పర్యాయపదంగా "ప్రేమ" పదము వాడుతుంటారు. ఇది స్వార్థపూరితమైన ప్రాపంచిక ప్రేమ.

ప్రేమ-భక్తి భగవంతుని స్వరూపం. అందువల్ల ఈ సర్వసృష్టి ప్రేమమయంగా ఆవిర్భవించినది. ప్రేమ అదొక దివ్యానుభూతి. ప్రేమలో అద్భుతమైన దైవశక్తి ఇమిడి యున్నది. దైవత్వానికి దగ్గరగా తీసుకెళ్ళే ప్రేమ-భక్తి దివ్యప్రేమ. ఒక్కసారి ఏర్పడ్డ ప్రేమ భావన ప్రపంచము తల్లక్రిందులైనమారనిది పారమార్థిక ప్రేమ. ఇట్టి ప్రేమ మూర్తులు పరమ భక్తులుగ ఉంటారు. వీరి ప్రేమ ఎంతటి త్యాగానికైనా వెనుకాడదు. ఆత్మార్పణకు ప్రతీకమైనదే ఈ ప్రేమ.

భగవత్ స్వరూపమైన ప్రేమను నిర్వచించటం ఎందరికో అసాధ్యమైనది. ప్రేమకు ప్రేమయే పరమావధి. ప్రేమను ప్రేమయే ప్రేమిస్తుంది. ఒక్క మానవులకే కాదు, సర్వజీవులకు ప్రేమ భావన లేకున్న, జీవితాలు నిస్సారమై విశ్వమంతా నిరర్థక మౌతుందనటంలో ఎవ్వరూ సందేహించరనుకుంటాను. కనుక సమస్త జీవరాసులను సమభావముతో ప్రేమించాలి. అంతటిని ప్రేమించాలి - ప్రేమించబడాలి. అప్పుడు ప్రేమతత్త్వం కొంతెన అర్థమౌతుంది.

నిజమైన ప్రేమ మౌలికమైనది. కామ పూరితమైన ప్రేమ బాహ్యాపరమైనది, అస్థిరమైనది, ఎదుటి వారిలో ఆకర్షణ పోయిన

అణగారిపోయేది, స్వార్థ పూరితమైన ప్రేమ ప్రమాదకారి. స్వచ్ఛమైన, సత్యమైన ప్రేమ దైవరూపమైనది. "ప్రియ మిత్యేవ దుపా సీత" (బృహ.ఉ.) దైవాన్ని ప్రేమ రూపంగా ఉపాసించవలెను. ప్రేమ దైవము, భగవానుడు ప్రేమ రూపుడు. రాధాకృష్ణుల ప్రేమ, శివపార్వతుల ప్రేమ ఆత్మపరమాత్మకు ప్రతీకలుగా ప్రేమతత్త్వాన్ని అందించాయి. శ్రీకృష్ణుడు ప్రేమకు ప్రతిరూపం. గోపికా క్రీడల్లో గాని, తత్త్వంలో గాని ప్రతిబింబించిన ప్రేమ భావము ఆధ్యాత్మిక సందేశాన్ని అందజేస్తున్నది. బుద్ధుని అహింసా బోధనలో ప్రేమాప్యాయతల ప్రాధాన్యం ఎంతగానో గోచరిస్తున్నది.

భూమిపై నున్న అన్ని శక్తులకు మించిన శక్తియే ప్రేమ. ప్రేమానురాగాలు వేరు, మోహకామాదులు వేరు. కామం ఇంద్రియ ప్రీతి కొరకు కలిగిన కోరిక. "విద్ధి మోహనమ్" మోహం కలుగ జేయునది కామం. కామం తమోగుణలక్షణమైన మోహం వల్ల కలుగుతుంది. ప్రేమ ఇంద్రియాలకు అతీతమైన ప్రీతి కలగాలనే కోరిక. ఇది సత్త్వ గుణ ప్రధానంగా ఉంటుంది.

తనకు తృప్తి కలగటమే కామోద్దేశము. ప్రేమకు ప్రేమింపబడిన వారి తృప్తే ముఖ్యము. గోపికలకు ఇంద్రియ తృప్తి అనే భావన అణుమాత్రమైనా లేదు. శ్రీ కృష్ణునికి తృప్తి కలిగించడమే వారి భావన. గోపికల ప్రేమ యందు రవ్వంతైనా మచ్చలేదు. గోపికా కృష్ణుల సంయోగము కాయకమైనది కాదు, ఆత్మాత్మల సమావేశం. ప్రేమ చైతన్యాన్ని అర్థం చేసుకోనివారు శ్రీకృష్ణ గోపికా ప్రణయ గాధలను అవాక్కులుగా చెవాక్కులుగా చెప్పుకొని తృప్తిపడతారు.

నిర్వచనానికి అతీతమై అనుభూతికి అందేదే ప్రేమ. ప్రేమ అనుభవించే వారికి అర్థమయ్యే అపురూపమైన అనుభూతి. ప్రేమించటం, ప్రేమించబడటం అద్భుతమైన ప్రక్రియ. అది పరిపూర్ణమైన సమత్వాన్నిచ్చి, అనిర్వచనీయమైన మాధుర్యాన్నిస్తుంది.

ఈ అనంత విశ్వంలో నున్న కోటానుకోట్ల జీవులు ఒకదానిని మరొకటి ప్రేమిస్తాయి. ప్రాణి తనను తాను ప్రేమించుకుంటూ మరొక ప్రాణిని ప్రేమిస్తుంది. పరస్పర ప్రేమానురాగాల మధ్య మాతృమూర్తి ప్రేమ వెలకట్టలేని విలువగలిగినది. ఒక రకముగా తండ్రిప్రేమ నిష్కల్మషము కాకపోవచ్చు. కాని తల్లి ప్రేమ ఆపాతమధురము. త్యాగానికి మరో రూపం అమ్మ ప్రేమ. ప్రకృతి పరంగా దైవం ప్రసాదించింది మాతృప్రేమ. అందుకే ప్రతి స్త్రీ తను సంతానవతి కావాలని కోరుకుంటుంది. మాతృప్రేమ మాధుర్యాన్ని తన కడుపు చించుకొని పుట్టిన బిడ్డలకు పంచిపెట్టాలను కొంటుంది. పెద్దల ఆశీర్వచనములు కూడా "సంతానవతీభవ", "పుత్ర పౌత్రాభివృద్ధిరస్తు" అని ఉంటాయి. శాస్త్రాలు అదే చెప్పాయి. అమ్మ ప్రేమ అమర ప్రేమ.

మనుష్యులు వారి ఇష్టాయిష్టాలను గూర్చి చెబుతుంటారు. నాకు శ్రీ సత్యసాయిబాబా అంటే చాలా ఇష్టమంటారు కొందరు. మరొకరు నాకు షిర్డి సాయి బాబాయే ధ్యేయం అంటారు. అలాగే ఎ.ఎన్.ఆర్., ఎన్.టి.ఆర్., చిరంజీవి, సావిత్రి, సౌందర్య, ఆవకాయ, గోంగూర పులుసు ఇలా వారికి ఇష్టమైన వాటిని చెప్పి, అభిమానాన్ని, ప్రేమను ప్రదర్శిస్తారు. కాని అవతలి వాళ్లు నిజంగా వీళ్ళంటే ప్రేమగా ఉన్నారా అనేది తెలుసుకోరు. మనం ప్రేమించే వాళ్ళచే ప్రేమించబడుతున్నామా అనేది తెలుసుకోవటం ముఖ్యం.

భక్తి యోగంలో భక్తునకు కావలసిన లక్షణాలను చెప్పి అందులో తనకు ఏరకమైన భక్తులంటే ప్రియమో భగవానుడు సెలవిచ్చాడు. "స్థిరమతిః భక్తి మాన్మే ప్రియో నరః" నిశ్చయ బుద్ధితో, భక్తితో ఉండువారు నాకు ప్రియమైన వారు అంటారు. సృష్టిలో ప్రతి మానవుడు పొందదగినది అత్యంత మూల్యమైనది భగవత్ ప్రీతియే. నిష్కామమైన ప్రేమ భావన గలవారు దైవప్రేమకు పాత్రులగుదురు. స్వచ్ఛమైన,

నిర్మలమైన ప్రేమతో భగవానుని ప్రసన్నం చేసుకోవచ్చునని శాస్త్రాలు చెబుతున్నాయి. స్వచ్ఛమైన ప్రేమ సమస్తాన్ని పునీతం చేస్తుంది.

ఏక పక్షముగా ఉండే ప్రేమలో పరిపూర్ణత ఉండదు. ఇరువురి వ్యక్తుల మధ్య సంపూర్ణమైన అవగాహనతో ఏర్పడే ప్రేమ స్వచ్ఛమైన ప్రేమ. తల్లిదండ్రుల ప్రేమ తరువాత మానవ జీవితంలో ప్రేయసి ప్రియుల ప్రేమ ఆస్థానాన్ని ఆక్రమిస్తుంది. మంచి ప్రేమకు అర్థం చెప్పే ఎన్నో ప్రణయగాథలు అనేక గ్రంథాల్లో చెప్పబడ్డాయి. రోమియోజూలయట్, దేవదాసుపార్వతి, అనార్కలి సలీం, లైలా మజ్నూ ఇలా ఎన్నెన్నో గాథలు ఉన్నాయి. ప్రేమచేత ఉత్తేజితులైనవారు సంగీత, సాహిత్య చిత్ర కళలందు, వైరాగ్యమందు కన్పిస్తారు. వారి మదిలోని ప్రేమ మూర్తుల తలంపులు, ఉత్తేజాన్ని, ప్రేరణను కలిగించి వారిని ముందుకు నడిపిస్తాయి. విశ్వరూపమైన ప్రేమ తత్త్వాన్ని గూర్చి వ్రాయని కవి, పాడని గాయకుడు, త్యాగం చేయనివారు లేరంటే అతిశయోక్తి కాదు. నిన్ను ఎవ్వరూ ప్రేమించకుండా ఉంటే అది తప్పకుండా నీఘోర తప్పిదమౌతుంది. అందుకే ప్రేమించబడటం తెలుసుకో, ప్రేమ మజా ఏమిటో తెలుస్తుంది.

ప్రేయసి ప్రియుల మధ్య సంపూర్ణమైన విశ్వాసం ఉండాలి. అనుమానాలకు, అపార్థాలకు తావు ఇయ్యకూడదు. ఇరువురు నిస్వార్థపరులై, త్యాగబద్ధులుగా ఉండాలి. శరీరాలే వేరు ఆత్మలు ఒక్కటే అనే పవిత్ర భావం ఉండాలి. ఈ విధముగా ఇరువురిలో అంకురించిన నిష్కల్మషమైన ప్రేమ ఆత్మవిశ్వాసాన్ని కలుగజేస్తుంది. విశ్వప్రేమను కలుగజేస్తుంది. అపారమైన ప్రేమాప్యాయతలు చూపించిన బుద్ధుడు, ఏసుక్రీస్తు, ప్రేమకు ప్రతిరూపాలు. నిశ్చలమైన ప్రేమ భగవత్తత్త్వాన్ని తెలుసుకొవటానికి మార్గం చూపుతుంది. కనుక ప్రేమించబడటం తెలుసుకో, ప్రేమను ఆచరించటానికి ప్రతిన పూను, ప్రేమ మూర్తులలో స్థానం దొరక్కపోదు.

# 5. ఆదర్శజీవనం

"యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥ (భ.గీ. 3-21)

ఉత్తములైనవారు ఆచరించు కర్మలను సామాన్యులు ప్రమాణంగా స్వీకరించును. లోకములోనున్న వాళ్ళంతా శ్రేష్ఠులనే అనుసరించును.

ఉత్తము లేటువంటి వారు? ఏ లక్షణాలు కలిగి ఉంటారు? శ్రేష్టులు, సద్గుణ సంపన్నులు, సర్వ శ్రేయోభిలాషులు, ఆదర్శవంతులు ఉత్తములు. వారి లక్షణాలు ఏ వంటే, "తుల్యే ప్రియా ప్రియే యస్య సుఖదుఃఖే తద్దైవ చ అతీతా నాగతే చోభే సవై సరదనీ నః" మహాభారతం ఇలా చెప్పింది.ఎవరు ప్రియా అప్రియాలు, సుఖదుఃఖాలు, భూత భవిష్యత్కాలాలను సమముగా చూచునో అట్టివారే సర్వధని అయిన మానవుడు, ఆదర్శమూర్తి.

ఉత్తములే సంఘానికి ఆదర్శప్రాయులు, మార్గ దర్శకులు. వీరి నడవడికను, ఆచార వ్యవహారాలను సంఘం ఆదర్శంగా తీసుకొంటుంది. ఆదర్శము అద్దము వంటిది, చూచి నేర్చుకొనదగినది, దృష్టాంతముగ నిలిచి పోవునది.

అనుకరణ మానవ నైజం. పెద్దవాళ్ళను చిన్న వాళ్ళు అనుకరిస్తారు. తల్లిదండ్రుల ప్రవర్తన పిల్లల మీద కనబడుతుంది. సినిమా హీరోల వేషధారణను యువకులు అనుకరిస్తారు. కొందరి మాటలను, చేతలను మరికొందరు అనుసరించటానికి ప్రయత్నిస్తారు. పెద్దలు చెప్పే మాటలకంటే వారు చేసే పనులను సామాన్యులు అనుకరిస్తారు.

"యథారాజ తథా ప్రజ" రాజుగారు ఎలాంటి వారో ప్రజల

నడవడికను బట్టి చెప్పవచ్చు. శ్రీరాముని పాలన నీతినియమాలకు, ధర్మానికి, న్యాయానికి ప్రతీకగా ఉన్నది. అందుకే అందరూ శ్రీరామ పాలన కావాలనుకొంటారు. పాలకుడు తుగ్లక్ లాంటి వాడైతే ప్రజలు కూడా అవే చేష్టలతో నడచుకొంటారు. పెద్దవారి నడవడికను సామాన్యులు కనిపెడుతూనే ఉంటారు.

దేశాధ్యక్షులంతటి వారు, ప్రధానమంత్రులవంటి మేధావులు, గొప్పవారు బాబాల చుట్టూ ప్రదక్షిణలుచేస్తుంటే మనం ఏపాటని, సామాన్యులు అసలు దేవుళ్ళకు గుడ్‌బై చెప్పి బాబాలను, స్వాములోళ్ళను అవతార పురుషులుగా ఆరాధిస్తున్నారు. అందుకే రామాలయాలు, శివాలయాలు, దేవి దేవతా ఆలయాలు మూలకు పడిపోయి అవసానదశలో కొట్టుమిట్టాడుతున్నాయి.

శ్రేష్టులైన వారు కర్మాచరణ విషయములో కడుజాగురూకులై ఉండవలెను. ఉత్తములు దేనిని ప్రమాణముగా తీసికొని ఆచరించటానికి ప్రయత్నించునో సామాన్య జనం కూడా దానినే ప్రామాణికముగా తీసుకొని ఆచరించుటకు ప్రయత్నించును.

ఆదర్శ మానవుని వ్యక్తిత్వం పూర్తి ఆరోగ్యంతో బాటు ధృడమైన మనస్సు, పవిత్రమైన బుద్ధి, ఆధ్యాత్మిక సమన్వయంతో అభివృద్ధి చెంది ఉంటాయి. "శరీర మాద్యంఖలు ధర్మ సాధనం". ఈ శరీరమే ధర్మసాధనకు ముఖ్య పరికరము. కనుక శరీరాన్ని ఆరోగ్యముగా ఉంచుకోవటం ప్రతి వ్యక్తి కర్తవ్యం. అందుకే వివేకానంద అన్నారు మనిషి ఇనుప కండరాలు, ఉక్కు నరాలు కలిగి ఉండాలని.

మనస్సు శరీరం కన్నా ఉన్నతమైనది. ధృఢమైన మనస్సు కష్టసుఖాలలో ప్రశాంతముగా ఉంటుంది. సానుకూల భావాలు, ఏకాగ్రత, నిర్భయత్వం, సాహసకృత్యాలు, ఆత్మ విశ్వాసంతో కూడిన మనస్సు మనిషికి మంచి స్నేహితుడిగా సహాయం చేస్తుంది. ప్రపంచం

మంచి చెడ్డల మిశ్రమము. విచక్షణ శక్తి గల బుద్ధి ధర్మా ధర్మముల మధ్య మంచి చెడ్డల నిర్ణయం చేసి మనిషిని నడిపిస్తుంది. ఉత్తములలో ఇది నిర్ణయాత్మకముగా పనిచేస్తుంది.

ఉక్కు శరీరముతో ధృడమైన మనస్సు కలిగి నిశ్చయాత్మకమైన బుద్ధి కలిగిన మానవుడు అజరామరము, శాశ్వతము, ఆనందమయమైన ఆత్మ రూపుడను తాను అని తెలుసుకో గలుగుతాడు. భౌతిక, మానసిక, బుద్ధిపరమైన ఆధ్యాత్మిక సమన్వయాభివృద్ధి సాధించిన మానవుడు పరిపూర్ణుడౌతాడు. అటువంటి వారే సంఘానికి ఆదర్శమూర్తులౌతారు.

ఆధ్యాత్మిక గురువులైన స్వామి వివేకానంద, రమణ మహర్షి, పోతులూరి వీరబ్రహ్మంగారు, అనిబిసెంట్, సంఘ సంస్కర్తలు మహాత్మాగాంధీ, వినోభాభావే, మదర్ థెరిసా మొదలగు వారు ఆదర్శ ప్రాయులు.

ఆదర్శ మూర్తులు స్థితప్రజ్ఞులు "దుఃఖేష్వనుద్విగ్నమనా.." సుఖదుఃఖాలు, అనురాగము, భయము, క్రోధము మున్నగు గుణములను జయించినవారు స్థిత ప్రజ్ఞులు వీరు సంఘానికి దర్పణము వంటివారు. ఉత్తముల మాటల కన్నా చేష్టలు మిన్నగా ఉంటాయి. వీరు మితభాషులు, చేతల మనుష్యులు. వీరు చెప్పేది తక్కువ, చేసేది ఎక్కువ. యదార్థాన్ని సత్యాన్ని సరైన మార్గములో సామాన్యులు అనుసరించే విధంగా ప్రవర్తిస్తారు.

శరీరానికి అవయవాలు ఎంత ముఖ్యమో, సామాన్యులకు ఆదర్శ రూపులు అంతముఖ్యము. వీరి కార్యాచరణములు సంఘముపై ప్రత్యక్షముగనో, పరోక్షముగనో పడును. ఈనాటి సంఘాన్ని పరిశీలిస్తే ఆదర్శ ప్రాయులన్నవారు వారి బాధ్యతలను విస్మరించారన్న సందేహము కలుగుతుంది. సామాన్యులు పెడత్రోవలో పయనిస్తున్నారు. ఈ విధముగా చేయుట భగవంతునికి అపకారం చేసినట్లేయగును.

పూర్వం రోజుల్లో ఐశ్వర్యవంతులు, ధైర్యవంతులు, బుద్ధిమంతులు, నీతిమంతులు, సత్యసంధులు, సంస్కర్తలు, మేలు బంతి జీవనం గడిపేవారు. వీరు ఉన్నత ప్రమాణాలతో, విలువలతో జీవించేవారు. వీరు బీదవారుగా కూడా ఉండేవారు. కాలం తిరగబడింది. నీతివర్తనుడు, ధర్మాచరణుడు, బుద్ధిమంతుడు, సత్ ప్రవర్తనుడు పనికిరాని వాడిగా పరిగణించబడు తున్నాడు నేదు.

కాలగమనంలో రాజులు, రాజ్యాలు పోయాయి, దేశాలు, రాష్ట్రాలు వచ్చాయి. ప్రజాస్వామ్య పాలన సాగుతుంది. ప్రజలే పాలకులు, పాలితులు. ఎవడికి వాడే పెద్ద. అందరూ పెద్దలే కనుక వినేవాడు లేడు. అందరూ చెప్పేవాళ్లే ఉన్నారు. ఎవడి నడత వాడిది. ప్రజాస్వామ్యము కదా! పదిమంది పందిని నంది అని చేతులెత్తితే అది నందే అయిపోతుంది.

ఉన్నత పదవుల్లో ఉన్నవారు అవినీతికి అలవాటుపడ్డారు. డబ్బు సంపాదనే ధ్యేయంగా, ఉన్న పళంగా స్థాయి పెరగాలి. వేలుముద్ర వేస్తే మాత్రం ఏమిటి? పదవి వరించింది. పెద్ద బంగళా, కార్లు, కంపెనీ షేర్లు, విదేశ విహారాలు వగైరాలు షరామామూలే. ఈ పెద్దోళ్లు నోరువిప్పితే వచ్చేవి నీతి శతకాలు, నడవడిక చూస్తే అవినీతి జాతకాలు. ఇప్పుడు వీళ్ళే "యద్యదాచరతి శ్రేష్ఠః" కనుక సామాన్యులు వీరిని అనుసరించి మరీ నడుచుకొంటున్నారు. ఆదర్శాలు, ఉన్నత విలువలు వంటివి అటకెక్కాయి. ఇప్పుడు కావలసిందల్లా ఆదర్శాలు విలువలు కాదు, అవి ఏమైనా కడుపు నింపుతాయా! కాదు కనుక అవినీతి, అపమార్గం, అబద్ధాలు, పనిచేయటం అంటే పడక పోవటం, మోసం, దగా మొదలగు (దుర్గు) సుగుణాలు వృద్ధి చేసుకొని డబ్బు, డబ్బు సంపాదించాలి, గొప్ప గొప్ప పదవులు గుంజుకోవాలి, తాను అష్టైశ్వర్యాలతో తులతూగాలి. పక్కవాడు పచ్చగాకాదు ఎండి గడ్డైపోవాలి. ఇవి ఈనాటి మానవుని ప్రవర్తనలు. డబ్బుజబ్బే రాజ్యం ఏలుతుంది.

ఆదర్శాలు, ఉన్నత విలువలు పడిపోవటానికి, తరిగిపోవటానికి కారణం నేటి అధ్యాత్మిక గురువులు, సంస్కరణ కర్తలు, ఉన్నత పదవులు అలంకరించిన వారితోబాటు సవాలక్ష కారణాలున్నాయి. ఇవే వ్రాసుకుంటూ పోతే మహాభారతాన్ని మించిన గ్రంధం అవుతుంది.

ఆదర్శ మూర్తులు వారి సర్వస్వాన్ని త్యాగం జేసి నిర్విరామంగా సమాజానికి మంచి చెయ్యాలనే కార్యనిర్వాహకులూ నాడే కాదు నేడుకూడా లేకపోలేదు. వారిని అంతగా గుర్తింకపోవటం,అట్టి మహనీయుల ఆదర్శాలను కాపీ చేయక పోవటం శోచనీయం.

ఆదర్శ నడవడికకు అడమగ తేడా లేదు. మహరాజు ఋత ధ్వజుని సతీమణి మదాలస సమస్త భోగ భాగ్యాలు అనుభవించటానికి అందుబాటులో నున్న తన ముగ్గురి సంతానాన్ని రాజభోగాలకుదూరం చేసి వారికి ఆత్మ ప్రబోధం చేసి వారిని పరిశుద్ధ జ్ఞానమూర్తులుగా తయారు జేసింది. రాజుగారి కోరిక మీదట నాల్గవ కుమారుడు అలర్కుడు రాజ్యాన్ని పాలించి తనను గూర్చి పరామర్శించుకొని "అహూ! కష్టం యద స్మాభి, పూర్వం రాజ్య మనుష్టితమ్! ఇతి పశ్చాన్మయా జ్ఞానతం, యోగాన్నాస్తి పరం సుఖమ్". ఔరా! పూర్వం రాజ్యపాలన కాలంలో నేను పొందిన కష్టమెంత? ఇప్పుడు యోగాభ్యాసంతో నా స్వరూపాన్ని నేను గుర్తించాను. యోగం కంటే పరమ సుఖం మరరొకటి లేదని తెలుసుకొన్నాను"అంటారు. ఆ విధంగా గర్భశోక బాధ నుండి విముక్తుడయ్యాడు.

విక్రాంతుడు, సుబాహుడు, అరిమర్థనుడు అను ముగ్గురు కుమారులకు జోల పాటలతో ఆత్మతత్త్వాన్ని అందించి తన కడుపున పుట్టిన సంతానం మళ్లి గర్భనరకం అనుభవించకూడదని వాళ్ళను మహా తత్త్వజ్ఞానులుగా తీర్చిదిద్దిన ఆదర్శమూర్తి మదాలస.

స్త్రీలోకానికే తలమానికమైన స్త్రీజాతి రత్నం, అందరి తల్లులకు

ఆదర్శమూర్తి మదాలస. ఇది కేవలం కథకాదు. జరిగిన జీవిత కథ. చరిత్ర పుటల్లో చోటుచేసుకొని ఆదర్శ జీవనానికి అద్దము పట్టిన కమనీయగాధ.

కాల పరిణామంలో ఆదర్శాలు అడుగంటి పోతున్నాయి. వాస్తవముగా నాయకులుగా ఉన్నవారు. విద్యావంతులు, అధికారులు, అనధికారులు, గురువులు తత్త్వ వేత్తలు, శాస్త్ర వేత్తలు, పండితులు, ఆదర్శాలతో గొప్ప ప్రమాణాలు కలిగి ఉండాలి. సమాజానికి ఆదర్శంగా నిలబడాలి. ఆదర్శాలను, శాస్త్ర విధులను పాటించడం, ధర్మవర్తనంగా నడవడం అంత సులభమైనది కాదు. వీటిని పాటించటానికి శాస్త్రాలు అనేక సాధనోపాయాలు చెప్పాయి.

శాస్త్రాలను చట్టబండలుగా జేసి ఆదర్శాలను, ఉన్నత విలువలను తుంగలో త్రొక్కి, ఎవడెట్టాపోతే మనకేం, మనం దండిగా డబ్బు సంపాదించి, భోగభాగ్యాలతో జీవనం సాగిస్తే చాలు అనే ధోరణి నేటి సమాజంలో ప్రబలి పోయింది. సామాన్యులు దీనినే అనుకరించటానికి ముందు కొస్తున్నారు. ఇదే "సదను వర్తనం" అవుతుందంటున్నారు నేటి శ్రేష్టపుంగవులు కూడా.

ఆదర్శాలు, నీతులు, ధర్మాలు, పుస్తకాలకే పరిమితం అయి పోయాయి. వీటి ఆచరణ వల్ల కష్టాలు తప్ప సుఖాలకు దూరమైపోతున్నామని మేలుబంతి జీవనానికి స్వస్తిచెప్పి, వాటిని గాలికి వదిలేస్తున్నారు ఈనాటి మానవులు. అందుకే నేడు ఉన్నవాడికి, లేనివాడికి లేదు శాంతి, అశాంతిలో అనర్థకంగా బ్రతకటమే నవనాగరికత అయిపోయింది.

"సర్వ భూతేషు కారుణ్యం ప్రియ భాషణ మేవ చ।
సర్వ భూతహితే శ్రద్ధా సాక్షాత్ భక్తి శ్శివస్యతు॥

అన్ని ప్రాణులపై కరుణతో, మధుర సంభాషణతో, సర్వ

ప్రాణులకు మేలు చేయడంలో శ్రద్ధ వహించడం, భగవంతుని యందు భక్తిని పెంపొందించుకోవడమే ఆదర్శ జీవనానికి గీటురాళ్ళు. ఈ లక్షణాలను అలవర్చుకొన్న ద్వంద్వాతీతులు ఆదర్శమూర్తులు. వారి ఆదర్శాలను అనుకరించినప్పుడు మనిషిలోని మానవత్వం వికసిస్తుంది.

ఆదర్శ జీవనం సాగించిన వారిని అనుకరించటానికి వ్యక్తిత్వ వికాసమునకు ప్రతి మనిషి పాటుపడినప్పుడు సత్శీల సమాజం అవతరించటమే కాదు, శాంతిమయ సమాజం వర్ధిల్లుతుంది.

# 6. పూజా పునస్కారాలు

వేదకాలంలో యజ్ఞము, యోగము అనే రెండు ప్రధాన కార్యాలను అప్పటి ప్రజలు ఆచరించి ఇహపరాల్ని సాధించేవారు. వేదాలు సర్వ మానవాళి ప్రగతికి ప్రమాణికం. యజ్ఞస్వరూప స్వభావాలను వేదాలు వివరించాయి.

ప్రపంచములోని అన్ని మతాలవారిలో యజ్ఞం ఏదో రూపంలో ప్రచారంలో ఉన్నదని మాక్సుముల్లర్ తన "ఫిజికల్ రిలిజియన్"అనే గ్రంథములో వ్రాసాడు.

ప్రాచీనకాలంలో యజ్ఞశాలని దేవాలయమని పిలిచేవారట. యజ్ఞం అంటే దేవపూజ అనే అర్థం ఉంది. కాలపరిణామంలో యజ్ఞం యొక్క రూపాన్ని పూజావిధానంగా మార్చేసారు. అంటేయజ్ఞం నుండే పూజ ఆవిర్భవించింది.

యజ్ఞ మంటపాన్ని అలంకరించటానికి పువ్వులనుపయోగించే వారు. అది ఇప్పుడు విగ్రహాలను పూలతో అలంకరిస్తున్నారు. యజ్ఞంలో మృష్టాన్నము, పండు ఆహుతి చేసేవారు. వాటి స్థానంలో దేవతావిగ్రం ముందు నైవేద్యం పెడుతున్నారు. యజ్ఞం కుండంలో అగ్నిరూపంగా, దేవునికి దీపారాధన, అగరువత్తులు వంటివి వెలిగిస్తున్నారు. బ్రాహ్మణులను అప్పుడు కొబ్బరి కాయలతో సత్కరించేవారు. దానిస్థానంలో స్వామివారి యెదుట కొబ్బరి కాయను కొడుతున్నారు. యజ్ఞకుండాలు విగ్రహాలుగా మార్చబడ్డాయి. ఆ విధంగా యజ్ఞాన్ని సంక్షిప్తం చేసి దానిరూపాన్ని దేవాలయాల్లో ప్రతిష్ఠించి, వేదమంత్రోచ్ఛారణతో భగవానుడికి అర్చనలు చేస్తున్నారు.

ఆ విధంగా విగ్రహారాధన, పూజలు ప్రారంభమయ్యాయి. కాలగమనంలో అనేక మార్పులు, చేర్పులు వచ్చి పూజ నాలుగు

విధాలుగా చెప్పబడినది. 1. బాహ్యాపూజ, 2. మానసపూజ, 3. స్తోత్రం, 4. కైంకర్యము. పూజ మూడు విధుల్ని చెబుతుంది. "దేవతా ఉద్దేశన ద్రవ్యత్యాగః" దేవుని కొరకు ఒక వస్తువుని గాని పదార్థాన్ని గాని అర్పించడం. అది పువ్వుఆవచ్చు, మనస్సు కావచ్చు, లేదా నీవుచేసే కర్మగావచ్చు. భగవానునికి అర్పణచేసేది ఏదిగాని త్రికరణ శుద్ధిగా చెయ్యాలి. రెండోవిధి పూజకు సంబంధించినది. ప్రతిది పవిత్రంగా ఉండాలి. పూజాద్రవ్యాలన్నింటిని మంత్రోచ్చారణతో నీటితో శుద్ధిచెయ్యాలి. దేవతలను గంట, దీపం, పువ్వులు, శంఖం, నీరు మొదలగు వాటితో ఆవాహన చేయటం వల్ల పూజా వస్తువులు పవిత్రీకరించ బడతాయి. అందుకు అనుగుణంగా మనస్సును కూడా శుద్ధిగావించుకోవాలి.

పూజకుడు భగవంతునితో అనుబంధాన్ని ఎర్పరచుకోవాలి. ఇష్టదైవాన్ని ప్రార్థించేటప్పుడు ఆయన స్వరూపంలో ఐక్యమయినట్లు భావించాలి. నీలో ఆయన్ని దర్శించాలి. ఇది మూడవవిధి.

బాహ్యాపూజకు విగ్రహమో, చిత్తరువో, చిత్రపటమో అవసరం. "అజ్ఞాని నాం భావనార్థాయ ప్రతిమాపరికల్పితా" (ధర్మోపని) జ్ఞానం లేనివారి ఏకాగ్రత కోసం విగ్రహారాధన, పూజార్చనలు ఏర్పడినవి. విగ్రమునందు పరమాత్మ స్వరూపాన్ని భావన కల్గి దానిని తనలో అంతర్లీనముగావించు కొనుటయే పూజయొక్క అర్థం.

ప్రధానంగా పూజకు ఆరు మెట్లున్నాయి. 1. ఆయత్తం. పూజ చెయ్యాలి అని నిర్ణయించుకొన్న తరువాత దానికి సిద్ధపడటం. పూజ ఎందు నిమిత్తం చేస్తున్నామోసంకల్పం చేసుకోవాలి. అది అభ్యుదయమునకా లేక ముక్తిని కోరుకొని పూజ చేస్తున్నామా అనినిర్ణయం చేసుకొని, ఆవిధముగా తయారు కావటం ఆయత్తము.

2) శుద్ధి ప్రకరణము :- పూజా స్థలాన్ని మంత్ర జలంతో శుద్ధి

చెయ్యాలి. శరీరాన్ని మనస్సుని "అపవిత్రః పవిత్రోవా స్వరాంగ స్థాంగ తోపివా..."మంత్రో చ్చారణతో తన శరీరముపై మంత్రజలాన్ని జల్లుకొని శరీరముతో బాటు మనస్సును కూడా శుద్ధము గావించుకొనవలెను. తరువాత పూజా విగ్రహములను "పృథి వ్యాపస్తేజో వాయు రాకాశాత్మనే పరమేశ్వరాయ నమః"అనే మంత్రాన్ని ఉచ్ఛరించి విగ్రహాలను సంప్రోక్షించాలి. తదనంతరము పూజా ద్రవ్యములను కూడా కలశ పాత్రోలని మంత్రజలంతో శుద్ధిగావించాలి. భూత శుద్ధితోపాటు తన మనస్సును, ప్రాణాయామం ద్వారా పవిత్రం చేసుకోవాలి. తరువాత తన స్థూల శరీరం ఆత్మ తేజముతో నశించినట్లు భావించి, దివ్యదేహం లభించినట్లు భావించాలి. తరువాత ఇష్టదైవాన్ని హృదయస్థానంలోకి ఆహ్వానించి ఆ దైవాన్ని మానసికంగా పూజించాలి.

4వ మెట్టు :- దైవాన్ని అవాహన చేయడం. పూజకుడు తన శరీరములోని అంగాలన్నింటిని దివ్యశక్తితో నింపాలి. అదిన్యాస క్రియ ద్వారా జరపాలి. సప్తధాతువులతో కూడిన స్థూలశరీరము అపవిత్రంగా ఉంటుంది. మానవశరీరములోని వివిధ భాగాలకు, హృదయము, శిరస్సు కాళ్ళు చేతులందు వివిధ అధిష్టానదేవతలున్నారని శాస్త్రాలు చెప్పుచున్నాయి. శ్వాసప్రక్రియ ద్వారా అంగశుద్ధి అయా దేవతను ప్రార్థించినట్లగును. నీలోనున్న దైవము శ్వాసద్వారా బయటకు వచ్చి చేతిలోని పువ్వులో చేరినట్లు భావించాలి. ఆ పుష్పాన్ని విగ్రహం మీద ఉంచాలి. ప్రత్యేక అవాహకముద్రల ద్వారా ఆ విగ్రహంలో ప్రాణప్రతిష్ట జరిగినట్లు భావించాలి. "అవాహనం పూజయామి"అని చెప్పాలి.

సేవా కార్యక్రమాలు :- నీవు పూజించే దైవము అప్పుడు ఆ విగ్రహంలో సుప్రతిష్టుడై యున్నాడు. కనుక ఆయనకు అన్ని విధాల సేవలు చెయ్యాలి. ఒక అతిథి వచ్చినప్పుడు చేసే సేవల వంటివి జరపాలి. పవళింపు సేవ, పాదసేవ, ఊంజలసేవ వంటి సేవలు నిర్వర్తించాలి.

ముగింపు కార్యక్రమము :- పుష్పాంజలితోపూలను దైవ పాదాలవద్ద ఉంచి పూజకు ముగింపు పలకాలి. ఆ రాత్రికంలో గంట, శంఖం, జైగంటమొదలుగ వాయిద్యాలు చేస్తారు. ఆనాదధ్వనికి మనస్సు ఏకాగ్రమై దైవం మీద లగ్నమౌతుంది. ఆరతిని భగవానునికి సమర్పించిన దానిని అందరూ మనసా వాచా కర్మణా స్వీకరిస్తారు. మనస్సులోనే వారి వారి కోర్కెలను భగవానునికి సమర్పించుకొని వాటిని తీర్చతాడని తృప్తిపడిపోతారు. ఆరతితో పూజ కార్యక్రమం ముగిసినట్లే అవుతుంది.

ఒక సందర్భము పురస్కరించుకొనో, లేక పండగ దినాలలోనో ఇతరత్రా మనస్సులో అనుకొనో గృహంలోనో, దేవాలయంలోనో తన ఇష్టదైవానికి పూజచేయించాలనుకొంటారు అధ్యాత్మ చింతనాపరులు.

నాలుగువిధాలైన పూజలను శాస్త్రము వివరించింది. 1. నిత్యోక్తము. నిత్యము గృహములో షోడశోపచార పూజతో దైవమును పూజించుట, 2. నైమిత్తికోక్తము. పుణ్యదినాలలో, పండుగ రోజుల్లో చేయు పూజలు. 3. కారణోక్తము. ప్రత్యేక ఫలితాన్నాశించి చేయు వ్రతములు మొదలుగునవి. 4. ఆగమోక్తము. దేవాలయాలల్లో ప్రతిష్టాది కర్మలు, యజ్ఞయాగములు.

ఎక్కువగా అందరికి అందుబాటులో ఉండి, చేసేది నిత్యోక్త విధానపూజ. "జ్ఞాత్వాకర్మాణి కుర్వత్"పూజా కర్మలనుపూర్తిగా అవగాహన చేసుకొని ఆచరించవలెను. మధ్యాహ్న సమయంలో, దుఃఖముగా ఉన్నప్పుడు భయాందోళనలు కల్గినప్పుడు, మృత, జాత శౌచములప్పుడు పూజలు చేయరాదు.

ప్రశాంతముగా ఉన్నప్పుడు అనుకూల వాతావరణములో శ్రద్ధ కల్గి వారివారి సౌలభ్యమును బట్టి పూజలు నిర్వహించుకోవలెను. బ్రహ్మ ముహూర్తములో శరీర విధులను నిర్వర్తించి పూజా మందిరాన్ని, సామగ్రిని శుభ్రపరచు కొనవలెను. పుష్పములను సేకరించవలెను.

కలశపాత్ర, తీర్థపాత్ర, పంచపాత్ర, శుభ్రమైన జలంకొరకు మరోపాత్ర, హరివేణము అంటే రాగి పళ్ళెము, గంట, దీపారాధన కుందెలు, వత్తులు, అక్షింతలు, గంధము, పసుపు, కుంకుమ, అగరువత్తులు, హారతి కర్పూరం, మరియు నైవేద్యమునకు వంటకాలు, పటికబెల్లం, పండ్లు, టెంకాయలు మొదలుగనవి పూజామందిరములో సిద్ధంచేసి పెట్టుకొనవలెను.

పరిశుభ్రమైన వస్త్రాన్ని ధరించి, ముఖధారణ చేసుకొనవలెను. కలశపాత్రను పరిశుభ్రమైన జలముతో నిండుగా నింపి ఆ జలాన్ని మంత్రించి దేవతాశక్తిని ఆ జలములో అవాహనజేసి కలశపాత్రను ఉంచవలెను. ఉచితాననమును ఏర్పరుచకొని, ఇష్టదైవాన్ని ప్రార్థించుకుంటూ, తూర్పుముఖముగా కాని,ఉత్తరముఖముగా కాని కూర్చుండ వలెను. దేవునికి ఎదురుగా కూర్చొనకూడదు. "ఓం మహాగణాధిపతయే నమః" అని స్మరించుకొని దీపారాధన చేయవలెను. "సుప్రకాశోమహాదీపః సర్వ తస్తిమి రాపః ..." దీపధ్యానము చేయవలెను.

పంచపాత్రలోని జలంతో ఆచమనం చేసి గోవింద నామాలు చ్చరించ వలెను. అప్పుడు అక్షింతలతో దైవమును పూజించవలెను. తరువాత కలశమంత్ర జలంతో ప్రదేశం శుద్ధిగావించి భూతోచ్చాటన చేసి, శరీరాంతః కరణములను శుద్ధిగావించుకొనవలెను. తరువాత విగ్రశుద్ధిని పూజాద్రవ్యముల శుద్ధిని చేయవలెను.

పూజా విగ్రహాలకు అలంకరణ చేయవలెను. ముందుగా విఘ్నేశ్వరుని పూజించి గురుధ్యానము గావించి, ఆత్మపూజచేసి, దైవాన్నినీలో అవాహనముచేసుకోవాలి. ప్రాణాయామము చేసి ఘంటానాదము చేస్తూ 'ఓం'కారాన్నిఉచ్చరించి, సప్తవ్యాహృతులను గాయిత్ర మంత్రము చేప్పి సంకల్పము చేయాలి. ఘంటానాదముతో "అవాహయామి పూజార్థం" అవాహయామి అని చెప్పుచూ దైవాన్ని పూజామండపములోనికి ఆహ్వానించాలి.

యధావిధిగా షోడశోపచార పూజ చెయ్యాలి. శ్రీ పురుష సూక్తము, లేదా శ్రీ సూక్తపూజ, లేదా శైవ విధానపూజ లేదా పురాణోక్తముగా పూజలు జరుపబడును. పూజను ప్రారంభించి యధావిధిగా పూజను జరుపుకొని స్వస్తివాచమకము చెప్పి "సమస్త సన్మంగళాణి భవంతు" అంటూ పూజను ముగిస్తారు.

తరువాత కుంకుమ బొట్టు పెట్టుకొని అక్షింతలను శిరస్సుపై జల్లుకొని తీర్థాన్ని సేవించి ప్రసాదాన్ని స్వీకరించాలి. తీర్థము క్రిందపడకుండా తీసుకొనవలెను. తీర్థము తీసుకొన్న చేతిని తలకు రానుకోకూడదు. ప్రసాదాన్ని దేవునియెదుట భుజించరాదు. పూజమధ్యలో లేవకూడదు. పూజ ప్రశాంతముగా నిర్మలమనస్సుతో చెయ్యాలి. ధర్మనిష్టతో పూజార్చనము చేయవలెను. అప్పుడే సత్ఫలితం లభిస్తుంది.

ప్రపంచములోని మానవులందరు భగవంతుని ఏదోరూపంలో అర్చిస్తారు. క్రైస్తవులు ఏసుప్రభువును, ముస్లిములు మక్కలో శిలారూపంలో నున్న దైవాన్ని, బౌద్ధులు బుద్ధుని, జైనులు మహావీరును, హిందువుల్లో అనేక వర్గాల వారు వారి వారి ఇష్టదేవతలను పూజిస్తారు. పూజా విధానంలో మార్పులుండొచ్చు కాని పూజ ఉద్దేశ్యము భగవంతుని త్రికరణశుద్ధిగా ఆరాధించడమే.

'నమః తే నమోనమస్తే" నీకు వేనవేల నమస్కారములు, మరల మరల నమస్కారములు. అంతేకాదు "నమః పురస్తాత్ అధపృష్టతః తే" నీకు ముందు వెనక నమస్కారము. నీకు అన్నివైపులకు నమస్కారమని అర్జునుడు విశ్వరూపము సందర్శించినప్పుడు లెక్కకుమించిన నమస్కారములు చేస్తాడు, కారణం? అన్ని దిక్కులు వ్యాపించియున్న ఏవేవోరూపాలు, అద్భుతాలు ఆ విశ్వరూపంలో కనబడుతున్నాయి. అందుకే లాభంలేదనుకొని, అర్జునుడు మహదేవా! నీకు ముందు, వెనుకా, పైన క్రింద, అటుప్రక్క, ఇటుప్రక్క, నీకు ఎన్ని

ప్రక్కలుంటే అన్ని ప్రక్కలకు నమస్కారం, నమస్కారం అంటూ విశ్వరూపానికి సరిపడ్డ నమస్కారములు చేస్తాడు.

మనం పూజచేసేటప్పుడు అనేక విధాలుగా నమస్కారాలు చేస్తుంటాము. పూజ అనంతరము మళ్ళీ నమస్కరిస్తాము. అందుకే అన్నారు పూజపునస్కారమని. పూజగావించి మళ్ళీ మళ్లీ భగవానునికి నమస్కరించ టమంటే ఇదే.

దేవునికి పూజలు చేస్తూ పదే పదే నమస్కరించటమే పూజా పునస్కారం. కొన్నివేల నమస్కారాలు చేసే భాగ్యము అర్జునునికి దక్కింది. మనకెప్పుడొస్తుందో అలాంటి ఛాన్సు. అంతా దైవాధీనం.

# 7. పునాది రాళ్ళకుపూజలు

దేవదానవ మానవులందరూ దర్శనమీయని పరమాత్మను ఏదోవిధంగా దర్శింటానికి ప్రయుయత్నాలు చేస్తారు. వారివారి మనోభావాలను బట్టి దైవాన్ని సాకారంగా, నిరాకారంగా చూడడానికి ప్రయత్నాలు నిరంతరము కొనసాగుతూనే ఉంటాయి.

అనంతమైన కాలగమనంలో మానవుడుకి ఇప్పటికి అర్థంగానిది, అర్థం చేసుకోలోనిది ఏదైన ఉన్నదంటే అది ఆ దైవమే అని గ్యారంటిగా చెప్పవచ్చును. సృష్టి పుట్టిన నాటినుండి మానవ పరిణామములో అభివృద్ధిపథంలో పయనించే మానవుడు ప్రకృతి మీద, పర్యావరణం మీద అద్భుతమైన ప్రయోగాలుచేసి సృష్టి రహస్యాలను బయటకు తీసి వాటిని తనకనుగుణంగా చేసుకొంటున్నాడు.

ఇప్పటికెంతో సాధించినా మంటున్నారు. చంద్రమండలం మీద మానవులు నివాసము చేయొచ్చు, మరి ఇతర గోళాల మీద ఆధిపత్యము సంపాదించి అక్కడి వనరులను కూడా అనుభవించవచ్చు అంటున్నారు. మరెన్నో వింతలు విడ్డూరాలు చేయవచ్చు, కాని భగవానుని తెలుసుకోవటం మానవులకే కాదు దేవతల తరంకూడా కాదు. కారణం భగవానుడు బ్రహ్మం, అనన్యం, అనంతం, అపూర్వం, అద్భుతం, నిరంతరం, నిత్యసత్యము, అవినాసిని, శాశ్వితమైనది.

ప్రకృతిని సృష్టించిన వానిని, ఆ ప్రకృతి నుండి వచ్చిన మానవుడు ఆద్యంతములేని దైవాన్ని దర్శించాలనే తపన, ఉత్సుకత, ధ్యేయం, లక్ష్యం, అధ్యాపనం మొదలగు ప్రయత్నాలు అనన్య సామాన్యమైనవి. ఉత్కృష్టమైన దైవదర్శనాన్నికాంక్షించే మానవుడు తన మనోభావాలను బట్టి దేవుణ్ణి, సాకారంగాను, నిరాకారముగాను, మరి వివిధ పద్ధతుల ద్వారా కానరాని దైవాన్ని దర్శించాలనే బహుబలీయమైన కోరిక గొప్పదే కాదు వర్ణనాతీతము.

వేదకాలంలో పాషాణపూజలు లేవు. యజ్ఞతపః ధ్యానయోగముల ద్వారా దైవాన్ని దర్శించటానికి సాధనచేసేవారు. కాలపయనంలో మనుష్యులలో వచ్చిన మార్పులతో యజ్ఞరూపాన్ని విగ్రహారాధనగా తయారు చేసారు.

త్రేతాయుగం నుండి భగవానుని సాకార రూపాన్ని వివిధ రూపాల్లో కొలవటం జరుగుచున్నట్టు శాస్త్రాలు చెప్పుచున్నాయి. దేవుడు ఏ రూపంలో ఎట్లాఉంటాడో తెలియదు. కాబట్టి వారి వారి బుద్ధికి నచ్చిన రీతుల్లో వేరు వేరు రూపాలను శిలలమీద, దారుకలమీద, మృత్తిక మీద ఆయా రూపాలను కళాత్మకంగా తయారుచేసుకొని పూజిస్తున్నారు.

ఆ విధంగా రూపుదిద్దుకొన్న విగ్రహాలకు ఒకస్థానం కల్పించాలని ఆలయాలను నిర్మించారు. సమాన్యముగా ఏర్పడ్డ ఈ నెలవులు కాలగమనంలో వివిధ ఆకృతులలో పలుభంగిమలతో నిర్మాణం గావించబడ్డాయి. అందుకు తగిన శాస్త్రాలు కూడా ఆధారమయ్యాయి.

రోజు రోజుకి మానవమేధస్సులో మార్పులుచేటు చేసు కొంటున్నాయి. ఈ మార్పులు అనివార్యం. దానికి కారణం ప్రకృతి స్వభావం. అందుకే కొందరు విగ్రహారాధన అవసరం లేదని వాదిస్తున్నారు. ప్రాణం లేని రాతికి పూజలు అలంకారాలు చేసి, అదే దైవమని మొక్కటం అవివేకమని వారి సదాభిప్రాయము. స్వతంత్ర ప్రపంచావనిలో ప్రతి మనిషి తన స్వేచ్ఛను వ్యక్తపరచుటయే కాదు, ఆ విధముగా నడుచుకొనే హక్కుకూడా ఉన్నది. అలా ఎవరో కొందరన్నారని విగ్రహారాధనను కొట్టిపారవేయలేము. రాళ్ళనేకాదు, జంతువులను, సర్పాలను, పక్షులను, మనుష్యులను పూజించటము మామూలైపోయింది. ఈ విధముగా మొక్కటానికి కారణం తెలుసుకోవటానికి శాస్త్రాలు ఏమి చెబుతున్నాయో చూద్దాము.

"అజ్ఞానినాం భావనార్థాయ ప్రతిమా పరకల్పితా" (ధర్మో.ఉ.) సామాన్యులు దేవునియందు భావనచేయుటానికి విగ్రహాలను కల్పించారు. విగ్రహపూజలు వల్ల మానవుల్లో భక్తి పెంపొందును. భక్తి కలగకపోతే దేవుణ్ణి తెలుసుకోవటం కష్టము. 'భక్తావినా బ్రహ్మజ్ఞానం న కదా చిదపి జాయతే" (మహనారా.ఉ.) భక్తిలేకుండా బ్రహ్మజ్ఞానాన్ని ఏ విధముగాను పొందలేరు.

భక్తి అంటే భగవంతుణ్ణి ప్రేమించటం. ప్రేమ మానసికమైనది. మనస్సు పరిమితి కలిగినది. పరిమితమైన వాటినే గ్రహించగలదు. మనస్సు సహజ ధర్మాననుసరించి సాకారమైనవాటిపై లక్ష్యం పెట్టను. పరుగులు తీసే మనస్సు నిలవటానికి ఒక ప్రతిమో, చిత్రమో ఆవశ్యకము. ఏకాగ్రమైన మనస్సు నిశ్చలమైన ఈశ్వరదర్శనానికి దారిచూపును. ఆ విధముగా ప్రతిమ పూజలు వ్యాప్తికి వచ్చాయి.

నిరాకారుడైన పరమాత్మకు ఆకారాన్ని కల్పిస్తూ, ఆ రూపంలో భగవానుని దర్శించవచ్చునని శిలలను శిల్పాలుగా చేసి, గుడిలో పెట్టిపూజలు చేయటం ప్రారంభమైనది. కేవలం విగ్రహాలలోనే దైవాన్ని చూడటం కాదు ప్రత్యేక దైవాంశము గల జంతువులలోను, సర్పాలలోను, పక్షులను, చెట్లను మనుషుయులలోను దైవాన్ని వెదకవచ్చునని వీటికి కూడా పూజ వునస్కారాలు చేయటం జరుగుచున్నది.

ఈ విధముగా అవ్యక్తపరమాత్మను వివిధ రూపాలలో ప్రత్యేకించి విగ్రహారాధన ద్వారా ఉపాసించటం జరుగుచున్నది. అన్ని మతాలవారు ఏదో రూపంలో విగ్రహారాధన చేస్తున్నారు. హిందువులకు ఎందరో దేవుళ్ళు, వాళ్ళందర్ని విగ్రహాలలోనే చూస్తున్నారు. బౌద్ధవులు బుద్ధుని, జైనులు, క్రైస్తవులు, మహావీరును ఏసుప్రభువును, ముస్లీములు

మక్కలోని శిల్పాన్ని, చంద్రరూపాన్ని, ఇలా ఈ దేవతలందర్ని రాళ్లలోనే మలిచారు. వాటికే పూజలు, ప్రార్థనలు జరుగుచున్నాయి.

నిర్గుణ బ్రహ్మను ఉపాసించుటము దేహదారులకు బహుకష్టము. కనుక సగుణము, సాకారమైన దైవాన్ని కొలిచి ఆయన్లో మనస్సును విలీనంచేయటం శ్రేయస్కరమని గీతాశాస్త్రము వక్కాణించింది.

"క్లేశోధికతరస్తేషాం అవ్యక్తాసక్త చేతసామ్।
అవ్యక్తాహి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥"

అవ్యక్తపరమాత్మయందు మనస్సు లగ్నముచేయు వారికి ఎక్కువ ప్రయాస, దేహదారులకు నిర్గుణోపాసన మిగుల కష్టసాధ్యము.

దైవాన్నిరెండువిధాలుగా ఉపాసించటం జరుగుతుంది. నిర్గుణము నిరాకారమై బ్రహ్మోపాసన, సగుణము సాకారమైన దైవోపాసన. అయితే నిర్గుణోపాసన ఎన్నో బాధలతో కూడుకొన్నది. సమాన్యులే కాదు అసమాన్యులైన బాబాలకు, స్వామీజీలకు కూడా నిర్గుణోపాసన దుఃఖ ప్రదమైనది, సులభమైనది సగుణ సాకారోపాసన అందరు అనుసరించ దగ్గది. అందుకు విగ్రహారాధన ఒక్కటే మార్గం అంటున్నారు.

విగ్రహప్రతిష్ట, ఆరాధన ఎన్నో నియమ నిబంధనలతో శాస్త్రోక్తముగా జరుపబడుతుంది. సామాన్యుల దైవదర్శనానికి అర్చావతార విగ్రహములే శరణ్యము.

వివిధ భంగిమల్లో కళాత్మకముగా తీర్చిదిద్దిన విగ్రహాలలో, విగ్రహప్రతిష్ట సమయంలో భగవశ్శక్తిని నింపటానికి, మంత్ర యంత్ర, తంత్రసాధనలు చేస్తారు. పరబ్రహ్మము నాదబ్రహ్మముగా లోకమంతా వ్యాపించియున్నాడు. ఆనాదశబ్దమే మంత్రమగును. ఆ మంత్రాన్ని

యంత్రములో చిత్రీకరించి, పూజాది తంత్రములతో విగ్రహ ప్రతిష్ట ఆయా ఆలయాలందు జరుపబడును.

దేవతా విగ్రహాలను కళాత్మకముగా, మనోరంజకముగా, ప్రశాంతముగా, మనోహరంగా తీర్చిదిద్దిన, ఆ రూపాన్ని చూడగానే హృదయానికి హత్తుకుపోయే విధముగా ఉంటాయి. ఆ రూపాన్ని ఎన్నటికి మర్చిపోలేని విధముగా తీర్చిదిద్దాలి. ఏడుకొండలు వాని రూపాన్ని, భద్రాచలం ఆంజనేయ, సీతారామకళ్యాణ రూపాలను, శ్రీశైలం జ్యోతిర్లింగాన్ని, అన్నవరం శ్రీవీరవెంకట సత్యనారాయణ దేవుని, బృందావన గోపాలకృష్ణుని ఒక్కసారి దర్శించిన ఎన్నటికి మరువలేని ముద్ర మనస్సులో నాటుకుంటుంది.

విగ్రమనగా విశేషముగా గ్రహించునది, ఆకర్షించునది, వ్యాపించునది, రూపమని అర్థము. పరమాత్మశక్తిని, స్వరూపాన్ని తనలో ఇముడ్చుకొన్నవే దైవ విగ్రహాలు, మంత్రశక్తిచే భగవతత్త్వాన్ని ఆకర్షించుకొని, దైవగుణాలతో రూపురేఖలతో అవి ప్రకాశిస్తుంటాయి.

భగవద్గీత భక్తికి ఎక్కు పట్టము కట్టింది. భక్తి కలగటానికి రూప నామవసరమున్నది. అదే విధముగా రామారూపము చూపించిన ఆంజనేయుడు శ్రీరామ రూపాన్ని తన శరీరములో అణువణువునా నింపుకొన్నాడు. ఆ నామాన్ని నాలుకపై చెక్కుకున్నాడు. అందుచేతనే ఆయన హృదయంలో శ్రీరాముని చూడగలిగాడు.

వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాలు మొదలగు గ్రంథాలన్ని పరమాత్మను రూపనామముతో వర్ణించాయి. తత్త్వశాస్త్రమైన భగవద్గీత భక్తిగూర్చి మరింత చెప్పింది. "ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్" (భగ.గీ.) పరమాత్మ ఒక్కడే అయినా, ఆయన్ని వేరువేరు నామరూపాలున్న దేవుళ్ళుగా పూజిస్తారు. "అనన్యా చింతయంతోమాం ...యోగ క్షేమమ్ వహామ్యహమ్" ఎవరు నన్ను

అంటే శ్రీకృష్ణుని అనన్యమనస్సుతో స్మరిస్తారో, ఉపాసిస్తారో, వారి యోగక్షేమములను "నేనే" వహిస్తానన్నారు. ఇది కేవలం భక్తిసాధనను తెలియజేస్తుంది. "యేऽప్యన్యదేవతా" ఇతర దేవతలను ఆరాధించువారు. "పత్రం పుష్పం, ఫలం, తోయం..."వీటిని మనస్సుతో కర్పించిన దైవము స్వీకరిస్తాడట. ఈ విధముగా విగ్రహారాధనకు 9వ అధాయ్యము భగవద్గీత అత్యంత ప్రాధాన్యత నిచ్చింది.

అట్లే 10వ అధ్యాయము విభూతి యోగంలో నూరు విభూతులను గూర్చి వివరించబడ్డాయి. విభూతి అనగా భగవానుని మహిమగలది. అది ఏదో ఒక రూపంలో పిలువబడుతుంది. "సేనానీనామహం స్కందస్స'....సేనాధిపతులలో కుమారస్వామి పరమాత్మరూపం. "మహర్షీణాం భృగురహం. మహర్షులలో భృగుమహర్షి, 'స్థావరాణాం హిమాలయః' స్థావరాలలో హిమాలయపర్వతము. 'అశ్వత్థ సర్వవృక్షాణాం" అన్ని వృక్షములలో రావిచెట్టు, 'ఉచ్చైశ్రవసమశ్వానాం" ఉచ్చైశ్రవమగు గుఱ్ఱము, 'ఐరావతం గజేంద్రాణాం' నరాణాంచ న రాధిపమ్" ఏనుగులలో ఐరావతము, నరులలో రాజు, "వైనతేయశ్చపక్షిణామ" పక్షులలో గరుత్మంతుడు, 'స్రోతసామస్మిజాహ్నవీ" నదులలో గంగానది, గిరామస్మ్యేకామక్షరం, శబ్దములలో ఓంకారము మొదలగు మహిమాతి శయము గలవి పరమాత్ముని రూపములు.

అదే విధముగా 11వ అధ్యాయము విశ్వరూప సందర్శన యోగములో సమస్త విశ్వాన్ని వివిధ రూపాల్లో ప్రదర్శించటము చెప్పబడినది. ఈ విధముగా పరమాత్మను వివిధ నామరూపాలలో ఉపాసించవచ్చునని గీత ఉవాచ. అట్లే నిర్గుణ నిరాకార పరబ్రహ్మను ధ్యానయోగముల ద్వారా పొందవచ్చునని, 6,7,8వ అధ్యాయములలో చెప్పబడినది.

ఈ విధముగా ఏ శాస్త్రము చూచిన, దైవాన్ని నామరూపాలతో కొలమని చెప్పటం చే, విగ్రహారాధనలే కాదు ప్రాణమున్నవాటిని మరి ప్రాణంలేని నదులను, పర్వతాలను కూడా ఆరాధించవచ్చునని చెప్పబడినది.

చలనమే స్వభావముగా గల మనస్సును నిలువరించుటకు రూపారాధన మొదలైనది. మనిషి ప్రవర్తనకు మనస్సే ముఖ్యము. మనస్సుతో చేసే ఆలోచనల ద్వారా మనిషి నడుంచుకొని మంచివాడుగానో, దుర్మార్గుడుగానో లేక భక్తుడుగానో తయారగును.

మనస్సు నిలపటానికే ఆకారాధన వచ్చింది, భారతదేశం ఎంతో విశాలమైనది అని చెప్పినప్పుడు గ్రహించినదానికి దానినే పటములో చూచి గ్రహించినదానికి ఎంతో బేధముంటుంది. ఒక సినిమా కథచెప్పి విన్నదానికంటే అదే కథను దృశ్యరూపంలో చూపితే గుర్తుండిపోతుంది.

మనస్సు అద్దంలాంటిది. దానిలో ఏ బొమ్మపడితే అది ఉండిపోతుంది. పదేపదే ఒక రూపాన్ని చూడటం వలన దాని జ్ఞాపకాలు ఉండిపోతాయి. దానితోబాటు నామాన్నికూడా ఉచ్చరించితే ఆ చిత్ర ప్రభావము ఆ మనిషిమీద పడుతుంది. ఆ విధంగా మనిషిలో భక్తి ఏర్పడుతుంది. అందుకే వెలసింది ఆకారార్చన.

గృహనిర్మాణములో, గుడి స్థాపనలో, ప్రాజెక్టులు, బ్రిడ్జిలు మొదలగు నిర్మాణములందు పునాదులుతీసిఅక్కడ పూజచేసిన రాతిని ఉంచుతారు. శిలాఫలకాల ప్రతిష్ట పూజలు,పునాది పూజలు సర్వసామాన్యము. ఎందుకు ఈ పూజలు చేస్తారు? ఆ నిర్మాణము శుభప్రదముగా ఉండాలని ఏ విధమైన ఆటంకాలు కలుగకుండాలనే ఉద్దేశ్యముతో ఆ విధముగా భగవానుడు అనుగ్రహించాలని చేస్తారు.

విగ్రహారాధనగాని, ఆకార్చానగాని చేయటంద్వారా మనిషి

ప్రకృతిని పూజించినట్లుగుతుంది. మట్టినుండి వచ్చిన రాతిపూజ భూమిని పూజించినట్లు. మంత్రించిన జలముతో, పుష్పాలాదులతో ధూపదీప నైవేద్యములతో చేసే పూజ పంచభూతాలను పూజించినట్లే. పంచభూతాల సహకారముతో మానవులే కాదు సమస్త భూతజాలం మన గలుగుచున్నది. అందుచేత పునాదిరాళ్ళకు పూజలు, ప్రార్థనలు సమర్థనీయమే కాదు, అవసరం కూడాను.

# 8. ఉపవాసాలు-పస్తులు

41 రోజులు స్వామి అయ్యప్ప దీక్ష బూనిన భక్తులు, వివిధ వ్రతములు ఆచరించేవారు, పండుగలు జరుపుకొనేవారు, భగవదర్శనము కొరకు వెళ్ళేటప్పుడు, కొన్ని శుభ, అశుభ కార్యాలు జరుపుకొనేటప్పుడు ఉపవాసం చేస్తారు. లావుగా ఉన్నవాళ్ళు సన్నబడటంకోసం చేసే కసరత్తు ఉపవాసం కాదు. ఉపవాసం చేయటమన్నది అధ్యాత్మికతకు సంబంధించినది.

ఉపవాస నిర్ణయం చేసుకొని ఘనాహారము మాని, ద్రవాహారాన్ని ఆరగిస్తూ చేసేది ఉపవాసము. ఒక సత్ కార్యాన్ని ఉద్దేశించి కొంత సమయం తిండి మానేయటం కూడా ఉపవాసమే. ఉపవాసమును దీక్షగా చేస్తారు కొందరు. దానిని ఆధ్యాత్మిక పరమైనదిగా భావిస్తారు.

ఉపవాసము శారీరక మానసిక మాలిన్యాన్ని తొలగించి, చిత్తశుద్ధి కలిగించునని ఉపాసకుని నమ్మకం. ఉపవాసం చేసేవారు ఆ రోజు సంసారిక ఇతరత్రా కార్యక్రమాలను క్రియాత్మకంగా, మానసికంగా ఆవలకు నెట్టి భగవత్ చింతనతో గడపవలెను. సాధ్యమైనంత వరకు మౌనం పాటించటం మంచిది. విధిలేని పరిస్థితుల్లో మితభాషిత్వమును పాటించవచ్చును. పిచ్చిపిచ్చి ఆలోచనలు మానుకొని ప్రశాంతముగా ఉండటానికి ప్రయత్నించాలి.

ఆవిధముగా ఉపవాస దీక్షను పాటించినప్పుడు దేవుడు నీ అవసరాలను అడగకుండానే తీర్చేస్తాడట. ఉపవాస దీక్ష చాలా శక్తివంతమైనది. నిష్కామముగా ఈ దీక్షను నెరవేర్చితే ఆ తరువాత నీ కామములన్నింటిని ఉపవాస దీక్ష దేవుడు తీర్చేస్తాడు అని శాస్త్రాలు చెప్పుచున్నాయి.

ఉపవాసం చేసే రోజు పచ్చి మంచినీళ్ళు మరి నోటిలో

ఉమ్మికూడా లోపలికి పోకూడదా అంటే? అంత కఠినమైనది కాదు ఉపవాస దీక్ష. కొన్ని పండ్లు, ఒక గ్లాసుడు పాలు, మధ్య మధ్య కాఫీ, టీ వగైరాలు లాగించొచ్చునట. ఈ విధము నిబంధనలకు సడలింపు వున్నది.

ఉపవాస ఫలితం స్వానుభవం మీద తెలుస్తుంది. అందుచేత కొందరుబామ్మలు, ఛాందస్తులనిపించుకొనే పెద్దవాళ్ళు వారానికో, నెలకో ఉపవాసం చేయటం కాదు, వారంలో ఏడు రోజులు, రోజుకో దేవుడి పేరు చెప్పి పగలంతా పస్తుండి పోతారు. ఆదివారం సూర్య భగవానునికి, సోమవారం శివునికి, మంగళ వారం శ్రీగౌరికి, ఆంజనేయ స్వామికి, బుధవారం శ్రీరామ, అయ్యప్ప స్వామి వారికి, గురువారం శ్రీ షిర్డిసాయి, శ్రీ రాఘవేంద్రస్వామివారికి, శుక్రవారం శ్రీ లక్ష్మి, శ్రీలలితా, శ్రీ లక్ష్మినరసింహ, శ్రీకృష్ణుల వారికి, శనివారం శ్రీ వేంకటేశ్వర స్వామి వారి కోసం ఉపవాసం.

కొందరు ఉపాసకులు ప్రొద్దున లేచింది మొదలు ఇంటి పనులు, వంటపనులు, పక్కవాళ్ళ పనులు చేస్తూనే ఉంటారు. ఏదో ఒకటి మాట్లాడుతూనే ఉంటారు. మధ్య మధ్యలో "స్వామి నీరసం వచ్చిందంటూ" కొంచెముగా నోట్లో వేసుకుంటారు. పోని మనస్సుకైనా పని చెప్పకుండా ఉంటారా అంటే అదేమి ఉండదు. ఈ ఉపవాస ఫలితం అచ్చి గాడికి అమెరికా ఉద్యోగం, అమ్మాయికి మెడికల్ సీటు, మా వారికి ప్రమోషన్ ఇలా పెండింగులో ఉన్న కోర్కెలన్నింటిని తీర్చుకోవటానికి ప్రయత్నిస్తారు.

శాస్త్రాలు మానవుల బాగోగులు కోరి కొన్ని నియమాలను, ఆచార వ్యవహారాలను సూచించాయి. వాటి అమలు విధానం, దాని ఫలితాన్ని చెప్పాయి. ఉపవాసం చేయటం వలన ఆ వ్యక్తికి ఇంద్రియ శుద్ధి,

మనో నిగ్రహం, సత్ప్రవర్తన, చిత్తశుద్ధి, వాక్శుద్ధి కలుగుతాయి. తద్వారా ఆత్మానందం అనుభవించ గల్గుతారు.

అన్నానికి ఉపవాసానికి సంబంధ మున్నది. "అన్నాద్భవంతి భూతాని" అన్నం వల్లనే అన్ని జీవరాసులు పుట్టాయి. అన్నం ఎలా లభిస్తుందంటే, వర్షాలు రావటం చేత. వానలు పడక పోతే కరవు కాటకాలు ఏర్పడి ఎన్నో జీవులు హరి అంటాయి.

అన్నం బ్రహ్మ యొక్క పూర్వ స్వరూపము. అధ్యాత్మికపరంగా అన్నం నాలుగు విధాలు 1. భుజించే అన్నం, 2. శరీర ప్రాణాలు, 3. అపోజ్యోతులు, 4. పృధ్విదాకాశములు. ఈశ్వరుడు జఠరాగ్ని రూపంలో శరీరాలలో ఉన్నాడు. ప్రాణులు భుజించిన ఆహారాన్ని ప్రాణాపాన వాయువుతో భక్ష్య, భోజ్య, లేహ్య చోష్య అనే పదార్ధాలను జీర్ణం గావించు చున్నాడు.

పురైకో బుద్ధి, జిహ్వాకోరుచి అని ఆహార పదార్ధాలను కొన్ని వందల సంఖ్యలో తయారు చేస్తున్నారు. అవెన్ని రకాలైన ఈ నాలుగు నుండి వచ్చినవే. అయితే ఆహారం సాత్త్వికం, రాజసం, తామసం అని మూడువిధాలు. సాత్త్వికాహారం మనిషికి మానసిక శాంతిని, ఆరోగ్యాన్ని, పుష్టిని కలిగిస్తుంది.

అన్నం తినందే జీవులు బ్రతక లేవు. కనుక అన్నదానాన్నిబాగా గుర్తించి అది గొప్ప దానమన్నారు. నేడు అన్నదానాలు విరివిగా జరుగుతున్నాయి. దేనికంటే ముఖ్యముగా అన్నం లేక కొడిగట్టిన ప్రాణికి పుట్టెడన్నం పెట్టితే ప్రాణభిక్ష పెట్టినట్టే అవుతుంది. అన్నదానం చేసిన వారిలో రంతిదేవుడంత త్యాగమూర్తి మరి కనబడరేమో? అన్నం పరబ్రహ్మ స్వరూపమని వేదం చెబుతున్నది. ప్రాణులను పుట్టించింది ఆ బ్రహ్మయే కనుక "అన్నాద్భవంతి."

ఉపవాసం అంటే అన్నం తినటం మానుకోవటం. ఉపవాసం చేయటం కొన్ని గంటలు, రోజులు ఉంటుంది. రోజులకొద్ది ఆహారం తీసుకోవటం మానేసిన ఋషులు, యోగులు, మహాభక్తులు, గౌతమబద్ధుడు మొదలగువారు అన్న మహిమ ఏమిటో తెలుకొని ఎంగిలిపడతారు.

నిత్యజీవితంలో అన్నం దొరకని వారిని అనేకమందిని చూస్తున్నాం. కనీసం రోజుకు ఒక్కసారియైన వారికితిండి దొరుకుతుందా? రెక్కాడితేగాని డొక్కాడని అన్నార్తులెందరో ఉన్నారు. రెక్కలు ఆడించలేని పరిస్థితులు ఏర్పడినప్పుడు డొక్కలు మాడి మట్టిలో కలిసి పోతున్నారు.

ఆహారం కావాలని ప్రాణం చేసే సూచనవ ఆకలి. ఘనాహారం తీసుకోకుండా కేవలం నీళ్ళు త్రాగి జీవి 14 రోజులు జీవించగలదు. ఆ పైనైతే అంతే సంగతులు. ఏవో కొన్ని విదేశాలు తప్ప అధికశాతం విదేశాలలో సైతం ఆకలి చావుల్ని చూస్తున్నాము, తెలుసుకొంటున్నాము.

కటిక దరిద్రములో పుట్టినవారు అనేక కారణాలవల్ల సర్వాన్ని పోగొట్టుకొని చివరకు రోజుకు ఒక్కపూట కూడా తిండి దొరకక పస్తులుండేవారు మన దేశంలో కోకోల్లలుగా ఉన్నారు. రువాండ దేశములోనైతే నూటికి 80% ఆకలి చావులే అని వార్తలు వచ్చాయి.

దరిద్రులు, బడుగు జీవులు ఎన్నో రోజులు అన్నం దొరకక పస్తులుండి శరీరం కృశించుకుపోగా ఎముకల గూడు మిగలగా అందుండి చివరకు ప్రాణి లేచిపోతుంది. కొన్ని ప్రదేశాలలోనైతే పరిశుభ్రమైన త్రాగే నీరు కూడా దొరకడం లేదు. కలుషితమైన నీటిని త్రాగి జీవనం సాగించాల్సి వస్తుంది. బ్రతకటానికి అత్యవసరమైన నీరు, ఆహారం దొరక్క రోజులుగా పస్తులుండి ప్రాణాలు తీసుకొనే వారు ఎందరో ఉన్నారు.

దరిద్ర నారాయణులు అవినీతికి, అక్రమాలకు ఆమడదూరంలో ఉంటారు. ఒకప్రక్క ఆకలి బాధ ప్రాణాలను తేడేస్తున్నా మెలికలు తిరిగిపోతూ పడిపోయి ఉంటారుగాని అన్నం కోసం దొగతనం చేసిగాని తప్పుడు పనులుచేసి ప్రాణాలు దక్కించుకోవటానికి ప్రయత్నించరు. అట్టివారు దరిద్ర నారాయణులు కాదా!

జీవితం ఒకనాణెమైతే, ఒక ప్రక్క దరిద్రనారాయణులు పస్తులుండి ప్రాణాలను పోగొట్టుకొనుచున్నారు. జీవితపు నాణెము మరోవైపు అష్టైశ్వర్యాలతో తులతూగేవారు, తరతరాలు తిన్నా తరగని డబ్బుగల వాళ్ళు, రోజుకు మూడు పూటలే కాదు ఆరుపూటలు షడ్రుచులతో భోంచేసే మనుష్యులు ప్రపంచంలో ఎందరో ఉన్నారు.

జరుగుబాటు ఉన్నవారు కూడా దేవుడిమీద భక్తితో ఉపవాసం చేయటంజరుగుతుంటుంది. రోజుకోపూట తిండి దొరికే వారికి, గంజిత్రాగి, నీళ్ళుత్రాగి జీవించే అన్నార్తులకు ఎప్పుడూ ఉపవాసం గానే ఉంటుంది. వాళ్ళకు భగవానుడు ఆటోమాటిక్ గానే స్వర్గాన్ని ఇస్తాడేమో!?

ఆహారమే జీవనం అనే సూత్రాన్ని బట్టి జరుగుబాటు ఉన్నవాళ్ళు బలవర్ధకమైన ఆహారాన్ని భుజించి ఒళ్ళు పెరిగిపోగా జబ్బుల భయంతో పస్తులుంటూ ఉంటారు. అదివారు దానిని ఉపవాసంగా భావిస్తారు. మితిమీరి ప్రవర్తించిన వారిని, వీళ్ళకు తిండిపెట్టకుండా రెండురోజులు పస్తుపెట్టండి దారికి వస్తారంటారు. భక్తి పరంగా ఉపవాసం, శారీక పరంగా పస్తుల మనుష్యులకు లాభదాయకమే కదా!

ఉందికదా అని ఎక్కువగా మూడు పూటలు లాగించి అరగచటానికి మందు బిళ్ళవేసుకోవటం మహాభోగి భోజనమే అయినా అది రోగ భోజనమే. అన్ని సమపాళ్ళతో మంచి రుచికరంగా తయారు

చేసిన ఆహారం రోజుకురెండుసార్లు సరిపడంత భోంచేయటం భోగి భోజనం. సమతుల ఆహారాన్ని రోజుకొక్కసారి భోంచేయటం యోగి భోజనం అవుతుంది.

ఆరోగ్య సూత్రం ఏమిటంటే? "ఏక భుక్తంయోగం, ద్విభుక్తం భోగం, త్రిభుక్తం రోగం" రోజుకు ఉప్పొద్దులా, ద్విపొద్దులా అన్నం తినేవారు పస్తులు, ఉపవాసాలుచెయ్యాలి కదా మరి! ఎందుకు? ఒకటి ఆరోగ్యం కోసం రెండుధ్యాత్మికత కోసం. ఏక భుక్తంచేసేవారు రోజు ఉపవాసం చేసేవారే అవుతారు. రోజుకు ఒక్కపూట కూడా అన్నానికి నోచుకోని వాళ్ళకు ఉపవాసాలే కాదు పస్తులు తప్పవు.

ఈ సృష్టి చాలా విచిత్రమైనది. మనుష్యులే కాదు, పశుపక్ష్యాదులు చెట్లు చేమలు, జీవమున్న ప్రతిది ఆహారాన్ని తినక తప్పదు. కారణం అన్నమే ప్రాణం. అందుకే మానవులతో బాటు అన్ని జీవులు ఆహార సంపాదన కొరకు ఎక్కువ సమయాన్ని వెచ్చిస్తాయి. చీమలు, మనుష్యులు, ఆహారాన్ని ఎక్కువ సంపాదించి నిల్వచేసుకొని తింటూ ఉంటారు. అదే పశుపక్ష్యాదులు మరే ఇతర జీవులు ఎప్పటికప్పుడు ఆహారం సంపాదించుకొంటూ జీవిస్తాయి. కాని ఆటైమొచ్చినప్పుడు అన్నం తిన్నాప్రాణులు చచ్చిపోతాయి. అన్నం సంపాదించుకొని దాచుకొన్న జీవులు కూడా మృతినొందుతాయి. జీవించినంత కాలం అన్నం తినటంతప్ప, జీవులకు మరే గత్యంతరము లేదు. ఉపవాసం - పస్తులుఇందులో భాగాలే.

అన్నం తిని తినకా నానా బాధలు పెట్టి జీవుల్ని చంపే కంటే అన్నం లేకుండా జీవించే లాగు, దేముడేదైనా చేస్తే మంచిదేమో కదా! అసలు దేవుడికి ఈ ఐడియా ఎందుకు వచ్చిందో ఏమిటో మరి? అన్నంతో ముడిపెట్టి ప్రాణులను జీవించమన్నాడు. నా కొచ్చిన ఐడియా

ఏమిటంటే? అన్న పానాలు లేకుండా 84 లక్షల జీవరాసులు ఇన్నేళ్ళు బ్రతికిపోండి అని, సర్వలోకాలలో నున్న జీవుల కోసం ఒక శాసనం దేముడు చేస్తే బాగుంటుందను కొంటున్నానను. మరి నా ఐడియా మీకు నచ్చుతుందో లేదో తిండి తిప్పల మీద. మనకు రాజ్యాంగ ఇచ్చిన వాక్ స్వాతంత్ర్యమున్నది కదా! అందుచేత మీరుకూడా కొన్ని ఐడియాలు విసిరేస్తే సరి. పుర్రెకో బుద్ధి ఉంటుంది కదా! అందుకని ఇది మరి.

# 9. ఉత్సవాలు - ఊరే గింపులు

"ఉత్సూతే హర్షం ఇతి ఉత్సవః" ఆనందము అధికముగా కలిగించునది ఉత్సవం. ఉత్-సవం-ఉత్సవం. అంటే అధిష్ఠాన దేవతా సంతృప్తి కొరకు ఇహపర ప్రయోజనాన్ని ఆశించి శాస్త్ర విధిని దేవాలయాలలో జరిగే కార్యక్రమము.

భారతావనిలో అతిప్రాచీన కాలము నుండి అనేక దేవాలయములు నిర్మించబడినవి. ప్రపంచములో గల వివిధ దేశాల ప్రజల మనోభీష్టాల ననుసరించి మందిరాలు, మసీదులు, చర్చిలు, గురుద్వారాలు మొగలగునవి నిర్మాణం గావించబడినవి. ప్రతివారు దేవుని సేవించుట కొరకై పట్టణాలలో, గ్రామాలలో, అరణ్యాలలో, కొండలలో దైవ నివాస స్థావరములు ఏర్పడినవి. ఇట్టిస్థలాలు పుణ్యక్షేత్రాలుగా, దివ్య ప్రదేశములుగా పేర్కొనబడినవి.

దైవ మందిరాలు కృత, త్రేతా, ద్వాపర కలియుగాలలో నిర్మాణం గావించబడి యున్నాయి. దేవాయాల స్థాపనకు కారణం? అర్చవతార మూర్తుల సమారాధన కొరకు, "దివ్యో దేవ ఏకో నారాయణః" భక్తజన సంరక్షణార్థమై అర్చా రూపధారియైన భగవానుడు భక్త నిర్దిష్టములగు బింబములందు ప్రతిబింబముయుండు స్థలములే దేవాలయములు.

పరమేశ్వరుడు రూపనామ గుణ రహితుడు. సర్వవ్యాపి సర్వాత్మ. అవ్యక్త పరమాత్మ నుండి దృశ్యనామ రూప జగత్తు ఏర్పడినది. దాని కారణంగా భగవానుని సాకార రూపంలో ధ్యానించటం జరుగుచున్నది. "మాం ధ్యాంత ఉపాసతే" ఎవరు నన్నే ధ్యానించుచు ఉపాసింతురో అంటారు గీతకర్త. భగవానుని నిర్గుణ నిరాకారునిగానే కాదు సగుణసాకార రూపునిగా చింతించుదురనిశాస్త్రాలే చెబుతున్నాయి. అందువలన భగవానుని అర్చా స్వరూపాన్ని దేవాలయాల ద్వారా సేవించటం జరుగుచున్నది.

"వరత్వం చ తతోవ్యూహం విభవం చాంతరాత్మకం అర్చావతారం" సమాజంలో ప్రతియొక్కరు ఏదో విధంగా భగవానుని సేవించుటకు ఆయన స్వరూపము ఐదు విధములుగా రూపుదాల్చినది. అందు ముఖ్యముగా అర్చాస్వరూప ఉపాసన కొరకు దేవాలయాలు నిర్మాణం గావించబడినవి.

చాలా మందిరాలలో వర్ణభేదము విస్మరించి విధి, నియమ రహితముగా అన్ని దేశాలందు భగవానుని అర్చించుకొనుటకు వీలు కలిగి యున్నది. దేవాలయాల నిర్మాణం, విగ్ర ప్రతిష్ట శాస్త్రానుసారము చేయబడును.

గర్భాలయంలో ప్రతిష్టించిన శిలా విగ్రహమును ధ్రువమూర్తి లేక మూల విరాట్టు అందురు. గర్భాలయానికి సమీపమున అంతరాలయ ముండును. ఇందుకౌతుక మూర్తులను ప్రతిష్టించి పూజోపచారములు చేయుచుందురు. తరువాత "ఉత్సవబేర" అంటే ఉత్సవ విగ్రహముల నుంచెదరు. సాధారణంగా ఉత్సవ విగ్రహాలు పంచలోహాలతో తయారు చేయబడును. ఈ విగ్రహాలను నయనానందకరముగా అలంకరించెదరు.

శాస్త్రానుసారం ఆలయాల్లో ఉత్సవాలు జరుపబడును. ఆలయోత్సవము, కళ్యాణోత్సవము, గ్రామోత్సవము, బ్రహ్మోత్సవము మొదలగు ఉత్సవాలను నిర్వహించెదరు. దేవాలయాలలో ఉత్సవాలు రెండు కారణములచే జరుపబడును. 1. భగవానుడు ఈ రూపంలో ఎందుకు అవతరించెనో దాని స్మరణకొరకు, 2. ఈ ఉత్సవ సమయంలో భగవానుని దర్శించి మనోశాంతితో బాటు వాంఛితార్థములు నెరవేర్చకొనుటకు. సాకార రూప పరమాత్మను దర్శించుకొను లక్ష్యముతో ఊరేగింపులు, ఉత్సవాలు జరుగుచుండును. చిన్నాపెద్దా భేదం లేకుండా ప్రతి దేవాలయములో ఎప్పుడో ఒకప్పుడు ఉత్సవాలు, ఊరేగింపులు, తిరునాళ్ళు, జాతరలు జరుగుచుండును. అతి సుందరముగా

అలంకరించిన ఉత్సవ విగ్రహాలను వివిధ వాహనాల మీద ఊరేగిస్తారు. ఈ తిరునాళ్ళలో గ్రామ పట్టణ ప్రజలు ఉత్సాహంగా పాల్గొని భక్తిశ్రద్ధలతో ఆ సమయాన్ని ఆనందంగా గడుపుతారు. దేశవిదేశాలలోని వివిధ మతస్తులు వారివారి సాంప్రదాయానుసారము ఉత్సవాలు జరుకొని ఐహికాముష్మిక ఆనందాన్ని అనుభవిస్తారు.

దేశవిదేశాలలో శ్రీ బాలాజీగా ప్రసిద్ధిగాంచిన శ్రీ వేంకటేశ్వర భగవానుడు ఆంధ్రదేశములోని తిరుపతిలో వెలసిన కలియుగదైవం. శ్రీ వేంకటేశ్వర భగవానునికి ప్రతిసంవత్సరము బ్రహ్మోత్సవాలు 9 రోజులు దీక్షగా జరపటం జగద్విదితం. అదేవిధంగా శ్రీశైలములో శివరాత్రి ఉత్సవాలు, పూరీ జగన్నాథ్ ఉత్సవాలు, కాశీ, ప్రయాగ, గురువాయురప్ప, శబరిమలై అప్ప తిరునాళ్ళు అత్యంత వైభవముగా జరుపబడుచున్నవి.

ఉత్సవ మూర్తులను అత్యంత శోభాయమానంగా అలంకరించి రోజుకో వాహనంమీద ఊరేగిస్తారు. గరుడవాహనసేవ, హనుమంతసేవ, శేషవాహనసేవ, పొన్నమానుసేవ, ఏకాంతసేవ, వసంతసేవ, తెప్పోత్సవము, సింహవాహనసేవ, చివరిగా రథోత్సవము అత్యంత వైభవముగా శ్రీ వేంకటేశ్వర దేవుని బ్రహ్మోత్సవాల సమయంలో జరుపుతారు.

తిరునాళ్ళ చివరిరోజున రథోత్సవము జరుగుతుంది. దీనికి అత్యంత ప్రాధాన్యతనిస్తారు. "రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" రథం మీద వేం చేసియున్న భగవానుని దర్శించిన వారికి పునర్జన్మ లేదట. పెద్ద పెద్ద ఆలయాలలో ప్రత్యేకంగా రథాలు తయారు చేయించి ఉంచుతారు. అలాగే ఏనుగులను, గుఱ్ఱాలను పోషించుతారు. ఏనుగు అంబారికట్టి దేవుణ్ణి ఊరోగిస్తారు. ఊరేగింపులను శ్రద్ధాభక్తులతో ప్రజలు తిలకించి భగవంతుని దర్శించినంత ఆనందము పొందుతారు.

ప్రతి దేవునికి ప్రత్యేక వాహనం ఉంది. శ్రీ మహావిష్ణువుకు

గరుత్మంతుడు, శివునికి వృషభము, అంబికా దేవికి సింహము, మురగన్‌కు నెమలి, శ్రీ సరస్వతిదేవికి హంస వాహనము, దేవేంద్రునికి భద్ర గజము, ఇలా ప్రతి దేవతా మూర్తికి ప్రత్యేక వాహనాలున్నాయి. వాటికి అనుగుణంగా ఉత్సవ సమయంలో ఆయా వాహనాలను కూడా అలంకరించి వాటి మీద ఉత్సవ మూర్తులను ఆయా పట్టణ గ్రామ వీధుల్లో ఊరేగిస్తారు. ప్రజలు వీటిని దర్శించుకొని ఆనందోత్సాహాలలో బాధలను మర్చిపోతారు. భగవంతుని దర్శించామనే తృప్తిపొందుతారు.

ఉత్సవాల ఊరేగింపుల ప్రయోజనం అధిష్టాన దేవతలను సంతృప్తి కలిగించటంతో బాటుగా నిర్వాహకులకు తత్త్వ ప్రయోజనంతోబాటు, భక్తి సంప్రాప్తిస్తుంది. ఉత్సవాలలో తరతమ, వీరువారు అనే ఏ విధమైన బేధభావం లేకుండా అందరు పాల్గొని ఆనందాన్ని పంచుకొంటారు. వివిధ ప్రాంతాల నుండి వచ్చిన ప్రజలలో పరస్పర అవగాహనతోపాటు ఆచార వ్యవహారాలు, వేషభాషలు అవగతం చేసుకోవటానికి దోహదపడుతుంది. ఉత్సవాలు విజ్ఞాన ప్రచార కేంద్రాలు. ఉత్సవ ఊరేగింపులలో శాస్త్ర కోవిదులు, కళాకారులు, వివిధ సంస్కృతులవారు వారు అనుసరిస్తున్నకళా ప్రదర్శన గావించి వాటిని ఇతర ప్రపంచానికి పంచటానికి వీలుపడుతుంది. ఈ విధంగా ఉత్సవాలు ఊరేగింపుల వల్ల ప్రజలు ఐహికా ముష్మిక సుఖాలు అనుభవిస్తారు.

కాల పరిణామంలో ఉత్సవాలు చేయటం, ఊరేగటాలు మానవమాత్రులకు కూడా వీటిని ఆచరింప జేయటం జరుగుతుంది. "నావిష్ణుః పృధ్వీపతిః" అన్నట్టు రాజుల పట్టాభిషేకంలో ఉత్సవాలు జరపడం, వివిధ వాహనాల మీద వారిని ఊరేగించడం జరుగుతుంది. "ఉత్సవశ్చ మహనాసేద యోధ్యాయాం జనకులః" రామపట్టాభిషేక ప్రయత్నాల్ని వివరిస్తూ రామాయణంలో ఈ విధంగా చెప్పబడినది.

రామాయణ కాలం నుండే ఉన్నత పదవులను, అత్యున్నత

పీఠాలను అధిరోహించేటప్పుడు పరిమితమైన ఉత్సవ ఊరేగింపులు జరగడం మొదలయ్యాయి. మొదట్లో దేవుళ్ళకే పరిమితమైన ఉత్సవ ఊరోగింపులు రానురాను గుర్తింపబడిన మనుష్యులకు కూడా ఊరేగింపులు జరపడం అలవాటైపోయింది. కళలలో నిష్ణాతులైన వారిని ఏనుగు అంబారితో ఊరేగిస్తారు. కొన్ని మతాల వారు శవాల్ని కూడా ఊరేగింపుగా తీసుకువెళతారు.

కాల మార్పుల్లో దేవుళ్ళకు జరిపే ఉత్సవ వేడు˘లు నాయకులకు, కొందరు పెద్ద మనుష్యులకు, ప్రచార వ్యక్తులకు ఘనంగా ఊరేగింపు చేయటం పరిపాటి అయిపోయింది. ఒక కవికి, గాయకుడికి, నాట్యా చారునికి శాస్త్రవేత్తకు ఏనుగు అంబారి కట్టి వారిని ఏనుగుపై ఊరేగించడం చూస్తున్నాము.

ఊరేగింపు మనుష్యుల మధ్య ఒక సామాన్య ప్రక్రియగా అయిపోయింది. ప్రజా పాలనలో ప్రతి చిన్న కార్య సాధనకు ఊరేగింపు ఒక ఆయుధమైపోయింది. పది మంది కలిసి వాళ్ళ కోర్కెలను తీర్చుకోవటానికి గుంపుగా జేరి బ్యానర్ పట్టుకొని ఆటపాటలతో సందడి చప్పుళ్ళతో ఊరేగింపుగా వచ్చి ఒక పత్రాన్ని సమర్పిస్తారు. ఆ సమయంలో ప్రజల రాకపోకలకు ఎంత అంతరాయం కలిగినా పట్టించుకొనే వారు ఉండరు.

దేశానికి, రాష్ట్రాలకు ఎన్నికలు ప్రకటించగానే మొదలవుతుంది ఊరేగింపుల పర్వము. పార్టీ టికెట్ దొరికి కాబోయే నాయకుడు గారు నామినేషన్ వేయటానికి మంది మార్బలముతో, డప్పుల మోతలతో, మేళతాళాలతో పెద్ద ఊరేగింపుగా వచ్చి నామినేషన్ పత్రందాఖలు చేస్తారు.

ఎన్నికల తేదీలు దగ్గర పడుతున్న కొద్ది నాయకులు కాబోయే వారు చేసే ప్రచార జోరు వర్ణనాతీతం. డజన్లకొద్ది చిన్న కార్లమీద

నాయకుడు గారు, ఆయన అనుచరగణము బ్యాండు మేళాలతో ఊరేగుతూ వచ్చి తిరునాళ్ళనుమరిపించే సభలను ఏర్పాటుచేసి మాటల తూటాలతో ప్రజల ఓట్లు తన ముద్ర మీద పడేలాగు చేస్తారు. పాలక పార్టీవారు హంగులతో ఊరేగుతూ ప్రచారం చేస్తారు.

విపక్షపార్టీ వారు చిన్న చితక అంటే స్వతంత్ర అభ్యర్థులు లారీల మీద, ట్రాక్టర్లమీద, టాక్సీలమీద, ఆటోలమీద, సైకిళ్ళమీద, కొందరు గాడిద, గుర్రం ఎడ్లమీద, బండ్లమీద మరికొందరు కాలినడకన ఎన్నికల ప్రచారం జోరుగా చేసుకొంటారు. ఈ విధంగా జరిగే ఊరేగింపుల ముందు దేవుళ్ళకు జరిగే ఉత్సవ ఊరేగింపులు తీసికట్టుగా ఉంటాయి.

దేవుళ్ళను ఊరేగించటానికి ఏనూగులు, గుర్రాలు, సింహాలు, పక్షులు మొదలగు వాటిని ఉపయోగిస్తే నేటి ప్రజా ప్రతినిధులు ఈనాటి వాహనాలై విమానాలు, హెలికాప్టర్, చిన్నకార్లు, పెద్ద కార్లు, ట్రాక్టర్లు, ఎడ్లబండ్లు, గాడిదలను ఊరేగింపు వాహనాలుగా ఉపయోగిస్తున్నారు.

ఎన్నికల ఫలితాలు ప్రకటించిన తరువాత గెలిచిన నాయకులు జరిపే ఉత్సవాలు ఊరేగింపులు వివిధ వాద్యాలతో, నాట్యాలతో, మందు సామాగ్రి పేలుళ్ళతో, రంగు రంగుల కాంతుల వెదజల్లుతూ చెప్పరానంత వైభవంగా ఊరేగుతారు. కనబడని దేవుళ్ళకు చేసే ఉత్సవ ఊరేగింపులు నాయకులకు చేసే ఊరేగింపుల ముందు ఏపాటివి. వీళ్ళు ప్రజల కోర్కెలు తీర్చవచ్చిన దేవుళ్ళు.

ఉత్సవ ఊరేగింపులు విజయాలకు, శుభ కార్యాలకు మాత్రమే పరిమితం కాలేదు. అశుభ కార్యాలు కూడా ఉత్సవ ఊరేగింపులతో సాగిపోతున్నాయి. మనుష్యులు జీవించటం ఎంత సహజమో, మరణించటం అంతే సహజము.

సామాన్యుడు మరణిస్తే వారి ఆచారల వ్యవహారాల రీతగా పాడిని ఊరేగింపుగా తీసుకెళ్ళతారు. కారణం అది ఆ జీవి అంతిమ

యాత్ర కనుక. అదే ప్రముఖులు, గొప్పోళ్ళు మరణిస్తే ప్రభుత్వ కార్యాలయాలకు సెలవుతో బాటు వివిధ మాధ్యమాలు కూడా మూగపోయి పలుకుతాయి. ఆయన భౌతిక కాయాన్ని ప్రజల దర్శనార్థంకొరకు ఏర్పాటు చేస్తారు. అంతిమ సంస్కారము రోజున శవ వాహనాన్ని చక్కగా పూలమాలలతో అలంకరిస్తారు. మేళతాళాలతో ఊరేగింపుగా భౌతికకాయాన్ని నిర్ణయించ బడిన స్థలానికి తీసుకొస్తారు. ప్రభుత్వం సర్వ లాంఛనాలతో పెద్ద ఉత్సవం జరిపి, ఆయనకు అంతిమ సంస్కారము చేస్తారు.

దేవుళ్ళ ఊరేగింపులకే సరిపెట్టుకోలేదు జనం. జనం కొన్ని శుభ కార్యాలు తలపెట్టినప్పుడు ముఖ్యంగా పెళ్ళిళ్ళు సమయంలో చక్కగా అలంకరించిన వాహనంమీద వధూవరులను కూర్చోబెట్టి ఎంతో చక్కగా ఊరేగిస్తారు. ఆ సమయంలో పెళ్ళివారే కాదు పెళ్ళి ఊరేగింపు చూచినవారు సంతోషపడిపోతారు. అన్నింటిని జయించన దైవ సమానులైన స్వామీజీలు, బాబాలు ఊరేగింపులలో పోటీపడి మరి ఎంతో శోభాయమానంగా ఊరేగుతుంటారు, అది చూచి వారి భక్తజన సందోహం తరించ పోవటానికి.

కేవలం దేవుళ్ళ వరకే బ్రహ్మోత్సవాలు, ఇతర ఉత్సవాలు, ఊరేగింపులు పరిమితం కాలేదు. మనుష్యులకు, ఇతర జీవులకు, చివరకు మరణానికి కూడా ఉత్సవాలు ఊరేగింపులు జరపడం సర్వసాధారణమై పోయింది. ఊరేగింపులో బాబాల మాట ఎలా ఉన్నా మీకు ఊరేగాలనిఉంటే పనిలో పని కానిచ్చేయండి.

దేవుళ్ళ కొరకు చేసే ఉత్సవాలతో ఎంతో కొంత పరమార్థం లభిస్తుంది. మరి మనుష్యులు ఇతర జీవులు జరుపుకొనే ఉత్సవ ఊరేగింపులకు ఏ పరమార్థం లభిస్తుందో దేవునికే తెలియాలి.

# 10. తీర్థప్రసాదాలు

పూజ హైందవంలో సంస్కృతిలో అవిభాజకమైపోయినది. దేవాలయాలలో, గృహాల్లో, ఇతర విశేష సందర్భాలలో పూజచేయటం జరుగుతుంది. చూచేవారికి చేసే వారికి ఆనందం కలిగించేది పూజ. హిందువులు పూజను ఒక ఆధ్యాత్మిక సాధనగా అనుష్ఠిస్తుంటారు.

పూజచేయటానికి కొన్ని నియమ నిబంధనలున్నాయి. "దేవతా ఉద్దేశన ద్రవ్యత్మానం" దైవ నిమిత్తము ఒక వస్తువును సమర్పించడం పూజ. పూజకు సమర్పించే ప్రతి వస్తువు పవిత్రంగా ఉండాలి. అందుకే "ఓం అపవిత్రం పవిత్రోవా సర్వవష్టాంగతోపవా"అని మంత్రాన్ని పఠించి పూజవస్తువులను పవిత్రం చేస్తారు.

వేదకాలంలో యజ్ఞయాగాదుల ద్వారా మానవులు దైవంతో సంబంధం ఏర్పరుకొన్నారు. అది కాలపరిణామంలో పూజగా రూపుదిద్దుకొన్నది. పూజారికి దైవానికి మధ్య సంబంధం కల్పించటానికి పూజ ఒక వారధిగా ఉంటుంది. అనేక శాస్త్రాలు వివిధ రకాలైన పూజా విధానాలు వాటికి అనుగుణమైన ఆచార వ్యవహారాలను గూర్చి వివరించాయి.

పూజా సామాగ్రి చాల వస్తువులతో ఉంటుంది. పంతులుగారు పూజ అనగానే చేంతాడంత లిస్టు వ్రాసి ఇస్తారు. ఇందులో ఏ వస్తువులు లేకపోయినా ఏదోలోపం చేసినట్టు అనిపిస్తుంది. పూజకు కావలసిన వస్తువులు ఏర్పాట్లను పూర్తి చేసుకొన్నాక, పంతులు గారు పూజను ఇలా ప్రారంభిస్తారు. "ఓం శ్రీమహాగణాధిపతయే నమః" అని చెప్పి ఉద్ధరిణతో నీళ్ళను అరచేతిలో వేసుకొన్నాక "ఓం కేశవాయ స్వాహా! ఓం నారాయణాయ స్వాహా! ఓం మాధవాయ స్వాహా!"అని మూడుసార్లుపూజారంభములో ఆచమనము చేయిస్తారు.

ఈ విధముగా ప్రారంభమైన పూజ "స్వస్తి ప్రజాభ్యః......"అనే స్వస్తి వాచకముతో మంగళావాచకముతో ముగుస్తుంది. ధూపదీప నైవేద్యం వంటి 28 అంశాలతో పూజ పరిసమాప్తము గావించబడుతుంది. పూజలో చేసే ప్రతి ప్రక్రియ ముఖ్యమైనదే. అందులో తీర్థ ప్రసాదాలనుగూర్చి చెప్పుకొంటున్నాము.

పూజకు ఉపయోగించే జలము పరిశుభ్రముగా ఉండాలి. పూజా విగ్రహాన్ని పవిత్రజలంతో అభిషేకిస్తారు. అలాగే పంచామృతాలతో అభిషేకం చేస్తారు. "గంగాదిపుణ్య తీర్థభ్యస్స మానీతామిధం జలం..." శుద్ధోదక స్నానం సమర్పయామి అంటు మంత్రం చదువుతారు. అదే విధంగా ఆ రోజు శుచి శుభ్రతలతో తయారుచేసిన వివిధ వంటకాలను భగవానునికి నైవేద్యం పెడతారు. "నైవేద్యం షడ్రసోపేతం భక్షభోజ్యం చాతుర్విదం...." మహానైవేద్యము సమర్పయామి అని చెప్పుతారు.

ముఖ్యముగా గణేశపూజ, గౌరిపూజ, శ్రీ సత్యనారాయణవ్రతం, తదితర పండుగసందర్భాలలో అధిష్టాన దేవతా విగ్రహాన్ని అత్యంత వైభవముగా, పుష్పపరిమళ, సుగంధ ద్రవ్యాలతో, శేషవస్త్రాలతో, అమూల్యమైన ఆభరణాలతో శోభాయమానంగా అలంకరిస్తారు. పూజవద్ద కొత్త వస్త్రాలు, పండ్లు, కొబ్బరి కాయలు ఇంకా రకరకాల పదార్థాలను ఉంచుతారు.

దేవతా విగ్రహాన్ని అత్యంత శోభాయమానంగా, వారివారి శక్తి సామర్థ్యాలను బట్టి అలంకరిస్తారు. ఈ విధమైన అలకంరణ వివిధ వస్తువుల సమర్పణలు త్రికరణ శుద్ధిగా సమర్పించుకోవాలి.

పూజాకార్యక్రమాలు చేస్తున్నారు అంటే భగవంతుని యందు భక్తిని పెంపొందించు కొనటానికి, తరువాత జీవితంలో ఎదురయ్యే కష్ట నష్టాలనుండి కాపాడలనే భావనతో ఉండటం. భక్తికి భగవద్గీత

అత్యంత ప్రాముఖ్యతను ఇచ్చింది. అందులో భగవానుని ఏ విధంగా సంతుష్టడను చేసి ఆయన అనుగ్రహాన్ని పొందాలో కూడా వివరించింది.

"పత్రం పుష్పం ఫలం తోయం యోమేభక్త్యా ప్రయచ్ఛతి" ఎవరుగాని నిర్మలమైన మనస్సుతో, భక్తిపూర్వకంగా ఆకు, పువ్వు, పండు, జలము సమర్పిస్తారో దానిని నేను సంతోషముగా స్వీకరిస్తాను అంటారు.

కొండంత దేవుడికి కొండంత ప్రతి అక్కర్లేదన్నట్లు ఆయనకు నీవు ఇచ్చేది ఏదిగాని మనఃపూర్వకంగా ఉండాలి. భక్తిశ్రద్ధలతో సమర్పించాలి. అది ఒక ఆకుగావచ్చు, పండుగావచ్చు, పుష్పంగావచ్చు, మాసం ముద్దగావచ్చు, లేదా ఇన్ని నీళ్ళుపోసి కృష్ణార్పణమను, అది కూడా చేయలేకపోతే నీ మనస్సును సమర్పించు దానిని ఆయన స్వీకరించి నీవు కోరింది ఇస్తాడు.

బహుమూల్యమైన భగవంతుని సందేశాన్ని గుండె నిండా నింపుకొని నీవుచేసే పూజలోని ప్రతివస్తువును ఆయనకు అర్పించాలి. భగవంతునికి ఇవన్ని ఎందుకు సమర్పించాలి? సమస్త వస్తువులు, పదార్థాలు ఏవిగాని ప్రకృతి నుండి వచ్చినవే. ప్రకృతి పరమాత్మంశము. ఎక్కడినుండి వచ్చినవో అక్కడికే చేరాలి, అది సృష్టి ధర్మం, కనుక ఆయనకు అర్పించాలి.

భగవానుడు మరో సందేశాన్ని అందజేసినాడు. "యత్కరోషి యదాశ్ని యజ్ఞోషి దదాయత్" నీ కొరకు నీవు ఏది చేసుకొన్నా, ఏమి తిన్నా లేక యజ్ఞము అంటే పూజ, లేదు దానం, మరే కర్మ చేసినా అదినాకు సమర్పించు అంటాడు. ఆయన కోరకని ప్రత్యేకించి మనం ఏమి చేయనవసరం లేదు. పూజ చేసినా, దానధర్మాలు చేసినా, మరో సత్కార్యము చేసినా, అది నీ కొరకే అవుతుంది అంతేగాని అవి ఆయనకు అక్కర్లేదు.

నిజం చెప్పాలంటే మనం ఏది చేకొన్నా మనకే దక్కుతుంది.

కాకపోతే భగవంతుని పేరు చెప్పుకొని మనం అనుభవిస్తున్నాం. నీవుచేసే పూజలు పెట్టిన పండు, నైవేద్యం, నీళ్ళు ఏదిగాని 'కృష్ణార్పణం' అని మనస్పూర్తిగా చెప్పు అంతే అది ఆయన స్వీకరించినట్లు అవుతుంది. ఆ తరువాత అదంతా నీవు భేంచేసేదేకదా!?

"అశ్నామి"పండుగ దినాల్లో చాలా మంది ఇంట్లో పూజ చేసుకొంటారు. దేవుని అలంకరణతోబాటు వారి అనుకూలతను బట్టి రకరకాలైన పిండి వంటలు చేసుకొని భగవానునికి టెంకాయలు, పండ్లు, పువ్వులు మొదలగూ వాటితో నైవేద్యముగా ఆ వంటకాన్ని భగవానుని ముందు ఉంచుతారు. దణ్ణం పెడతారు, తెలిసినవారైతే "ఓం ప్రాణపానవ్యాన ఉదాన సమానాయ స్వాహా" అని చెప్పి భగవానునికి చూపించుతారు. భగవానుడు ఆ వేనైద్యాన్ని ఆరగిస్తాడనే నమ్మకము. అలా పూజ ముగించిన తరువాత అక్కడి నుండి అందరూ చాటుగా వెళ్ళిపోతారు. కొద్ది నిమిషములతరువాత వచ్చి చూస్తారు. ఆ పదార్తాలు అన్ని అలాగే ఉంటాయి. అయినా భగవానుడు ఆరగించాడనుకొని తృప్తిపడిపోతారు. మన పూజ ఫలిస్తుందనుకొంటారు.

"యత్కరోషి" నీవు ఏమిచేసినా "యదాశ్నాసి"ఏమితిన్నా నాకర్పించ మన్నారు. నీవు చేసినవి నీవే అనుభవించు (జస్ట్) అయితే, ఆ అనుభవించేదేదిగాని, భపగవదార్పణమను అంటాడు. అంటే ఆయన నీదేమి తినలేదు. అందుకనే పెట్టిన పదార్థాలన్ని అలాగే ఉన్నాయి.

ఇక్కడ అసలు పాయింటున్నది. మీరు పెట్టిన పదార్థాలన్నీ ఆయనలాగించేస్తే మీసంగతో, మిమ్మల్ని ఇబ్బంది పెట్టడం ఆయనకు అసలు ఇష్టం ఉండదు. అందుకనే వాటిని అలాగే వదిలేస్తాడు. కాని మీరు చెప్పిన సమర్పయామిని విని ఆరగిస్తాడు. మనలాగే ఆయనకు ఆకలేస్తే మీరు పెట్టిన ఇస్తారాకులన్ని కాళీ అయిపోతాయి. అందుకే

మన కొరకు ఆయన ఏది బోంచేయడు. మనము పెట్టినవన్ని మనకే వదిలేస్తాడు. అదే దేవుడంటే మరి.

ద్రౌపది అక్షయపాత్రనందలి శకలేశమును గ్రహించి వేల శిష్యులతో వచ్చిన దుర్వాస మునిని సంతోషింప చేస్తాడు. గజేంద్రుడు మొర విని వచ్చి రక్షిస్తాడు. శబరి ఇచ్చిన ఎంగిలి పండ్లుతిని ఆమెకు సద్గతి నిచ్చాడు. రంతి దేవుని ఉదకదానమునకు పుణ్యలోకాల్ని ఒసగాడు. విదురుడ సమర్పించిన గంజిని అమృతంగా స్వీకరించాడు. కుచేలుని పిడికెడు అటుకులతో పరమప్రీతిని పొందాడు. తిన్నడు పెట్టిన మాంసము, హస్తి పెట్టిన ఆకులు, కాళముపెట్టిన మణులు, శ్రీ అల్లిన గూడును గ్రహించి వారికి మోక్షాన్ని ప్రసాదించలేదా?

ఈ విధముగా భగవానునికి సమర్పించేదేది గాని అది నీకు కళ్యాణానిస్తుంది. అయితే మనం పెట్టిన నైవేద్యాన్ని భగవానుడు స్వీకరించాడా లేదా అనే సందేహాన్ని మనల్ని వెంటాడుతు ఉంటుంది. "న వైదేవా అశ్నంతి నపిబంత తదేవా 'అమృతం దష్ట్వా తృప్తని" (భా. ఉ) దేవతలు మనలాగు భుజించడం, త్రాగడంచేయరు. నీవు పెట్టిన ఆహారం మీద వారి దృష్టిని పెడతారు. దానితో తృప్తిపడిఓపతారు. అక్కడ ఉంచిన ఆహారపదార్థాలన్నిటి సారాన్ని గ్రహించాతారు. అక్కడ అలాగే ఉన్న నైవేద్యం వారి అనుగ్రహంతో మనకు లభించింది. దానినే ప్రసాదమన్నారు. ఇది ఎంతో పవిత్రమైనది. ఈ ప్రసాదము దొరకటం అంటే భగవానుని అనుగ్రహమునకు, దయకు పాత్రులైనట్టే. ఇట్టి ప్రసాదము మనోశరీరాలను పవిత్రం చేస్తుందనే హిందువుల ప్రగాఢ విశ్వాసము. విశ్వాసమే మనిషికి ఊపిరి.

పూజలో భాగంగా ధూపదీప నైవేద్య అర్ఘ్యపంచామృత శుద్ధోక స్నానం భగవానునికి గావింపబడును. పవిత్రపరచిన జలాన్ని టెంకాయ నీళ్ళతో పంచామృతాలు తీర్థంగా భక్తులకు ఇస్తారు. తీర్థము

తీసుకోవటానికి ఒక పద్ధతున్నది. ఎడమచేతిలో కుడిచేతిని గోకర్ణా కృతిలో ఉంచి తీర్థాన్ని స్వీకరించాలి.

"అకాలమృత్యుహరణం సర్వవ్యాధి నివారణం ।
సమస్త పాప క్షయకరం శ్రీ భగవత్ పాదోదకమ్ పావనమ్ శుభమ్॥"

తీర్థ జలాన్ని క్రింద పారవేయకూడదు. అందుకే తడిచేతిని తలపై వ్రాసుకొంటారు.

తీర్థము తరువాత ప్రసాదాన్ని ఇస్తారు. "దైవనిర్మాల్యం శిరాస హృష్ణామి ప్రసాదం స్వీకృత్యాం హరిః ఓమ్ సతసత్". ఈ విధముగా పూజాకార్యక్రమాన్ని ముగించి అక్కడ హాజరైన ప్రతి ఒక్కరికి తీర్థప్రసాదాలిచ్చి పంపిస్తారు.

తీర్థప్రసాదాలను తీసుకొన్నవారు భగవంతుని దర్శించినంత సంబరపడి పోతారు. పూజ కార్యం చివరలో వచ్చి వీటిని స్వీకరించినా పూజ ఫలితాన్ని అందుకోగలరు.

ఆధ్యాత్మికపరంగా భగవానుని అనుగ్రహం కొరకు చేయబడు పూజలు, గొప్ప వ్యక్తులనే వారికి కూడా చేయడం చూస్తున్నాము. అంటే అతడు పూజా అర్హుడే అనిపించుట చేత వ్యక్తిపూజలు చేస్తున్నారు. ఋషి సప్తములగు ఆధ్యాత్మిక గురువులు పూజకు అర్హులు.

నేటి సమాజంలో రాజకీయానికి వున్నంత ప్రాధాన్యత విశేషము మరే విషయానికి లేదన్నది యదార్థము. రాజకీయ నాయకులై ప్రజాపరంగా రాజ్యమేలాలని నాయుల ఉబలాటం.

ఎన్నికలముందో లేక అంతర్గత బేధాల వల్లనో ఆ పార్టీ నాయకుడు ఈ పార్టీ తీర్థప్రసాదాలు తీసుకుంటాడు. ఈ విధముగా ఎక్కువ భాగం నాయకులు ఒక పార్టీ నుండి వేరే పార్టీలోకి తీర్థం

పోయించుకొని వెళ్లి ప్రసాదము స్వీకరిస్తారు. అంటే సీటు సంపాయించుకుంటాడు. తరువాత పదవి వగైరాలు.

భగవానుని పొందటానికి, తెలుసుకోవటానికి శాస్త్రాలు అనేక మార్గాలను చూచించాయి. ఉపాసనలు, ప్రార్ధనలు, పూజలు, యజ్ఞయాగాదులు మొదలగునవి. భగవానుని కొరకు చేయటానికి నిశ్చయించిన వ్యవహారాలన్నిటిని, తెలివిగల మానవులు వారి నిత్య కృత్యాలలో వినియోగించుకొని దైవ సమానులై పోతున్నారు.

నిజంగా భగవానుని కొరకు పరితపించేవారు, పార్టీల గత్రాలలో చేరి తీర్థప్రసాదాలు పుచ్చుకోరు అనుకుంటాను. అసలు సిసలైన పూజాది కార్యక్రమాలు చేసి పవిత్రించిన తీర్థ ప్రసాదాలు అందుకుంటారు.

# 11. దానమేవ గృహస్థానం

"తపఃపరం కృతయుగే, త్రేతాయుగం జ్ఞాన ముచ్యతే।
ద్వాపరే యజ్ఞ మిత్యాహః దానమేవ కలౌయుగే॥"

కృతయుగంలో తపస్సు, త్రేతాయుగంలో జ్ఞానము, ద్వాపర యుగములో యజ్ఞ.యాగాదులు, కలియుగములో దానము చేయటం మానవ ధర్మమని శాస్త్రము చెబుతున్నది. "యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం" యజ్ఞ దాన తపస్సు కర్మలు త్యజింపకూడదని గీతా ప్రబోధం.

"దానమేవ గృహస్థానాం" గృహస్థులు తప్పక దానం చెయ్యాలని మనుస్మృతిలో చెప్పబడినది. ఇన్ని శాస్త్రాలు మానవులు తప్పించుకోకుండా దానము చెయ్యాలని ఘంటాపదముగా చెప్పుతున్నాయంటే దాన ఫలం ఎంత గొప్పదో అర్థమవుతుంది.

దాన మంటే ఏమిటి? ఒక వస్తువు మీద లేక పదార్థము మీద తనకున్న హక్కును వదలుకొని ఇతరులకు ఆ హక్కును కల్పించటము. ఒకరు ఇచ్చిన దానిని మరొకరు స్వీకరిస్తే దానమవుతుంది అని యాజ్ఞవల్కుడు చెబుతాడు. ఇతర జీవుల మీద దయాదాక్షిణ్యాలు కలిగి సహకరించటము కూడా దానమే.

దానం త్యాగానికి మరో రూపం. దాని వలన చిత్త శుద్ధితోబాటు మనిషిని మనిషిగా గుర్తించటం, ఆపదలో నున్నవారిని ఆదుకోవటం, మనుష్యులేకాదు సర్వజీవులు ఒక్కటేననే సమభావం, సమానత్వం ప్రదర్శించటం దానమవుతుంది. దానం ఏ విధంగా ఇయ్యాలో అనే విషయాని తైత్తరీయోపనిషత్తు విశ్లేషించినది.

"శ్రద్ధయాదేయం అశ్రద్ధయదేయం! శ్రియాదేయం హ్రియాదేయం భియాదేయం సంవిదా దేయం" దానం ఎంతో శ్రద్ధగా చెయ్యాలి. అశ్రద్ధగా అనాసక్తంగా చేయకూడదు. సంతోషముగా

అణుకువగా, భక్తిగా, సంకల్ప పూర్వకంగా చెయ్యాలి. ఏ విధమైన ధనం దానం చెయ్యాలంటే, తాను సంపాదించిన దానిలో ఒకవంతు తన జీవనోపాధికి ఉపయోగించుకొని మిగిలినరెండు భాగాలు దాన ధర్మాలకు వినియోగించాలి. "తస్మాత్ త్రిభాగం విత్తన్య జీవనాయప్రకల్పతే...." (శివధర్మం) శ్రీరామచంద్రుడు ఆ విధంగా ధర్మాలు చేసే వాడట. దానం చేసే గుణం సద్గుణము. ఇది మానవ జాతికే దక్కిన సుగుణం.

దానం చేయక పోతే కలిగే నష్టమేమిటో ఈ శ్లోకం చెబుతున్నది.

"అదానదోషేణ భవేద్దరిద్రః, దరిద్రదోషేణ కరోతి పాపం ।
పాపాదవశ్యం నరకం ప్రయాతి, పునర్దరిద్రః పునరేవ పాపి॥"

గత జన్మలో దాన ధర్మాలు చేయక పోవటం వల్ల ఈజన్మలో దారిద్ర్యము ప్రాప్తించినది. దారిద్ర్యము వల్ల బుద్ధి చెడి పాపకార్యములు చేయటు జరుగును. పాపాలు చేయుట వలన మళ్లిరాబోయే జన్మలో కుడా దరిద్రుడుగా పుడతాడు. దారిద్ర్య జీవనం నిస్సారమైనది. సంఘములో ఏ విలువ లేనిది. కనుక దరద్రపు గొట్టు జీవితం రాకుండా ఉండాలంటే దానధర్మాలు తప్పకుండా చెయ్యాలి.

మనకున్న దానిలో కొంత విధిగా, నిష్కాముగా దానం ఏయటం ప్రతి మనిషి కర్తవ్యము. ఇది మానవతా ధర్మము కూడాను, ఒకవేళ దానం చేయటానికి నీ దగ్గర ఏమిలేక పోతే శారీరక శ్రమనైనా దానం చెయ్యాలి. ఇది ఉత్తమ దానమవుతుంది. లోకోపకారమునకు, పరోపకారమునకు శారీరక శ్రమయైన చెయ్యాలని ధర్మశాస్త్రము చెబుతుంది.

దాన ప్రక్రియకు ఆరు అంగాలున్నాయని భారతం చెబుతుంది.

"దాతా ప్రతి గ్రహీతా చ శ్రద్ధా దేయం చ ధర్మయున్ ।
దేశ కలౌచ దానానాం అంగా న్యేతానిషడే విదుః ॥

దాత, ప్రతిగ్రహిత, శ్రద్ధ, ధర్మ బద్ధ సంపాదన, ప్రదేశము, కాలము. దానం త్రికరణ శుద్ధిగా చెయ్యాలి. అర్తికి మంచి జరగాలని మనః పూర్వకంగా కోరుకుంటూ దైవాన్ని ప్రార్థించాలి. అర్తికి మంచి మాటలతో స్వాంతనంగా అనునయించి అతనిలో ధైర్యాన్ని ఉత్సాహాన్ని, ఆత్మవిశ్వాసాన్ని కల్గించాలి. అర్తికి తన శక్త్యానుసారముగా దానమియ్యాలి.

దానం త్రివిధ రూపంగా చేయబడును. "దాతవ్యామితి యద్దానం....సాత్వికం స్మృతం." ప్రత్యుపకారము చేయుటకు శక్తిలేని వానికి యోగ్యునికి తగినచోటు, తగిన సమయములో దానము చేయుట కర్తవ్యమని నిశ్చయముతో చేయు దానం సాత్వికము.

దానం చేయటం వ్యక్తిగా నీ ధర్మమని దానం చెయ్యాలి. పుణ్యం కోసమని దానం చేస్తే అది ప్రత్యుపకారమవుతుంది. అప్పుడది ఇచ్చిపుచ్చుకొనే బాకి లాంటిది. ఒకరి మెప్పుకోసమో, ప్రతి ఫలాన్ని ఆశించో దానముచేయకూడదు. దానం చేయటం, త్యాగం చేయటం ఆ వ్యక్తి మేలు కొరకే అవుతుంది. ఒకరికి ఉపకారము చేసినా తనకు తాను ఉపకారము చేసుకొన్నవాడు అగును. దానం చేసి ఎవరినో ఉద్ధరిస్తామన్న భావనకంటే తనను తాను ఉద్ధరించుకోవటమే అవుతుంది. ప్రతి మనిషి తన ధర్మ సంపాదనలో తగిన రీతిలో తగిన దానగ్రహీతకు తగిన చోటు సమయంలో దానము చేయుట శ్రేయస్కరమైనది.

కురుక్షేత్రము, కాశీక్షేత్రము, వీటితో సమానమైన పవిత్రదేశము లందు పౌర్ణమి, అమావాస్య, వాటితో సమానమగు పర్వకాలమందు ఉపకారం చేయలేని వారికి దానం ఇవ్వాలి. అది శ్రద్ధతో చెయ్యాలి. యదాలాపంగా దేనినో ఆశించిదానం ఇవ్వకూడదు. మనిషి ఏ భావనతో దానం చేస్తాడో ఆ భావాన్ని పొందుతాడట. తాను దాతను దానం

స్వీకరించువాడు గ్రహీత అనే భావన రానీయకుండా చేయుదానం పవిత్రమైనది.

''యుతుప్రత్యుపకారార్థం.....రాజ సంస్కృతమ్...'' ప్రత్యుపకారము, ఫలము ఆపేక్షించి అయి ఇష్టముగా చేసే దానము రాజసం. దానం ఇచ్చే విషయంలో కుడిచేత్తో ఇచ్చేదానం ఎడమ చేతికి తెలియకుండా ఇయ్యవలెనని పెద్దలంటారు. వినయంతో, ఉత్సాహముతో దానమియ్యాలి. రజోగుణ స్వభావులు తమ వస్తువులులనుగాని, డబ్బుగాని ఇవ్వటానికి అంత ఇష్టపడరు. మనిషి అదోరకమ్మై, తప్పదా అన్నట్టు ముఖం పెట్టి ఇస్తాడు. అధి శుభమైన దానం కానేకాదు.

రజోగుణ స్వభావులు ఒక వేళదానం చేస్తే, అంటే అది వ్యవస్థగాని, దేవాలయము గాని, దానివలన తనకు కీర్తి రావాలని ఆశిస్తాడు. అందుకే తనపేరును ఫలానా దాత ఇచ్చిన దానం అని అందరి కళ్ళు పడేచోటు పెద్దపెద్ద అక్షరాలతో వ్రాయించుకొంటాడు. వీలైతే తన విగ్రహాన్ని అక్కడ ప్రతిష్టించమంటాడు. ఈ విధమైన దానం దానమే కాదు.

"ఆదేశకాలే.....తత్తామసః ముదాహృతమ్" ప్రదేశము కాలముతో పనిలేకుండా అపాత్రులకు అమర్యాద పూర్వకముగా ఇచ్చు దానము తామసం (భగ.గీ.)

దానము చేసేటప్పుడు నత్కార భావముతో మర్యాదు పూర్వకముగా ఇవ్వాలి. అందుకు విరుద్ధముగ ముష్టివాడు అడుగుతున్నాడని "ఊ పట్టు" అని ఒక నాణెము తీసి వాడి బిక్ష పాత్రలో వేసి, వెధవ అడుక్కోక పోతే ఏదోపని చేసుకొని బ్రతకోచ్చు కదా! అంటూ నొసుగుతూ, తిరస్కార భావముతో, అమర్యాదగా తెలియని వాడికిచ్చే దానం దానం కాదు. అది తామస దానమౌతుంది.

దానమివ్వటానికి పునీతముకానిది, ప్రయోజన శూన్యమైనది, తగని ప్రదేశము, అదే విధముగా నిద్రబోవు నమయము, శరీరావసరాలను తీర్చుకొనెడి సమయము, ఇతర కార్యములలో నిమగ్నమైన సమయములు కూడా దానమివ్వటానికి తగనివి.

దానం ఎవరికివ్వవచ్చో ఎవరికివ్వరాదో దక్షస్మృతి వివరించింది.

"మాతా పితురురౌ మిత్రే వినీతే చోపకారిణి ।
దీనానాధ విశిష్టేషు దత్తంచ సఫలం భవేత్ ॥
ధూర్తే బందిని మల్లే చ కువైద్యేకి తవేశరే ।
చోట ధారణ చౌరేషు దత్తం భవతి నిష్ఫలం" ॥

తల్లిదండ్రులకు, గురువులకు, మిత్రులకు, నీతిమంతులకు, పరోపకారులకు, దీనులకు, అనాధలకు చేసే దానము సత్ఫలితము ఇస్తుంది. ధూర్తులకు, నిందితులకు, మూర్ఖులకు, అవినీతి పరులకు, దొంగలకు, చేసే దానము నిష్ప్రయోజన మవుతుంది.

అయితే విష్ణు ధర్మతిలో ఇలా చెప్పబడివుంది.
"అన్నాచ్ఛాదన దానేషు పాత్రం నైవ విచార యేత్।
అన్న స్యక్షధితః పాత్రం, వివస్త్రోవస న స్యచ॥"

అన్న వస్త్రాలు దానం చేసేటప్పుడు అతడు పాత్రుడా అపాత్రుడా అని చూడనవసరం లేదు. ఆకలితో నున్న వానికి అన్నము, వివస్త్రునకు వస్త్రము దానము తప్పక చేయవలెనని చెబుతుంది ఈ శాస్త్రము.

ఎన్నో రకాలైన దానాలున్నాయి. ముఖ్యముగా అన్నదానం, విద్యాదానం, వస్త్రదానం, ధాన్యదానము, లవణ దానము, కన్యాదానము, దాసీదానము, శయ్యా దానము, గృహదానము, హిరణ్య దానము, రత్న దానము, అగ్రహార దానము, రధగజ, అశ్వ, మహిష దానములు ఇంకా ఇతర దానములు కూడా చేయవచ్చును.

"విధి హీనమసృష్టాన్నం" విధి రహితమైనది, అన్నదానము లేని యజ్ఞము, శ్రద్ధలేకుండా అన్నదానము లేకుండా చేసే యజ్ఞము త్యాజ్యము అన్నది గీతాశాస్త్రము.

అన్నీ పుణ్య కార్యాలలో అన్నదానం విధిగా చేయవలెనని పెద్దలు కూడా చెప్పటం కద్దు. అన్ని దానాలలో కెల్లా అన్నదానము మిన్న అన్నారు ఎందుకు? అన్నం ప్రాణ రూపం, అన్నం తింటేనే ప్రాణం తృప్తి నొందుతుంది. ఆకలి తీరినవాడు శాంతచిత్తుడౌతాడు. దాతను అన్నదాత సుఖీభవ అని ఆశీర్వదిస్తాడు. అన్నదాతకది బ్యాంకులో దాచిన సొమ్ములాగున పుణ్యమవుతుంది. అన్నదాన మహిమను తెలిసే పెద్దలు యజ్ఞయాగాదులలో, పుణ్యకారాయలలో, భగవత్ కార్యాలన్నింటిలోను అన్నదానం చేయమన్నారు.

యజ్ఞమునకు అన్నదానం స్థూలదేహము. అన్నదానం ప్రాణులన్నింటి యందుగల సంబంధం స్థిరపరచును. అన్నము పెట్టనిచోటు బేధభావము కలుగుతుంది. అందువల్ల కీడు సంభవించును. ధరణికి భారము ఎవరంటే కొండుల కోనలు కాదు, దానము చేయనివాడేనని శ్రీనాథ కవి నుడివినారు.

దానం చేయటానికి కొన్ని నియమాలు, నిబంధనలూ ఉన్నా దానికి సవరణలు కూడా ఉన్నాయి. అయితే ఈనాటి పరిస్థితులను బట్టి దానానికి అపాత్రుడు ఎవరనే విచక్షణ చాలా కష్టమయిపోయింది. బిచ్చమెత్తటం నేడు ఒక వ్యాపారయింది. పెట్టుబడి, దేశకాల పరిస్థితులు ఏమి అక్కర్లేదు. చిన్న వేషం వేసుకొని చిప్పచేత బట్టుకొని, జోలి చంకన పెట్టి ధర్మంబాబూ, అమ్మా, అని చిన్న యాక్షన్ చేస్తే సాయంత్రానికి చిప్పనిండొచ్చు. అందుకే కొందరు తెలివైన సంపాదాన పరులు చిన్నపిల్లల్ని, ఆడవారిని, మసలి ముతక వాళ్ళనుపట్టుకొని, సెంటర్లు వెతుక్కొని దానం రూపంలో లాభసాటి వ్యాపారం చేస్తున్నారు. ఇలాంటి

పెద్దమనుష్యులకు ఎలాంటి గతిపడుతుందో! ఈ జన్మలో తప్పించు కోవచ్చును, మరు జన్మలో తప్పదు శిక్ష తప్పదు పనులకు.

ప్రతిదీ వ్యాపారమైపోయిన ఈ రోజుల్లో దేశకాల పాత్రలను పక్కకు పెట్టి కర్తవ్యతా భావముతో, ఈశ్వరార్పణ బుద్ధితో దాన ధర్మాలుచేసిన దోషముండక పోవచ్చును. పాపఫలితంగా దరిద్రుడైన వాడు, దీనుడు, మూఢుడు, అపాత్రులైన వారు ఆత్మ రూపులే అనెడి భావముతో దాన ధర్మాలు చేయటం దాతకు అన్ని విధాల శ్రేయస్కరం.

పుణ్యం కోసమనో, మరేదో ఆశించి చేసే దానము దానము కాదు. దాత దానం చేసి వెంటనే మర్చిపోవాలి. అదిగాక చేసే దానము మూడో కంటికి తెలియనియ్యకూడదు. అది గుప్తదానం అవుతుంది. ప్రచారం కోసం దానం చేయటము దానమే కాదు. అప్పుడు ఫలితం శూన్యం.

దానం చెయ్యాలనే భావన కలిగినప్పుడు యోగ్యమైన వ్యక్తిని పట్టుకొని వెంటనే దానం ఇవ్వాలి. ఆలస్యము చేయకూడదు. "ద్విగుణం శీఘ్ర దానం స్యాత్" అన్నకొన్న వెంటనే చేసే దానము రెట్టింపు ఫలితాన్ని స్తుంది.

"సుపాత్ర దానాచ్చ భవేద్యనాఢ్యో, ధన ప్రభావేణ కరోతి పుణ్యమ్" యోగ్యునికి దానం చేయటం వలన దాత యొక్క సంపదలు అభివృద్ధి చెందుతాయి. దాని వలన దాత అనేక పుణ్య కార్యాలు చేయవచ్చును.

స్నేహితులకు, సహృదయులకు, అర్తులకు సహాయం చేయగలిగిన స్థితిలో ఉన్నప్పుడు దానిని తన బాధ్యతగా భావించి తానే స్వయంగా చెయ్యాలి. అడిగించుకుని సానుభూతితో చేయకూడదు.

పుణ్యాత్ములైన వారి దగ్గరకు పోయి దాను ఇవ్వటం ఉత్తమము.

మంచి వారిని తన గృహానికి ఆహ్వానించి దానం ఇవ్వటం మధ్యమము. తనంతట తానువచ్చి అడిగిన వారికి దానం చేయటం అధమము.

"పుణ్య ప్రభావాత్సురలోక వాసి, పునర్ధనాఢ్యః పునరేవ భోగి" దానము చేయుటచే పుణ్యం లభిస్తుంది. పుణ్యకార్యాలు చేయటం వలన స్వర్గప్రాప్తి కలుగుతుంది. దాని వలన తిరిగి ఉత్తమమైన జన్మలభించిన సర్వసౌఖ్యాలు అనుభవించవచ్చును.

దాన మహిమను చెప్పేమంచికథ భారతంలో ఉంది కురుక్షేత్ర యుద్ధము ముగిసిన తరువాత ఘన విజయంసాధించిన పాండవులు గొప్ప యాగము చేసారు. ఆ యాగ సమయంలో అన్నదాన, భూ గోదానాలు మొదలగు ఎన్నో దానాలుచేసారు. ఇంత ఘనముగా మునపెన్నడు ఇలాంటి యాగముజేసి దాన ధర్మాలు ఇయ్యలేదని ప్రజలలో పదే పదే చెప్పుకొంటున్నారు.

ఆ సమయంలో శరీరము సగభాగం బంగారముతో మెరిసే ఒక ముంగీస వచ్చి యాగ ప్రదేశంలో దానాలు ఇచ్చినచోటు ఇటు అటు పొర్లాడింది. కొంతసేపు తర్వాత ధర్మరాజు దగ్గరగు వచ్చి ఆ ముంగిస "ధర్మరాజా! మీరిచ్చిన దానధర్మాలు స్వలాభం కోసము, కీర్తి ప్రతిష్టల కొరకు చేస్తున్నవే గాని నిస్వార్థంగా, నిష్కామముగా, అణుకువతో, ఆర్తితో ఇచ్చినవి కావు అంటుంది."

అంత ధర్మరాజు అయ్యా! నీవు ఎందుకు ఇలా అంటున్నావో వివరించమని అర్థిస్తాడు. "ధర్మరాజా! విను ఒక గ్రామంలో ఒక బీద బ్రాహ్మణ కుటుంబంఉండేది. ఆ ప్రాంతంలో కరువు కాటాకాలు వచ్చాయి. కొన్ని రోజుల తరువాత వారికి ఇంత అన్నం దొరికింది. ప్రాణాలు కాపాడుట కోసం అన్నాన్ని ఇంటికి తీసుకొస్తాడు ఆ ఇంటి యజమాని, ఆయన భార్య కొడుకు కోడలు తనతోబాటు ఆహారం దొరకక పస్తులుంటున్నారు. ప్రాణాలు దక్కించుకోవటానికి అన్నం తినటానికి సిద్ధమయ్యారు.

ఇంతలో ఒక ముసలి బాటసారి వచ్చి అయ్యా! కొద్ది రోజులుగా అన్నం లేక అలమటిస్తున్నాను, ప్రాణం కొడిగడుతోంది. ఇంత అన్నం పెట్టిపుణ్యం కట్టకోమని అర్థించాడు. బాటసారి దీనావస్థను చూచిన ఇంటి యజమాని ఆప్యాయతగా తన భాగాన్ని బాటసారికి ఇచ్చాడు. ఆకలి తీరలేదంటే యజమాని భార్య, కొడుకు, కోడలు వారికి ఉంచుకున్న ఆహారాన్ని దయార్ద్ర హృదయంతో బాటసారి క్షుద్బాధ తీర్చటం వారి కర్తవ్యము, ధర్మముగా భావించి ఆ ఆహారాన్ని బాటసారికి ఇస్తారు. కడుపు నింపుకొన్న బాటసారి వారిని దీవించి వెళ్ళిపోతాడు. ఆకలి బాధకు ఓర్చలేక ఆ నలుగురు మరణిస్తారు.

ఒకరోజు నేను ఆ గృహంలోకి ప్రవేశించగా నా శరీరములోని సగభాగం ఆ బ్రాహ్మణకుటుంబ సభ్యులు దానం చేసినప్పుడు నేలపై పడిన ఆహార రేణువులు అంటుకొని ఇదిగో ఇలా నా శరీరం సగభాగం బంగారముగా మారిపోయింది. ఆ రోజు నుండి ఎక్కడెక్కడ దానధర్మాలు జరుగుతుంటే అక్కడి కల్లా వెళ్ళి పొర్లుతూ మిగిలిన సగభాగం బంగారము చేసుకుందామని ప్రయత్నించుచున్నాను. ఇప్పటి వరకు ఆ ఆశ నెరవేరలేదు. మీ దానధర్మాల వల్లనైనా నా ఆశ నెరవేరుతుందనుకొన్నాను. లాభంలేదు, చూసారుగా నా శరీరాన్ని మిగిలిన భాగం అలాగే ఉండిపోయింది.

ఆ బీద బ్రాహ్మణ కుటుంబం చేసిన దానం, నిస్వార్థంగా, నిష్కామంగా, హృదయపూర్వకంగా "అతిథిదేవోభవ"అని సమర్పించిన దానం ముందు మీరు ఇంత ఘనంగాచేసిన దానధర్మాలు ఏ పాటివి" అంటుంది ముంగిస. అప్పుడు ధర్మరాజు ఆ ముంగిసతో ఏకీభవిస్తూ మేము చేసిన దానధర్మాలూ పుణ్యాత్ములు చేసిన దానముతో సాటిరావు అంటూ నిర్ఘాంత పోయాడు.

అశాశ్వతమైన సంపదలకు, జీవితానికి ప్రాముఖ్యతను ఇవ్వక ముక్తిని పొందే దానధర్మాలు చెయ్యాలని దధీచి మహర్షి, బలిచక్రవర్తి,

శిబి చక్రవర్తి, జీమూత వాహనుడు, కర్ణుడు, రంతిదేవుడు మొదలగు దానమూర్తులు దానానికి నిర్వచనం చెప్పగల మహాదాతలు, దాతృత్వానికి ప్రతీకలుగా చిరస్మరణీయముగా ఇప్పటికి మరెప్పటికి వారు నిలిచియున్నారు. దానం గూర్చి చెప్పేటప్పుడు ఈ మహాదాతల పేర్లు చెప్పక పోతే దానం మీద అది అసంపూర్తి రచన అవుతుంది.

ఈనాడు లేక పోలేదు దాన దాతలు. వారి బుద్ధ్యానుసారం ధర్మముగా దానం చేస్తున్నారు. అయితే ఎక్కువ మంది వారు చేసిన దానధర్మాలు అందరూ గుర్తించాలని అన్ని మాధ్యమాల ద్వారా ప్రకటిస్తున్నారు. ఇది శాస్త్రసమ్మతముకాదు. దానం చేస్తే మూడోకంటికి తెలియకూడదు. ఇది దాన ఫలితంలక్షణం తెలియజేస్తుంది.

అయితే ఏ విధమైన ధనాన్ని దానంచెయ్యాలి? తన స్వయం కష్టార్జితం, న్యాయ బద్ధముగా సంపాదించిన ధనాన్నే దానమివ్వాలి. అవినీతి పరంగా అక్రమ పద్ధతుల ద్వారా సంపాదించిన ధనం ఏ విధంగాను దానం చేయటానికి ఉపయోగించినా దాన ఫలం దక్కదు.

"అన్యాయా దాగతం దత్వా న కలాం పృధివీ మపి ।
శ్రద్ధావర్జమ పాత్రాయన కించిద్ భూతి మాప్నుయాత్ ॥
ప్రదాయ శాక ముష్టిం వా శ్రద్ధా భక్తి సముద్యతామ్ ।
మహాతే పాత్ర భూతాయ సర్వాభ్యుదయ మాపుయాత్ ॥

(దేవలస్మృతి) అన్యాయంగా ఆర్జించిన దేదైనా చివరకు ఈ పృధ్విని మొత్తంగా దానం చేసినా, శ్రద్ధా శక్తులు లేకుండా ఎంత గొప్పదానం చేసినా అపాత్రదానము ఇచ్చినా ఫలితం శూన్యము. అట్లే న్యాయంగా ఆర్జించినది ఏ చిన్న దానమైనా కనీసం ఆకు కూరదానం చేసినా సత్సంకల్పంతో, శ్రద్ధాసక్తులతో ఏ కొద్దిపాటి దానం జేసిన,ఆ యోగ్యునికి దానమిచ్చినా పరిపూర్ణ అభ్యుదయం కలుగుతుందని దేవల మహర్షి అన్నాడు.

దానం చేసేది డబ్బు, వస్తువు అది ఏదిగాని అది మనది కాదు, దానికి మనం ధర్మ కర్తలమే, యజమానులం కాదు అనే భావన దాత కలిగియుండాలి. కనుక కలియుగ మానవులమైన మనం విధిగా, భక్తి శ్రద్ధలతో దానము చేస్తే ఉత్తమలోక ప్రాప్తితథ్యం.

# 12. సంతోషమే-సౌభాగ్యం

"సంతోషాదనుత్తమః సుఖలాభః" (పతం.యో) సంతోషము వలన ఆనందము కలుగుతుంది. సంతోషం అంటే మనిషికి కలిగే మానసిక సంతృప్తి. మానవ జీవిత వికాసానికి సంతోషం ఎంతో దోహదం చేస్తుంది. సంతోషము మనిషికి జీవన ప్రక్రియ. ఇది అదృశ్యముగా ఉంటుంది. "సంతోషతుల్యం ధనం అస్తినాన్యత" సంతోషమునకు సమానమైన ధనమేదిలేదు. అందుకే అన్నారు సంతోషమే మహా భాగ్యమని. జీవితం అన్ని ఉండి వర్ధించిన విస్తరి గావచ్చు! దానిని అనుభవించి సంతోషించ లేనప్పుడు అంతకంటే నరకమేముంటుంది?

ద్వైతరూపంలో నున్న సృష్టి ద్వంద్వ ప్రమాణాలు కలిగి ఉంటుంది. అందుండి ఉద్భవించిన జీవులుకూడా అవే ప్రమాణాలతో వుంటాయి. చీకటి వెలుగులు, సుఖదుఃఖథాలు, శీతోష్ణములు, కష్టసుఖాలు, జయాపజయాలు, ప్రేమానురాగాలు, ప్రియాప్రియాలు, మానానవమానాలు, రాగద్వేషాలు, నిందాస్తుతులు మొదలగు ద్వంద్వ సముచ్ఛయము కలిగి ఉండటమే మానవ జీవితం. ఇవి ఒకదాని వెంట మరొకటి రొటేషన్ పద్ధతిలో మనుష్యుల మీద దాడిచేస్తాయి. ఈ జంటలు విడవడనివి, విడదీయరాని అల్లికల మాలికలు మానవ జీవితాలతో పెనవేసుకుపోయి ఉంటాయి.

ఎవరు గాని చివరకు కోరుకొనేది సంతోషంగ, సుఖంగా, సరదాగా జీవించాలనుకోవడం. వీటిని దూరం చేయటానికి అడ్డంగా వచ్చే దారిద్ర్యం, అనారోగ్యము, మనుష్యులను కుళ్ళ బొడిచి గ్రుంగదీసి దుఃఖ సాగరంలో ముంచేస్తాయి. మనిషి తగిన జాగ్రత్తలుతీసుకొని సమస్యల్ని చక్కబెట్టు కుంటూ సరియైన పద్ధతుల్లో జీవనంసాగిస్తే వాటిని అదిగమించవచ్చు.

అదెట్లా అంటే? తనకు కలిగిన కష్టాల్ని అర్థంచేసుకొని

సానుభూతిని చూపే సన్నిహితులు. కష్టనష్టాలనుమరిపింపజేసే విధంగా అనునయించి నవ్వించగల స్నేహితులు, బంధువులు, అనుకూల జీవిత భాగస్వామి లభించిన వారి సన్నిధిలో సంతోషము అనుభవించగలరు.

సంతోషం సగం బలం అంటారు. సుఖం లభించినపుడు సంతోషంగా ఉంటారు. కష్టము కలిగినపుడు దుఃఖమనుభవిస్తారు. అనుకొన్నది సాధించిన సంతోషం కలుగుతుంది. సంతోషం మనస్సుకు సంబంధించినది. మనస్సు ప్రాణానికి బంధం. సంతోషములోనే మనిషి నవ్వ గలుగుతాడు. నవ్వు మనుష్యులకే సొంతం. ప్రశాంతకరమైన జీవితం సంతోషదాయకం ఉంటుంది. సంతోషముగా ఉన్నవారు ఆరోగ్యంగా ఎక్కువ ఆయుర్ధాయంగా ఉంటారు. కనుక సంతోషం సగం బలం అన్నది అక్షర సత్యం.

సంతోషంగా ఉండాలంటే మనస్సు నుండి ప్రతికూల విషయాలను ఆవలకు నెట్టి అనుకూల తలంపును మనస్సులో నింపుకోవాలి. మనస్సుకు మరోపేరు ఆలోచన. దీనికి ఎంతోశక్తి ఉన్నది. ప్రతి సమస్యకు పరిష్కార మార్గముంటుంది. కొన్ని సమస్యలకు ఆలస్యంగాను, మరికొన్ని సమస్యలకు వెంటనే పరిష్కారం దొరుకుతుంది. అన్ని సమయాలలోను 'ఓర్పు నేర్పు' కలిగిన మనిషి సమస్యలను పరిష్కరించుకొని తృప్తి చెందుతాడు.

మనిషి మనుగడలో తృప్తి చాలా ముఖ్యమైనది. తృప్తిపడిన మనస్సు సంతోషిస్తుంది. తలకుమించిన కోరికలు తలపెట్టుకొని అవి తీరలేదని బాధపడినంత వరకు తృప్తిరాదు. చిన్న చిన్న కోర్కెలతో, ఉన్నదానితో సరిపుచ్చుకొని కాలం వెళ్లదీసినపుడు తృప్తిగానే వుంటుంది. తీరని కోర్కెలతో కొట్టుమిట్టాడే మనిషిని నిర్లిప్తత ఆవరిస్తుంది. ఏమి చేయలేని స్థితిలో మనిషి నిస్పృహ చెందుతాడు. నిస్సత్తువ ఆవరిస్తుంది, ఉత్సాహము, చురుకుదనం లోపిస్తాయి. అప్పుడు సంతోషం చిరునామా

లేకుండా పోతుంది. తృప్తిలేని జీవితం దుఃఖ పూరితమౌతుంది. అప్పుడది శరీర ఆరోగ్యాన్ని కూడా హరిస్తుంది.

జీవితమంటే సుఖదుఃఖాలు - ప్రపంచమంటే మంచిచెడు అనే పెద్దల మాటల్లో ఎంతైనా నిజమున్నది. కష్టాల్లేకుండా సుఖాల్లేవు, ఈ రెండు లేకుండా జీవితంలేదు. ఇది ప్రకృతి ధర్మం కూడాను. కష్టాలు కలిగినపుడు కృంగిపోకుండా మనస్సు ధృడము జేసుకొని వాటిని అధిగమించాటనికి ప్రయత్నించాలి. కష్టాలు శాశ్వితాలు కావు. సుఖాలు అంతే. ఈ సత్యం తెలుసుకుంటే మనస్సు తేలికవుతుంది, ముఖములో చిరునవ్వు చిందుతుంది. గీతాచార్యులు కూడా అదే వశించారు. "దుః ఖేష్వను ద్విగ్న మనాఃసుఖేషు విగత స్పృహః...." దుఃఖము కలిగినపుడు దుఃఖించనివాడు, సుఖములు కలిగినపుడు స్పృహలేనివాడు సమభావముతో నుండువాడు నిజమైన సంతోషాన్ని అనుభవిస్తాడు.

సంతోషముగా ఉండాలంటే డబ్బే ముఖ్యంగా ఉండాలని చాలామంది అనుకుంటారు. కేవలం ధనం సంతోషాన్నిస్తుందనే మాట సరికాదు. డబ్బున్న వాళ్ళు దానిని కాపాడుట కోసం పడేపాట్లు చూస్తుంటే "అయ్యో పాపం"అని జాలిపడతాం. సంపద ఉండటం సంతోషానికి ఒక బలమయిన కారణం. సంతోషించే స్వభావముండాలి. అది ఆ వ్యక్తి మానసిక స్థితి మీద ఆధారపడి ఉంటుంది. "సంతోషం హృది సంస్థాయ సుభారం సంయమోభవేత్" సంతోషమన్నది తన హృదయంలో ఉంది గాని బయట పరిస్థితి మీద కాదు. జీవితం సుఖమయం కావాలంటే నిగ్రహంగా వ్యవహరించాలి.

"సంతోషిగాడేని శుక్రుడైన నశించు...." సంతోషము లేకపోతే ఇంద్రుడంతటి వాడుకూడా నశిస్తాడు. సంతోషముతో నున్న వ్యక్తి సౌభాగ్యవంతుడుగా ఉంటాడు. "తన సంతోషమే స్వర్గము - తన దుః ఖమే నరకమండ్రు తథ్యము సుమతీ" అన్నాడు సుమతీ శతక కర్త. సంతోషాన్ని మించిన సౌందర్యము లేదు. సంతోషాన్నిమించిన సంపద

లేదన్నారు పెద్దలు. "సంతోషముగా ఉండేవారు ఎప్పుడు దుర్మార్గులు కాలేరట." మంచి సామెత.

భయోద్రేకాలతో ఉండి, కుత్సిత కుతంత్రాలతో చేసే ఆలోచనలు మనిషిని క్రుంగదీస్తాయి. అది ఆరోగ్యాన్ని కూడా నాశనం చేస్తుంది. దొరకని వాటికి ప్రాకులాట మాని, దొరికిన వాటితో తృప్తిపడే జీవితం సంతోషము, ఆనందదాయకముగా ఉంటుంది. సంతోషాన్ని ముఖంలో చూడవచ్చు. ముఖం సంతోషాన్ని, దుఃఖాన్ని చూపే అద్దము.

మనలను మనం గౌరవించుకొనే స్వభావము మనలో లేకపోతే ఇతరులను గౌరవించలేము. ఇతరులను ప్రేమించగల హృదయం, గౌరవించగల సహృదయం ఉన్నప్పుడు నీలో సంతోషించే భావం ఏర్పడుతుంది. ఇతరులకు సహాయపడటం, కష్టాల్లో ఉన్నవారికి, తాడితపీడిత జనులకు సహాయ సహకారములు అందించటముతోబాటు, సానుభూతి కలిగి ఆపన్నహస్తం అందించ కలిగితే సంతోషానికి అర్థం తెలుస్తుంది. ఇతరులకు సంతోషాన్ని పంచకలిగినపుడే మానవజీవితం సఫలీకృతం అవుతుందన్నారు మాతా శారదాదేవి. మాత సందేశాన్ని ఆచరించి జీవితం ఆనందమయం చేసుకోండి, అప్పుడు సంతోషం సౌభాగ్యం ఎట్లాకాదో చూడండి!

# 13. అర్థమూలం మోక్షదాయకం

"యస్యాస్తి విత్తం సనరః కులీనః స పణ్డితః సశ్రుతవాన్గుణజ్ఞః
స ఏవ వక్తా సదదర్శనీయః సర్వే గుణాః కాంచన మాశ్రయంతే"

ఎవరు ధనవంతుడో వాడు కులీనుడు, పండితుడు, వేదవేత్త, సద్గుణ వంతుడు, మంచివక్త, సుందరమైన వాడని పించుకొనును. ధనం గలవానికి ఇన్ని గుణాలున్నాయని శాస్త్రం చెప్పుచున్నది. ధనహీనునకు ఈ గుణాలున్న అతడు ధనవంతుడంత ప్రతిభనుగాంచలేడు అని పెద్దలు చెప్పుదురు. డబ్బు విలువ, ప్రాధాన్యత, గౌరవము, ఉపయోగము ఈ శ్లోకం చక్కగా వివరించింది.

పురుషార్థాలలో రెండవ స్థానాన్ని ఆక్రమించిన అర్థం దేవదానవ మానవులందరికి అవసరమైనదే, ప్రాణంతో సమానమైనది. అన్నిటికంటే ముఖ్యంగా ఈనాటి మానవులకు డబ్బు విలువ, అవసరం, దానికుండే గౌరవం, కీర్తి ప్రతిష్టలు బాగా లోతుగా తెలిసినవారు.

ప్రస్తుత మానవ జాతి, ఇందు స్వాములు, బాబాలు ఎవ్వరూ మిహాయింపు లేరు, డబ్బు డబ్బే ప్రధానము. డబ్బులేనిదే డుబ్బుకు కొరగామని తెలిసిన ప్రతివ్యక్తి డబ్బు సంపాదించటానికి పడని పాట్లు, చేయని నేరాలు, ఘోరాలు, మారణ హోమాలు, హత్యలు, వరకట్న వ్యవహారం, బహుమతులు, దోపిడీలు, అక్రమ మార్గాలు మొదలగు దృష్ట కృత్యాలు లేనేలేవు అంటే అందరూ సమ్మతిస్తారనుకుంటాను. ఎక్కడో అడపడదప ఉన్న వాళ్ళు జమలోకి రారు.

వాల్మీకి మహర్షి డబ్బు విలువేమిటో, దానిని ఏ విధంగా సంపాదించాలో వివరించాడు.

"యస్యార్థాస్తస్య మిత్రాణి, యస్యార్థస్తస్య బాంధవా।
యసార్థాస్య పుమాన్ లోకే యస్యార్తాస్య చ పండిత॥"

అర్థసిద్ధి పొందిన వాడికే మిత్రులు, బంధువులు చేరువౌదురు. అతడే మనిషిగా చలామణి అవుతాడు. అతడే పండితుడుగా గుర్తింపు పొందుతాడు. అందుచేత అర్థాన్ని సంపాదించాల్సిందే. కాని అది ధర్మ విరుద్ధముగా కాదు అంటాడు.

వాల్మీకి బోయవాడుగా ఉన్నప్పుడు డబ్బు సంపాదనకోసం అతడు చేసిన కిరాతకాలు దృష్టిలో ఉంచుకొని ధన ప్రభావాన్ని గూర్చి బహుచక్కగా చెప్పాడు వాల్మీకి అయిన తరువాత.

డబ్బున్నవాడే మనిషిగా గుర్తించబడతాడు. అంటే డబ్బులేనివాడు మనిషే కాదు. దరిద్రుడు మిగిలిన జీవరాసులు జీవించినట్టు బ్రతుకుతాడు. సంఘంలో డబ్బులేని వాడిని డబ్బులున్న గొప్పోళ్ళు ఏ విధంగా చూస్తారో అందరికి, మనందరికి స్వానుభవమే కదా!

దారిద్ర్యాన్ని, పేదరికాన్ని చచ్చిన వాటితో సమానంగా చెప్పుతారు. అంతేకాదు దరిద్ర గొట్టులను, బీదవాళ్ళను, ఐశ్వర్యవంతులు అలాగే చూస్తారు. దరిద్రం, ధనం ఉండటము ఒక్క మానవజాతికే చెందినది మరే జీవులకు లేని ప్రత్యేకత. అసలు మానవుడే ఒక ప్రత్యేకమైన వ్యక్తి. ఎన్నోన్నో ప్రత్యేకతలు కలిగినవాడు, అందునా డబ్బు గొప్పదనం తెలిసిన జ్ఞాని.

వాల్మీకి మహర్షి ధన మహత్యం చెబుతూ చివరలో ఒక మాటన్నాడు. అర్థాన్ని ధర్మ విరుద్ధముగా సంపాదించవద్దని. కాని ఇప్పుడు ప్రతిమనిషి అంటే ఆడ, మగ, ముసలి, పడుచు అనే తేడా లేకుండా "అ విరుద్ధ పదాన్ని" పీకి పారేసి అర్థాన్ని అవిరుద్ధ పదముగా సంపాదన చేస్తున్నారు. ధన సంపాదనలో మార్గమేదైనా అది క్రమ మార్గమే గాని వక్రమార్గమనేది ఉండదంటున్నారు. చేతకాని వాళ్ళు, రెండు చేతుల

సంపాదించలేని అసమర్థులు మాట్లాడే మాటలు అక్రమము, అవినీతి మొదలైనవి అంటున్నారు ప్రజాస్వామ్య పద్ధతిలో.

"విత్తం సనరం: కులీనం:" ధనవంతుడు ఉత్తమ కులంలో పుట్టినవాడు. భారతదేశం ఎన్నో కులాలకు నిలయం. అందులో నిమ్నకులం, అధమకులం వారున్నారు. వారిని ప్రత్యేక వర్గాలుగా విభజించి రాజ్యాంగ పరంగా కొన్ని వసతులనుకల్పించారు. అంటే అట్టి కులస్తుడు ధనం సంపాదిస్తే కులీనుడైపోతాడు. అప్పుడు తక్కువ కులం అనేది అరుదై పోతుందన్నమాట. "విత్తం సపణ్ణితః" డబ్బున్నవాడు పండితుడు కూడా అయిపోతాడుట. "పణ్ణితాః సమదర్శినః" సమత్వము, నమదృష్టి గల జ్ఞానులు పండితులు, కాని కేవలం డబ్బుంటే జ్ఞానియైపోతాతడు అంటున్నాడు మహర్షి.

"విత్తం సశ్రుత వాన్గుణజ్ఞః" వేదాంతి, సద్గుణవంతుడు - డబ్బుతో వేద వేదాంత జ్ఞానంతోపాటు సద్గుణవంతుడై పోతాడు. "సేవ వక్తే సచ దర్శనీయః" మంచి వక్త, మరి అందగాడై పోతాడు. మృదు మధురమైన సంభాషణలు కలిగి అందర్ని ఆకట్టుకోవటమే కాదు డబ్బుతో మన్మథాకారుడై పోతాడట.

డబ్బుంటే ఈ పైన చెప్పిన గుణాలన్నింటిని కొనిపారవేయవచ్చని ఎంతో దూరదృష్టితో ఏనాడో ఒక ఋషి పుంగవుడు ఉదహరించాడు. ఈనాడు అది అక్షరాల నూటికి వెయ్యిపాళ్ళు యదార్థము చేస్తున్నది డబ్బు. అధ్యాత్మిక దృష్ట్యా పైన చెప్పిన లక్షణాలు ఐశ్వర్యవంతులకు కలగా మిగిలిపోయేవి, ఎన్నటికి సాధ్యపడనవి అని సర్వశాస్త్రాలు చెప్పుచున్నాయి. ఈ లక్షణాలు పొందాలంటే కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞాన సాధనలచేతనే సాధ్యమని కూడా చెప్పబడింది.

అవసరాలకు మించిన సంపదవల్ల బాధలేమిటో కూడా శాస్త్రాలు

చెప్పాయి. "అర్థానా మార్జనే దుఃఖం ఆర్తిఅనాం చ రక్షణే నానే దుః ఖవ్యయే దుఃఖం కి మర్మం దుఃఖ భాజ నామ్". ధనార్జన వల్ల దుః ఖములు కలుగును. అట్లు ఆర్జించిన ధనాన్ని కాపాడుకొనుటలో దుః ఖము కలుగును. ధనం పోయిన దుఃఖం కలుగును. డబ్బు ఖర్చు చెయ్యాలంటే ఏడ్పొస్తుంది. ఎందుకు, ఎన్నెన్నో బాధలకోర్చి గడించిన సొత్తుకదా! ఇంత దుఃఖ భాజనమగు డబ్బుతో కలిగిన ప్రయోజనం ఏమిటంటే?

"అలున్ బిడ్డలు తల్లిదండ్రులు ధనంబంచున్మహా బంధనం
బేలా నా యెంద గట్టినాడవిక నిన్నే వేళ జింతింతు
శ్రీకాళహస్తీశ్వరా॥"

ఈశ్వరా! భార్యాబిడ్డలు, తల్లిదండ్రులు, ధన సంపాదన, అనే పీటముడిని నా మెడకు చుట్టూ బిగించితివో గాని ఊపిరి సలపనంతగా అది బిగుసుకు పోయింది. మోహ సముద్రములో మునిగిపోయి ఉన్నాను. ఈ నా దుఃఖాన్ని ఏ విధంగా రూపుమాపుతావో అని శ్రీకాళహస్తీశ్వరుని వేడుకుంటాడు భక్తుడు.

డబ్బు మనిషి స్వభావాన్నే మార్చివేస్తుంది. ధనం ప్రభావం వర్ణించడం ఎంతకూ తరగదు. డబ్బు లేని వాడికి కోట్లరూపాయల ఆస్తివస్తే అతని నైజమే మారిపోతుంది. పోతుగాడు కాస్తా పోతురాజు గారుగా, లక్ష్మమ్మ, కనక మహాలక్ష్మిగా అయిపోతారు. డబ్బుతో వచ్చే డాబు, దర్పం, ఠీవి, చూపులు, నడత, మాట, వ్యవహారం అంతా పూర్తిగా మారిపోతాయనేది అందరకు తెలిసిందే. అంతేకాదు ఊహించని దానికన్నా నీ దగ్గర డబ్బు చేరితే గుండె నిబ్బరముగా ఉంటావు. సంతోషము, సంబరముతో, ఉత్సాహముతో, ఉల్లాసముతో ఆనందముతో ఉక్కిరిబిక్కిరైపోతూ ఏవేవో లోకాల్లో తేలిపోతుంటావు. అప్పుడు భూమికి కొంత ఎత్తులో కాపురమున్నట్టు ఫీలై పోతావు.

నీ ధనాన్ని చూచి గర్వపడతావు. నీకంటే అధిక ధనవంతులున్నారు. వారితో పోల్చితే నీవు నిర్భాగ్యుడవే. చీకటి పడుతున్నప్పుడు మిణుగురు పురుగులు బయలుదేరి "మేము వెలుగునిస్తున్నాము" అనుకుంటాయి. నక్షత్రాలు మేము లోకాన్నంతా ప్రకాశింపజేస్తున్నా మనుకుంటాయి. చంద్రుడు ఉదయించగనే నక్షత్రాల వెలుగు మసక బారిపోతుంది. అంత చంద్రుడు తన కిరణాలతో లోకాన్నంతా వెలుగుతో నింపుతున్నాను అని సంబరపడి పోతాడు. ఇంతలో ప్రభాతం తూర్పుదిక్కున సూర్యోదయాన్ని చాటుతుంది. అప్పుడు చంద్రుని సంగతి అంతే.

డబ్బున్న గొప్పోళ్ళు అందరూ ఈ ప్రకృతి యదార్థాలను అర్థం చేసుకొని ధన మదాన్ని, అధికార గర్వాన్ని ప్రదర్శింపకుందురు గాక. డబ్బుకు ఎవడు దాసుడు కాడో, ధనం ఎవడికి దాస్యం చేస్తుందో అతడే నిజానికి మనిషి. ధనాన్ని సముచితంగా వినియోగించుకోవటం ఎరుగని వాడు మనిషని పించుకోలేడు.

మహాజ్ఞానులు, ఏకభక్తులు, కర్మయోగులు ధనంపై ఆశామోహాలు పెంచుకోరు. వీరు డబ్బు వచ్చే విధానంలోను, ఖర్చు చేయుటలోను బాధపడటంగాని లేక ఏదో పోగొట్టుకొంటున్నామనే భావన లేశమంతను లేక ఉందురు. వాళ్ళ కొరకు డబ్బును ఖర్చు చేయునప్పుడు, గాని లేక ఇతరులకు ఇచ్చేటప్పుడు కూడా సమభావముతో, సంతోషంగా ఆ కార్యాలు చేస్తారు.

మత్తులోనున్న వారు రాత్రిపూట ప్రయాణం చేస్తూ లంగరుకు కట్టిన తాడును విప్పకుండా రాత్రంతా తెడ్లు వేశారట. తెల్లవారిన తరువాత చూస్తే బయలుదేరిన చోటే ఉన్నది తెలుసుకొన్నారు. ఇప్పటికి మత్తుదిగి పోయింది. అదే విధంగా ధనసంపాదన మైకంలో నున్న

మానవులు స్వార్థాన్ని తొలగించుకోకుండా, భోగాల బంధాల నుండి బయటపడకుండా, ఎన్నిపూజలు, వ్రతాలు చేసినా జీవిత నౌక దరిగానిదరి అనంతంలోకి చేరటం కాని పని.

"సమలోష్మాశ్మ కాంచనః" మట్టిగడ్డ, రాయి, బంగారమును సమానముగా చూచువాడు భవబంధములను త్రెంచుకున్నవాడు అని గీత చెప్పుచున్నది. ఈ విషయంలో సంసారులను పక్కకుపెట్టి సన్యాసులమనే వాళ్ళను, స్వామీజీలు, బాబాజీలు వగైరా నేటి ఆధ్యాత్మిక గురువులు ధనం విషయంలో బంగారాన్ని మట్టి ముద్దగా చూస్తున్నారా? ఈనాటి సంఘంలో పీఠాధిపతుల మీద, మఠాధిపతుల మీద జరుగతున్న పరిశోధనలు పరిశీలిస్తే యదార్థం కొంతవరకైనా తెలుస్తుంది.

ఇటీవల కాలంలో మహబూబ్‌నగర్ జిల్లాలో 'అమ్మదయ' అనే ఆశ్రమము నడిపి, అమ్మ అయ్య రంగులు బయటపడిపోగా చివరకు అన్యాయమై పోయారు. అట్లే బుధేరా సమీపంలో మెదక్ జిల్లాలో సాయిదత్త బాబా ఒక స్త్రీని హత్యజేసి నిందితుడై కోర్టుల చుట్టూ తిరుగుతున్నాడు. ఈ విధముగా కొందరి ఆశ్రమాలు అక్రమాలకు ఆలవాలమై ప్రజలను నమ్మించి మోసం చేస్తుంటే రహస్యం బయటపడేసరికి చేతులెత్తేస్తున్నారు. ఈ విధమైన కార్యాలు చేయటానికి డబ్బు, డబ్బు సంపాదనే ధ్యేయంగా ఉన్నది. చివరకు హైందల సంస్కృతి ఛిన్నాభిన్నమై పోయే సూచనలు కనిపిస్తున్నాయి.

ప్రపంచములో నున్న సమస్త పదార్థాలు, పంచభూతాల వికారాలేనని తెలిసిన జ్ఞాని అన్నిటిలోను సమత్వము జూచును. అంతా మట్టే, మనిషి కూడా మట్టేనని తెలుసు. కాని ఆ మట్టినుండే వచ్చిన బంగారమునకున్న విలువ ఈనాడు మనిషికి లేకుండా పోయింది. ఎంత బంగారం నిల్వలుంటే అంత గొప్పవారు. ఆ ధనవంతుని భార్య వంటి మీద అన్ని బంగారు నగలే కనుక ఆమెకున్న విలువ, గౌరవం ముందు

మంగళ సూత్రము కూడా లేని స్త్రీ వులువ ఏ పాటిది? కనుక మట్టి విలువ బంగారముతో పోల్చటం సరికాదు సంపన్నులకు. దేని విలువ దానికుంటే బంగారము, రాయి, మట్టిని సమముగా చూచువారెందరు? ఒక్క పరిపూర్ణజ్ఞాని తప్ప అట్టివారు మనుష్యుల్లో తరగని మహాత్ములు.

జ్ఞానికి వస్తు పరిజ్ఞానం వేరుగా ఉంటుంది. అప్పుడతడన్నిటిని సమముగా చూస్తాడు. డబ్బు భౌతిక వాంఛలు తీర్చుకోవటానికి ఉపయోగపడుతుంది. అంటే తినటానికి, త్రాగటానికి, అనుభవించటానికి. డబ్బువల్ల శాంతి, ఆధ్యాత్మికం లభించటం కల్ల. యోగి దృష్టిలో డబ్బుకు విలువలేదు. దానిని పొందటానికి ప్రయత్నాలు కూడా చేయడు. యధాలాపంగా వచ్చిన ధనాన్ని కూడా పంచి పెట్టేస్తాడు. డబ్బుకు దూరమౌతాడు. దైవానికి దగ్గరవటానికి ఇంద్రియ వ్యవస్తను దాటి పోయిన తరువాత ఈ విధమైన మనోవైకరి కలుగుతుంది. అప్పుడు ప్రపంచములోని పదార్థాలన్ని ఆయన దృష్టిలో ఒకే విధమైనవిగా ఉంటాయి.

బ్రహ్మజ్ఞాని డబ్బును జూచినప్పుడల్లా "మాతా పుత్ర విరోధాయ హిరణ్యాయ నమోనమః" అని వినాయకుని ధ్యానించి డబ్బుకు దూరంగా ఉండటానికి ప్రయత్నిస్తారు.

ఈనాడు జ్ఞానులెవ్వరో అజ్ఞానులెవ్వరో తెలుసుకోవటం సమస్యగా నున్నది. అయితే ఒక్కటి మాత్రం నిజమనిపిస్తుంది. "డబ్బుకు దాసోహం లోకం". డబ్బు సంపాదన కోసం ప్రయత్నించని మానవ మాత్రుడు లేడేమో? కలికాలం, కాబట్టి అవసరాలన్ని డబ్బుతోనే ఉన్నాయి.

ద్వాపర యుగంలో మహా భారతయుద్ధం జరిగింది, అప్పుడు రక్తపుటేరులు పారించింది ఆస్తి తగాదాల కోసమే కదండి! కనుక ఈ డబ్బే మహావస్తువు, దైవం కంటే గొప్పది. కనబడని దేవుడు మాట

తరువాత, కళ్ళముందు మెరుపులు మెరిపించే డబ్బు మనిషికి నిలువెల్లా దేవుడుకంటే గొప్పది.

డబ్బును ఏ మహానుభావుడు కనిపెట్టాడోగాని వానికి రెండుచేతులెత్తే కాదు, మానవులందరి చేతులెత్తి మ్రొక్కినా తక్కువే అవుతుంది. డబ్బుతో పురుషార్థాన్ని కూడా సాధించవచ్చునని శాస్త్రాలు బలంగా చెపుతున్నాయి. మొట్టమొదటగా కరెన్సీ నోట్లు, నాణేలు లేవు. వస్తువుల రూపేణ బార్టర్ పద్ధతిలో వ్యవహారాలు సాగేవి. కాల పరిణామంలో ఇప్పుడు కనబడే నోట్ల కట్టలు, దేశానికొక పేరుతో విలువను డబ్బు సంతరించుకొంది.

మనిషికి నిత్యావసర వస్తువు లాగా, ప్రాణాలు నిలవటానికి గాలి నీరులాగా, డబ్బు మనిషికి ముఖ్యమైన అవసరమే కాదు ప్రాణ ప్రదం కూడాను. అయితే ఒకనాడు డబ్బుకంటే మాటకే విలువ ఎక్కువ ఉండేది సంఘములో. కాల ప్రవాహములో మార్పులు చేర్పులెన్నో, ఆ దిశలో డబ్బే అన్నిటికంటే మానవ జీవితంలో మొదటి స్థానమే కాదు, మనిషి విలువకు మించిన స్థానాన్ని విలువను గొప్పతనాన్ని తస్కరించింది.

ఈనాడు డబ్బుతో సాధించలేనిది అంటూ ఏదిలేదు. రాజ్యాలు సైతం డబ్బుతో కొనుగోలు చేయవచ్చును. అంతేకాదు దేవుళ్ళనే డబ్బుతో కొనవచ్చు. ఈ విధముగా ఈనాడు డబ్బు విలువ వెలకట్టలేనిదిగా ఉంది.

అనన్యమైన, అసమానమైన విలువను సంతరించుకొని డబ్బుచెలామణి అవుతుంది. కనుక దానిని ఏ విధంగానైనా చేజిక్కించు కొనాలని మానవజాతి ప్రయత్నించని మార్గమంటూ లేకుండా పోయింది. డబ్బు సంపాదనలో పాపపుణ్యాలకు, దుర్మార్గానికి, దుష్టత్వానికి, చివరికి ఎంతఘోరకార్యమైనా చేయి, ఫర్వాలేదు కావలసిందల్లా డబ్బు డబ్బే.

డబ్బు పొందటానికి, భార్యాభర్త, అన్నదమ్ములు, అక్క చెల్లెళ్లు రక్తబంధువులు, దాయాదులు, మిత్రులు, శ్రేయోభిలాషులు అనే తేడాలు వెలలు ఎప్పుడో దాటిపోయాయి. అడిగిన కట్నం తేలేదని ఆడపడుచు నిండుచూలైన ఫర్వాలేదు కిరోసిన్ పోసి తగలపెట్టడానికి. ఒక్కపూట కూడా కూడు దొరకని బక్క ప్రాణుల దగ్గర డబ్బు వసూలు చేయకుండా ఉండలేడు కాబూలు డబ్బుదారు.

సన్నకారు, చిన్నకారు, బడుగు వర్గాల వారు అవసరం కొద్ది ఉన్నవన్ని కొదవబెట్టి ఆ డబ్బుతో భూమితల్లిని నమ్ముకొని దానిమీదపోస్తే వరుణదేవుడు కఠినాత్ముడై చుక్క బొట్టురాల్చకపోయి వాళ్ళు గొడ్డుపోగా, ఉన్న వనరులతో కొద్దోగొప్పో పంటపండితే అదే సమయంలో పెను ఉప్పెనొచ్చి రైతుల వెన్ను విరిచిన, అప్పిచ్చిన దొర బ్యాంకు లేదా డబ్బున్న దొరలు దయాదాక్షిణ్యం మాట అటుపెట్టి ఇంట్లో ఉన్న చెంబూతపెళాతో సహా లాక్కుపోవటం చూస్తే డబ్బు మహాత్యమేమిటో తెలుస్తున్నది. ఇదంతా డబ్బువల్లనే కదా! డబ్బు ఉండి ఒకడు, డబ్బు లేక మరొకడు కష్టాలు పడుతున్నారు. అంతటి (గొప్ప) పనికి (రాని) వచ్చే డబ్బు లేకపోతే బ్రతుకు తెల్లవారెదెలా?

ఇంతకి చెప్పొచ్చేదేమిటంటే? డబ్బు అవసరం లేదనికాదు, దాని అవసరం వర్ణనాతీతం. కత్తితో పండు కోసుకొవచ్చును. అట్లాగే మెడ నరకవచ్చు. కత్తి ఆ విధముగా ఉభయతారకం. డబ్బుఅంతే. నీ దగ్గర డబ్బుంటే దాన ధర్మాలకు ఉపయోగించు పుణ్యలోకాలు పొందుతావు అదే డబ్బుతో రేసులు, జూదాలు, ఆడటంతోబాటు, త్రాగుడు, వ్యసనాలు, శారీరక సుఖాలుతీర్చుకోవటానికి ఉపయోగించితే పతనం పతాక శీర్షికలో ఉంటుంది.

అయితే ఆ డబ్బును ధర్మబద్ధముగా, న్యాయంగా సంపాదించమని, అలాసంపాదించిన దానిలోనే దానధర్మాలు చేయమని

శాస్త్రము చెబుతున్నది. అన్యాయంగా అక్రమంగా డబ్బును సంపాదించి, పాపాన్ని మూటగట్టుకొని అంతుతెలియని అగాధములో అంటే నరక కూపంలో పడకుండా, అవసరానికి తగ్గట్టు, నీతి మార్గంలో సంపాదించి తన ఉపయోగము తోబాటు ఇతరుల అవసరాలనుకూడా తీర్చగల గొప్ప మనస్సున్నప్పుడు, ఆ మనిషి అర్థంతో పురుషార్థాన్ని సాధించిన మహాత్ముడవుతాడు. అప్పుడు అర్థమూలం మోక్షదాయకమవుతుంది.

ఓమ్. తత్. సత్.

ఆదర్శమార్గి

**భక్తగోవిందం**

## అధ్యాయము - 2

# మహాప్రస్థానము

1. వాసనాసారం
2. మాయమర్మం
3. వాంఛితార్థం
4. కర్మానుష్ఠానము
5. విశేషబుద్ధి
6. నైతికప్రవర్తన
7. సోహంసుఖనిద్ర
8. త్యాగఫలంమోక్షం
9. మనోవాక్ సంయమము
10. ప్రణామమ్
11. మహాప్రస్థానం
12. ఓం శాంతి

# 1. వాసనాసారం

"లోకవాసన యజాంతో శాస్త్రవాసన యాపి చ
దేహ వాసన యజ్ఞానం యాధాపన్నైవ జాయతే" (ముక్తి.ఉప)

లోక వాసన, శాస్త్ర వాసన, దేహ వాసన అజ్ఞాన జనితమైనవి. ఈ వాసనలు జ్ఞాన ప్రతి బంధకాలు. ఈ వాసనలేంటయ్యా? కంపూ ఇంపు రాకుండా.

ఈ వాసనలెట్లేర్పడును? పూర్వ జన్మకృతాను భవమునపుట్టిన సంస్కారము, వాసనారూపంలో మనస్సును పట్టుకొని స్థూల శరీరములో ఉండును. జీవుల చావుపుట్టుకలకు ఈ వాసనలే కారణం. చావు స్థూల శరీరానికి సంబంధించినది. లింగ శరీరమునకు చావు లేదు. ఈ లింగ శరీరములో మనస్సు వాసనతో కలిసిపోయి ఉంటుంది. ఇది మరో జన్మకు కారణమౌతుంది. కర్మ ఫలాను సారముగా జీవుడు సంసారమున పడి సుఖదుఃఖములను అనుభవించుటకు ఈ వాసనలే అసలు కారణం.

లోక వాసన, తాను చేసే పనులకను ఇతరులు తెగ మెచ్చుకొని నీయంతటి వాడులేడని పొగిడించు కోవటం లోకవాసన. సామాన్య ముగా ఉన్నవారికంటే విలక్షణముగా ప్రవర్తించి, ప్రత్యేక గుర్తింపు పొందాలను కొంటారు కొందరు. ఆటల్లోనో, పాటల్లోనో, కుస్తీపట్లలోనో, లలిత కళలలోనో, ఉపన్యాసాలు దంచటం లోనో ఇలా ఏదో ఒక దానిలో ఉన్న రికార్డులను చెరిపి, క్రొత్త రికార్డులను నెలకొల్పి నీకంటే ఘునుడెవ్వడని ఎన్నినోళ్ళ పొగిడితే ఎంతో ఠీవిగకా ఫీలైపోతాడు, ప్రత్యేకమనిషి 'నువ్వెరగని వాళ్ళు కూడా నిన్నెరిగి ఉంటారు'. ఆ మాటతో తన కీర్తి ఏమిటోని తెలుసుకొని ఆనందపడిపోతాడు.

ఈ విషయంలో దేవుళ్ళేమి తక్కువ కాదు. నారాయణుడు

సముద్రము మీద పవళించడం, శివుడు మంచు పర్వతాలపై కైలాసంలో కొలువు తీరటం, శ్రీమహావిష్ణువు ఆకాసం కంటే పైన నివాసమేర్పరుచుకొని ఉండటం, వారి ప్రత్యేకతను నిరూపించుకోవటానికి పేరు పేరునా పొగిడించు కోవటానికే కాదా! మానవులే కాదు దేవ, దానవ, వానర, జంతుజాలం సైతం వారికి స్తోత్రాలు చేయటం వల్లనే కదా శ్రీవారులు అన్ని లోకాలలో కీర్తించ బడుతున్నారు.

స్తోత్రాలు చెప్పించుకోవటంలో నరులకు మించిన వారు లేరేమో? ఎందరో చేయలేని కార్యాలు చేసి నోబుల్ బహుమానం, శాంతి బహుమానం, భారతరత్న, ప్రపంచ రత్న, పద్మ విభూషణ్, అతిలోక సుందరి, ప్రపంచ సుందరాంగి మొదలగు గొప్ప గొప్ప బిరుదులు తెచ్చుకొన్నప్పుడు దేశ దేశాల జనులు పొగుడుతుంటే సంబరపడి పోవటం లోకవాసన. పొగడ్తలకు పైకెక్కని మానవమాత్రులు ఉన్నారా! లేరంటే డౌటే.

దేహ వానన : తన అందచందాలు చూచి ఇతరులు మురిసిపోవాలి. ప్రపంచ అందాల పోటీలు పెట్టి బహుమతులిస్తున్నారు. అందాల పరీక్షంటే ఆభరణాలు ధరించి చూపే ప్రదర్శన కాదు. అంగాంగ ప్రదర్శనతో శరీర సౌష్టవము, తీరు తెన్నులు చూచి అందాన్ని నిర్ణయిస్తారు.

అమ్మాయిని చూచి కుందనం బొమ్మలాగుంది అంటారు. కోటేరులాంటి ముక్కు, చారడంత కళ్ళున్న మీనా కుమారిని చూచి అందమంటే అదే అనుకుంటారు. చంద్రబింబమువంటి ముఖము, పొడుగు పొట్టి గాని ఎత్తు, సన్నని నడుము, బొద్దుగా ఉండే వెనకలున్న వాళ్ళను కళ్ళప్పగించు చూడని వారెవరు. పద్మినీ స్త్రీ జాతి లాగుందని పొగడరా!

ఆజాను బాహుడు, అరవింద దళాక్షుడు, విశాలమైన నుదురు, సువిశాలమైన ఛాతి, ఉంగరాల జుట్టు, బలిష్టమైన కండరాలు, కళ్ళతో చూపరులను కట్టిపడేసే అందగాళ్ళను రాజాలాగున్నాడు అంటారు.

పహిల్వానులు రోజుకు 10 లీటర్ల పాలు, రెండు కేజీల మాంసం, 50 కోడిగుడ్లు, కిలో జీడిపప్పు, కిలోబాదం పప్పు, రెండుకేజీల అన్నం వగైరాలతో శరీరాన్ని విపరీతంగా పెంచుకుంటారు. తిండి లెక్కలు ఒక్కొక్క పహిల్వానుకు ఒక్కొక్క విధంగాఉంటాయి. వాళ్ళ బాడీ తూకం 100 కిలోలు, 150 కిలోలు, 200 కిలోలనిచెబుతుంటారు. ఈ మధ్యకాలంలో కండపుష్టి పోటీలు జరుగుచున్నాయి.

ఆ కాలంలో ముష్టికా చారుణులు. బకానురుడు, బాణాసురుడు వంటి రాక్షసులు, భీముడు, ఉగ్రసేనుడు, కుంభకర్ణుడు మున్నగువారు బలీయమైన దేహ సౌష్టవముతో ఉండే వారట. వీరిరూపాకారములను చూచి తెగచెప్పుకుంటారు.

మనిషన్న ప్రతి ఒక్కడూ తన శరీరాన్ని (బాడీని) చక్కగా అందంగా తయారు చేసుకోవటానికి ఎన్నెన్నో ప్రయత్నాలు చేస్తాడు. బక్కగా ఉన్నవారు బలమవటానికి తంటాలు పడుతుంటారు. మరీ లావుపాటి వాళ్ళు కొంచము సన్నబడాలని నానా అగచాట్లు పడుతుంటారు.

అందంగా కనిపించటానికి రకరకాల డిజైనులతో ఫ్యాషన్లతో ఉన్న బట్టలు వేసుకుంటారు. ముఖానికి పౌడర్లు, క్రీములు రుద్దుకుంటారు. నెత్తిమీద జుట్టు దగ్గర నుండి కాళ్ళ గోళ్ళ వరకు మెరుగులు దిద్దుకుంటారు. ఎవరికి వాళ్ళు వారి అందాలనుమెరుగు పరచుకోలేక పోతున్నారని బ్యూటిపార్లర్లు పుట్టుకొచ్చాయి. మాసెజ్ క్లబ్బులు, వ్యాయామశాలలు, యోగాక్లాసులు మొదలగు వాటితో ఒళ్ళును మరింత సుందరముగా చేసుకుంటున్నారు.

ఉన్నరూపానికి రకరకాలగు మెరుగులు దిద్దుకొని అందముగా కనబడటానికి పాటుపడని మనుషులు ఇప్పుడు కనబడటం లేదు. ప్రతివారు వాళ్ళబాడీని చూచి వాళ్ళే మెచ్చుకుంటూ ఉంటారు. ఇదే దేహవాసనంటే.

శాస్త్రవాసన : ఇది ఇలోక వాసన, దేహ వాసనలాగు అందరిలో ఉండదు. ప్రత్యేకించి కొంతమందిలోనే ఉంటుంది. శాస్త్ర పఠనము, ప్రవచనాలు చేయటం, అనుష్ఠానాలు, పరిశోధనలు మొదలగునవి శాస్త్రవాసన.

నాలుగు వేదాలను ఔపోసన పట్టిన వేదవేత్తను కావాలనుకోవటం, వేదాంత సారాలను జీర్ణించుకొని వేదాంతిని అనిపించుకోవాలనుకోవటం, పురాణలన్నిటిని పుక్కిట పట్టి పురాణ పండితుడనిపించు కోవాలనుకోవటం, భాగవత రామాయణాలనుబట్టి పట్టి అప్పగించినట్లు చెప్పి భాగవతుడని పించుకోవటానికి చేసే ప్రయత్నాలన్ని శాస్త్రవాసన వలనే.

రసాయన శాస్త్రము అంతు చూడాలనుకోవటం, భౌతికశాస్త్రం భరతం పట్టాలనుకోవటం, భూగోళ శాస్త్రాని కబళించాలనుకోవటం, అట్టి ప్రయత్నాలలో సఫలీకృతులైన పెద్దపెద్ద పదవులు బిరుదులు పొందటం శాస్త్రవాసనా సారమే.

బాబాలు, స్వామీజీలు, వేదాంతులు, మహారాజులు, మాతలు, దేవీ మాతలు ఒకరునుమించిన ప్రవచనాలు మరొకరుచేస్తూ ప్రజల్లో ఇంతకు మించిన స్వామి లేడనిపించుకోవటాలు శాస్త్ర వాసనతో కూడుకొన్నదే. అష్టావధానం, శతావధానం చేసే వారు, ధ్యానపరులు, భక్తులు, యోగాభ్యాస పరులు శాస్త్ర వాసనలు గలవారే.

తక్కువ చదువుకున్నవాడు డాక్టరు బిరుదు పొందాలనుకోవటం. అంతంత మాత్రం చదువుకొన్నవారు కవిత్వం చెప్పాలనుకోవటం, బాగా వ్రాయటం చేతనైన వాళ్ళు జర్నలిస్టులై పోవాలనుకోవటం, చదువురాక పోయినా అలవోకగా ఆసు కవిత్వం చెప్పాలనుకోవటం, పురాణ కథలు చదివి పండితులై పోవాలనుకోవటం, వాటిని పొందటానికి చేసే ప్రయత్నం శాస్త్రవాసనా ప్రభావమే.

భక్త సమాజాలు వచ్చినా, మిషనరీలు వచ్చినా, ఉపన్యాసకులు

వచ్చినా, విద్యావేత్తలు, సాహిత్యవేత్తలు, వివిధ కళలందు నిపుణు లొచ్చినా, విజ్ఞాన వేత్తలొచ్చినా, శాస్త్రవేత్తలు వచ్చినా, శాస్త్ర వాసనా ప్రభావం ఆ మనుష్యులలో అధికశాతం ఉండటం కారణంగానే.

మనిషు తన నిజస్వరూపాన్ని తెలుకోనియకుండా అజ్ఞానంలో పడవేసి జీవులను జనన మరణబంధములో ఇరికించే ముఖ్యకారకులు ఈ త్రివిధ వాసనలు. మనుష్యులకు ఆగర్భ శత్రువులు. మానవులను సంసార బంధములో కూర్చిన వాసనలు మనస్సు ద్వారా ఇంద్రియముల రేకెత్తించి జీవులు సుఖదుఃఖాలు అనుభవించునట్లు జేసి ఆత్మజ్ఞానానికి దూరం చేస్తున్నాయి.

"నానా యోని శతంగత్వా శేతే సౌవసనావశాత్" (త్రిభి. బ్రాణ.ఉప)

వాసనాత్రయ ప్రభావంచేత మనుష్యులు వారి వారి కర్మాను సారముగా ఏయే యోనియందు జన్మించవలయునో ఆ విధముగా పుట్టుచున్నారు. మానవులు జేసే పుణ్యపాప కర్మల ఫలానుసారంగా మనిషిగానో, జంతువుగానో, చెట్టుగానో, పక్షిగానో, పురుగులుగానో, పాలుము, తేళ్ళు, దోమలు ఇలా సృష్టిలో గల 84 లక్షల రకాల జన్మలు ఎత్తుచున్నారు.

"దేహినమ్ అస్మిన్ దేహే". జీవులకు ఈదేహమందు బాల్యము, యవ్వనం, ముసలితనం ఎట్లా జరుగునో, జీవుడు మరణించిన తరువాత మరొక దేహమును పొందుటయు నంతే అని గీతోపదేశము. జీవుడు ఒకేసారి పుట్టి చచ్చేవాడు కాదని, తానుచేసిన కర్మఫలానుభవమునకు తగిన శరీరాన్ని దాల్చి ఆకర్మ ఫలానుభవము నశించిగా మరో జన్మ నెత్తునని చెప్పబడినది. ఈ విధముగా జన్మ పరం పరలకు వాసనాత్రయయే ఆధారము.

గీతా శాస్త్రము ఈ విషయములో బహుచక్కగా వివరణ ఇచ్చింది.

"శరీరం యద వాప్నోతి యచ్చాప్యుత్క్రా మతీశ్వరః ।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధా నివాశయాత్॥"

(భ.గీ. 15 అ-8 శ్లో.)

ప్రభువగు జీవుడు శరీరమును విడుచునప్పుడు, నూతన శరీరమును గ్రహించునప్పుడు - పుష్పాది స్థానముల నుండిగాలి సువాసనలను గొనిపోవునట్లు పంచేంద్రియములు మనస్సు అను ఆరింటిని తీసుకొని వెళ్ళుచున్నాడు.

గాలికి వాసనలేదు. గాలి వేరు పదార్థాలతో కలిసినప్పుడు వాసన కలిగియుండును. గాలిపువ్వుల వాసనలతో కలిసి వెలువడునప్పుడు అదే రకమైన వాసన వచ్చును. అదే విధముగా జీవుడు స్థూల శరీరాన్ని వదలిపోవునప్పుడు జ్ఞానేంద్రియ శక్తులతో బాటు మనస్సునుకూడా తీసుకొని వెళ్ళిపోతాడు. ఇదే చావు.

జీవుడు పోతూ పోతూ కన్నుకుచూసె శక్తిని, చెవి వినికిడిని, ముక్కు వాసనానక్తిని, నోటిరుచిని, శరీర శీతోష్ణస్థితులను, మనస్సుతోబాటు లాక్కుపోతాడు. దీనిని ఎవ్వరూ గ్రహించలేరు.

జీవుడు శరీరములో ప్రవేశించునప్పుడు గాని, వెలువడునప్పుడు గానిఅందు గ్రహించిన పుణ్యపాప సంస్కారములతో వాసనాత్మక మగు లింగదేహముతో స్వర్గనరకములందు పుణ్యపాపములనుభవించి, కొంత వాసనా శేషముతో దేహాంతరమున ప్రవేశించును. జీవికి భూతవర్తమాన భవిష్యత్ జన్మలు గలవు.

సంసారులు జీవితంలో వచ్చే కష్టసుఖాలను అనుభవిస్తూ ఉంటారు. సుఖమొచ్చినప్పుడు నవ్వుతూ సంతోషముగా ఉంటారు. కష్టము కలిగినప్పుడు కృంగిపోతారు. భరించరాని బాధ కలిగినపుడు 'పోతే బాగుండును, దేవుడా నన్ను తీసుకుపో' అని వాపోతారు.

ఈ విధమైన బాధలు, సుఖాలు, ఈ జన్మతోనే సరికావు.

ఇలాంటి కష్ట సుఖాలు. ఘోరమైన బాధలు ఇంకెన్ని జన్మల్లో భరించాలో తెలుసుకుంటే మళ్ళీ జన్మించకూడదను కొంటారు.

అందుకు ఏం చెయ్యాలి? మనస్సును, ఇంద్రియాలను నిగ్రహించుకోవాలి. అందుకు భక్తి, దానము, ధ్యానము, ధర్మప్రవర్తనము, భూతదయ, నిష్కామ కర్మలు, తపస్సు, జ్ఞాన సంపాదన చెయ్యాలి. దీని ఫలితంగా క్షుద్ర జన్మల నుండి తప్పించుకోవచ్చు.

కనుక వాసనల స్వభావాలను బాగా తెలుసుకొని మరెప్పటికి ఈ వాసనలు పీల్చుకొనే ప్రయత్నము చేయకు. అప్పుడు జన్మరాహిత్యము గలుగుతుంది.

# ౨. మాయ-మర్మం

మాయ అనే మాటను సామాన్యులు సైతము ఏదో ఒక సందర్భములో మాట్లాడతారు. వింతలు, విడ్డూరాలు జరిగినప్పుడు, అద్భుతాలు సృష్టించినప్పుడు, గారడివాడు కల్పించిన వాటిని చూచినప్పుడు, మ్యాజిక్ మంత్రగాళ్ళు కర్రను చూపెట్టి కాగితపు పూలు తీసినప్పుడు, తనను మాయ జేసి దోచుకున్నప్పుడు, ఇంట్లో పెట్టిన వస్తువు అవసరంలో ఎంత వెదికినా కనపబడనప్పుడు, పెదాలమీద మాటల్ని పేల్చుతున్న వాళ్ళను చూచినప్పుడు ఇలా అనేక సందర్భాలలో మాయ మాటను చెప్పి అంత మాయగా ఉందంటారు.

కాని మాయ అనే పదానికి శాస్త్రముల్లో అమోఘమైన అర్థమున్నది. మనల్నందరిని సృష్టించిన సృష్టి, ఈ ప్రపంచము మాయారూపమే. సృష్టిలోని ప్రతి పదార్థము, సమస్త ప్రాణులు మాయ నుండి వచ్చినవే. ఆ విధముగా మనమందరము మాయా మరమనుష్యులము.

పరమాత్ముని శక్తియైన మాయయమే ఈ సృష్టి లేక ప్రకృతి. ఇది కారణ కార్యరూపంలో ఉంటుంది. భగవానుని మాయా శక్తి జ్ఞానము, ఇచ్ఛా, క్రియ అనే అంశంలతో ఉన్నది. అంతేకాదు. ఈ మాయా శక్తికి మూడు ధర్మాలున్నాయి. అవే సత్త్వరజస్తతమో గుణాలు. మాయ త్రిగుణ రూపంలో వ్యవహరిస్తుంది.

"సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవా..." (భ.గీ.) ప్రకృతి వలన బుట్టినవి త్రిగుణాలు. సత్త్వరజస్తమ త్రిగుణాల వికారమే మాయ. సృష్టి అంతా త్రిగుణాత్మకము. మాయ పరమాత్మను ఆశ్రయించి ఉన్నది. కాని అది ఆత్మరూపుడైన పరమాత్మను బంధించినట్లు కనబడుతుంది. పరమాత్మ వీక్షించి తననుండి మాయను కల్పించాడు. ఇది స్త్రీ రూపం. మాయకు మరోపేరు ప్రకృతి. పురుషుడు తన నుండి స్త్రీ రూపాన్ని

వేరుచేసాడు, ప్రపంచ సృష్టి కొరకు. అందువల్ల స్త్రీ పురుషునిలోని సగభాగమైనది. దీనిని శివపార్వతుల ఏకరూపంలో చూడవచ్చును.

"మయ యోనిర్మహద్బ్రహత్మస్మిన్ గర్భందధామ్యహం...." (భ.గీ.) గొప్పదైన మాయ భగవానునికి గర్భస్థానము. అందు చైతన్య రూపమగు బీజముతో గర్భదానము చేయుచున్నాడు. అందుచేత సమస్త భూతములు ఉద్భవించినవి. ఈ విధముగా చరాచరజగత్తు అవిర్భవించినది.

మాయవల్ల ఉత్పత్తి అయిన మాయా ప్రపంచము ప్రళయ కాలములో పరమాత్మలో లయ మొందును. ఇది సూక్ష్మరూపంలో ఉండి మళ్ళీ కల్పారంభమున జనించును. శుద్ధ నిర్గుణ నిరాకార పరబ్రహ్మము నందున్న మాయ ఎరుపు, తెలుసు, నలుపు అనుమూడు వర్ణములతో మూడ రూపములుగా పుట్టెను. తెలుపు వర్ణం మాయా శక్తి. పరమేశ్వరుడు మాయ శక్తిని తన వశమందుంచుకొని బ్రహ్మావిష్ణు మహేశ్వర రూపములుగా వచ్చి సృష్టిస్థితిలయ కార్యములను ఒనర్చుచున్నాడు.

మాయాంతు ప్రకృతిం విద్యాత్....(శ్వేతా.ఉ.) మాయాశక్తియే ప్రకృతి. మాయోపాశుడైన ఈశ్వరుడు సకల జగత్తును సృష్టించాడు. పరమాత్మకు, జీవునకు ఉపాధిగా నుండిన మాయ అవిద్యారూపం. వాస్తవమునకు పరమాత్మకంటే భిన్నము కాదు మాయ. కాని మాయ భిన్నముగా కల్పించబడినది. మాయకు స్వరూపం లేదు. పరమాత్మకూడా నిరాకారుడు నిర్గుణుడు. నామ రూపములుగల జగత్తును కల్పించుట మాయపని. మాయకు చేతగాని తనములేదు. లేని దానిని ఉన్నట్లు కల్పించుట మాయ యొక్క చాతుర్యము.

"అఘటిత ఘటనా పటీయసే మాయా" పొందశక్యము కాని దానిని పొందినట్లు చేయుట మాయా సామర్థ్యము. ఏది లేదో అదే

మాయ 'యా' అంటే 'ఏది' 'మా' అంటే 'లేదో' 'సా ఏవ మాయ' అదే మాయ. "మాయా మయ మిద మఖిలం హిత్వా బ్రహ్మపదం త్వం ప్రతిశ విదిత్వా!" మాయా మయమైన అఖిల జగత్తు పరమాత్మ నుండి వేరుగా లేదు. అగ్ని నుండి దాహక శక్తిని వేరు చేయని విదముగా, ప్రపంచము ఎన్ని నామరూప బేధములు కలదైన బ్రహ్మముకన్నా వేరుకాదు. "ఏ కో దేవః బహుధానివిష్టః" ఈవిధముగా అనుకోవటానికి కారణం? మూల ప్రకృతియనే పరమాత్మ శక్తి, త్రిగుణ రూపమైన సృష్టికి కారణమైనది. దీనినే మాయ అని చెప్పబడినది. "మమ యాయా"నా యొక్క మాయ అంటాడు గీతాచార్యుడు.

మాయ చేత సృజింపబడిన జగతంతయూ మాయతో బాటు ఏదో ఒక రోజున, కల్పాంతమున పరమాత్మలో సూక్ష్మ రూపంలో విలీనమగును. ఈ దృశ్య జగత్తు మాయా ప్రపంచము. మాయచేత కల్పితమైన వికారములలో మొదటిది ఆకాశము. సమస్త జీవరాశులు ఆకాశమందు తిరుగుచున్నవి. "అకాశోఽస్తి" ఆకాశమన్నది సత్. సత్ పదార్థము వస్తు సంబంధముతో మారదు.

ఇంద్రజాలికుడు వినోదము కల్పించునప్పుడు వివిధములైన వస్తువులను కల్పించి చూపుతాడు. అవి ఉపయోగించుటకు పనికిరానివి. అదే ఇంద్రజాలము, కనికట్టు, మాయ. అదే విధంగా ఈ జగత్తుకుడా మాయామయము. చీకట్లో త్రాడును చూచి పామని భ్రమించును. తాడు పాము కాదు. ఆ విధమైన భ్రాంతి కలిగింది మాయ. సత్యాన్ని అసత్యముగా చెప్పుట మాయపని అందుకే అన్నారు "బ్రహ్మ సత్యం జగన్మిధ్యా."

మట్టి మట్టిగా ఉన్నప్పుడు దానిని కేవలం మట్టి అంటారు. అది కుండ ఆకారాన్ని పొందినప్పుడు దానికి రూపం నామం కల్పించబడినది. అదే విధముగా పరమాత్మకు రూపనామములు లేవు. కాని మాయ కారణంగా వచ్చిన జగత్తుకు రూపనామము లేర్పడినవి.

కార్యరూపములైన ఘటము అసత్యము. కారణమైన మృత్తిక సత్యము. ఈ విధముగా మాయచేత తయారు కాబడిన జగత్తు మిధ్యా. మాయకు కారణము ఆధారమైన బ్రహ్మం సత్యము.

"మాయమయ జాయ సుతా, కాయేంద్రియ మానసాదిక పరిత్యాగో పాయజ్ఞే యమేయ...." ఆలు బిడ్డలు, సంసారము, శరీరము, ఇంద్రియాలు, మనస్సు మొదలగునవి మాయా కల్పితాలు. మాయాశక్తి విలక్షణమైనది. పిండోత్పత్తి ప్రారంభమైన శరీరములో అవయవములు పెరిగి అందు జీవుడు ప్రవేశించి తగిన సమయములో జన్మించి. బాల్యము నుండి వార్ధక్యము వరకు ఉండే అనుభవాలు వికారములు మాయ పనియే. మనస్సుకు కలిగిన భ్రాంతి కూడా మాయయే. మాయాధీనుడు చిదాభాసుడు.

'మాయా మోహకరీ' మాయామోహితుడైన జీవునకు తన నిజరూపం తెలుసుకొనే అసమర్థత కలిగింది. అప్పుడు నా భార్యాపిల్లలు, సంసారము ధనము అనే మోహములోపడి శరీరమందు అభిమానం పెంచుకొని కష్టాలు కొనితెచ్చుకుంటున్నాడు. మాయలో మునిగి ఉన్న మనిషి మనస్సు యొక్క విషయ సుఖములకొరకు పరుగిడును. కార్యకలాపాలందు నిమగ్నమగును. ప్రాపంచిక సుఖాల కొరకు ప్రాకులాడే మనస్సు పారమార్థికతను గ్రహించలేదు.

మనస్సేమాయ, అందుకే అన్నారు, మాయదారి మనస్సని. మాయ మనస్సే మనిషి మనుగడకు కారణం. మాయ జీవుల్ని మత్తులో పడేసి ఆడిస్తుంది. త్రిగుణాల వ్యవహారమే మాయ మత్తు. దేవుడికి జీవుడికి మధ్య అతిశక్తివంతమైన అడ్డు (తెర) ఉంది. అదే త్రిగుణాత్మకమైన మాయ. ఈ అడ్డు తొలగేది కాదు. దాని నుండి ఏజీవి ఎట్టి పరిస్థితుల్లోను తప్పించు కోలేదు. మాయ వలలో పడి బందీ

అయ్యి దుష్కృత, సుకృత కర్మలుచేస్తూ చావుపుట్టుకలలో పడి పిసర పిసర కావల్సిందే.

మాయకు అనేక అర్థములున్నాయి. ఉన్నదానినిలేనట్టుగా లేనిదానిని ఉన్నట్టుగా చూపేదే మాయ. ఆకాశమంటే శూన్యము. కాని అది ఒక్కటున్నట్టుగా చూపుతుంది. ఎండమావులందు జలమున్నట్లు భ్రమిస్తుంది. ఆకాశము, భూమి కలిసి పోయినట్టు చూపుతుంది. అవిద్య వలన కలిగిన భ్రాంతిచేత అసత్యమగు జగత్తను సత్యముగా, బ్రహ్మముకంటే భిన్నముగా ఉన్నట్లుచూపేది మాయ. తంత్ర విద్యలచే, ఇంద్రజాలముచే, గారడిలో చేసే కనికట్టు వలె లేని దానిని ఉన్నట్టుగా భ్రాంతి కల్పించునది మాయ.

దంభము, మోసము మాయ లక్షణాలు. మారీచుడు, రావణాసురుని కోరిక మీద బంగారు లేడి రూపం ధరించి, లంకలో నున్న సీతకు భ్రమకల్పించి ఆమెను కష్టాల ఊబిలోకి నెట్టింది. అందుకే అది మాయలేడి.

ఈ కాలములో ఆడమగ తేడా లేకుండా మాయగాళ్ళు, మాయల మారిలు ఎక్కువై పోతున్నారు. మాయ ప్రభావము మనుష్యులపై అమోఘముగా పనిచేస్తుంది. అందుకే ఈనాడు ఎక్కడ చూచిన వంచనయే కనబడుతుంది. ప్రతివాడు ఎప్పుడో ఒకప్పుడు వంచన చేయటమే కాదు వంచింపబడుతున్నాడు.

వందరూపాయలు కడితే ఆరునెలల్లో వెయ్యి రూపాయలిస్తా మంటూ మధ్యలో లాటరీ వస్తే ముందే ఆడబ్బు ఇస్తామని రాసులుగ డబ్బు ప్రోగుచేసుకొని సమయంచూచి పరారైపోవటం. బ్యాంకులో దాచుకొన్న డబ్బు దోపిడికి గురి అగటం. నీళ్ళ దగ్గర నుండి అన్ని ద్రవపదార్థాలు, నిత్యావసర వస్తువులు కల్తీ చేయకుండా నికార్సుగా ఉంటున్నాయా? మత్తు పదార్థాలైతే సరేసరి. కల్తీ కానిది, కల్తీ

చేయబడనిది ఏముందీనాడు. పూర్తిగా మనుష్యులే కల్తీ అయిపోయి నారు. ఈ నయవంచన సమాజం మాయా మోహంలో పడి కొట్టుకుపోతుంది.

లోపలున్న దొకటి బైటకు చెప్పేదొకటి. సింహానికి ఆహారంగా కావలసిన నక్కటక్కరి ఉపాయముతో ఆ సింహాన్ని భావిలో పడేటట్టు చేసింది. నక్కజిత్తుల మనుష్యులు ఎందరు లేరు. నీవు నాకుబాగా నచ్చావ్, నిన్నే పెళ్ళాడుతా! అని తన వెంటబడి అమ్మాయిని పక్కకు బెట్టి, వేరే అమ్మాయిని అనుభవించి అక్కర తీరిన తరువాత ఆ అమ్మాయిని పెళ్ళాడకపోయిన కపటా చారి మాయ ప్రలోభములో ప్రవర్తించే నయవంచకుడు

మోసం, దగా, దంభము, వంచన వీటి మీద వ్రాసుకుంటూపోతే కొన్ని వాల్యూముల గ్రంధమౌతుంది. కారణం ఈనాటి నాగరక మానవులు నయవంచనలతో, మేక పులి వన్నెలతో, అభివృద్ధి పేరట ఆధ్యాత్మికతను మరచిపోయి అతి బౌతికపరంగా జీవనం సాగిస్తున్నారు. ఒంటికాలిమీద నడిచే ధర్మం కుంటిగా నడుస్తున్నది. ప్రస్తుతం కలియుగము ప్రధమ పాదంలోనే ఉన్నది. ఈ యుగ కాలం మరెంతో జరగవలసి యున్నది. అయితే కుంటికాలి ధర్మం ఇంకెంతో కాలం గెంత లేక పోవచ్చునేమో!

మాయకు మరో అర్థం రాజకీయ తంత్రము. ప్రపంచము ఎన్నో దేశాల సమూహం. అందులో కొన్ని ప్రజాపాలన దేశాలు. స్వాతంత్ర్యమున్న దేశాలు, రాజకీయ తంత్రము మీదనే నడుస్తున్నాయి.

భారతదేశం అతిపెద్ద ప్రజాస్వామ్య దేశం. ప్రజలే పాలకులు. పాలితులు. అందుకే ఎన్నెన్నో పార్టీలు. పదవుల కోసం నానా అగచాట్లు, ఒకరిని మించి మరొక పార్టీవారు అందలం ఎక్కటానికి నోటికి వచ్చినన్ని వాగ్దానాలు ఊదేయటం. నా ప్రాణం పోయినా ఫర్వాలేదు, ఇచ్చిన

వాగ్దానాలు నిలబెట్టుకోని ప్రజలకు కష్టాలు లేకుండా చేస్తా. ఉచితంగా విద్యుత్తేకాదు తిండి, బట్ట, నీడ అందరికి కల్పిస్తాము. అందరికి మంచి ఆరోగ్యము. అందుకు తగ్గట్టుగా మత్తు పదార్థాలను సులభంగా అందుబాటులో ఉంచుతాము. అందరికి ఉచిత విద్యా, ఇంటికోక ఉద్యోగము కాదు ఇంట్లో వాళ్ళందరికి ఉద్యోగాలు, చివరకు పిల్లలుకూడా సంపాదించుకొనే మార్గాలు చూపుతాము. అంతేకాదు ప్రతి ఒక్కరు వంద సం॥ దానికి పైబడి సుఖంగా జీవించే అన్ని ఏర్పాట్లు చేస్తాము. స్వర్గం మనం చూడలేదు. పుస్తకాల్లో చదివి 'అబ్బ' ఇన్ని సౌకర్యాలా అక్కడ జీవిస్తేఎంత బాగుండునో అనుకొంటాము. అంతకు మించిన స్వర్గాన్ని ఇక్కడ సృష్టిస్తాము. అందుకే నాకే మీ ఓటు వేసి గెలిపించమని చేతులతో బాటు కాళ్ళతో సహా దణ్ణం పెట్టేస్తారు.

పాపం! అంతస్థులో ఉండేవాళ్ళు, (నా.య.కు.లు) ఊరు వాడ అడవులు పట్టుకొని తిరుగుతున్నారు, ఏమి తింటున్నారో ఏమో! ఎండనక వాననక తిరుగుతున్నారు. ఎన్నో వాగ్దానాలు చేస్తున్నారు. అందులో కొన్నైనా చేయకపోతారని ఓటు వేసే రోజు ముందు చాటుగా ఇంతో అంతో, సీసాల్లో చీరల్లో స్వీకరించి పార్టీ గుర్తు మరీ గుర్తు పెట్టుకొని గుద్దుతారు ముద్ర. మూడో రోజుకు ఫలితాలు భళ్ళుమని బయటపడతాయి.

ఇక మొదలవుతుంది గెలిచిన పార్టీ వారి హంగామా. లేదు పది పార్టీల వాళ్ళకు సమానంగా సీట్లొస్తే, మొదలవుతుంది రాయబారం. అంతకు ముందు మురికి తిట్లు తిటుటకున్నవారు ఒకరి మీద ఒకరు దుమ్మెత్తిపోసుకున్నవారు, తన్నుకొన్నవారు, పదవుల కోసం పక్కా స్నేహితులై పోతారు. మొదలవుతుంది ప్రజా పరిపాలన. వాగ్దానాల చిట్టా తిరగేసి చూస్తే అందులో అమలయ్యేవి కనుచూపుమేరలో కనబడవు. అప్పుడు మొదలవుతుంది ఒకవంతు రాజకీయము.

పవరు పోయినోళ్ళు, పవరు పొందినోళ్ళ మధ్య ప్రారంభ మవుతుంది బాంబులు లేని యుద్ధం అసెంబ్లీ వేదికగా! అసలు విషయం పక్కకు పోయి వ్యక్తిగత విమర్శలు, కాదనుకోవటాలు, వద్దనుకోవటాలు, వీలైతే కుస్తీలు, సిగపట్లు, సామాగ్రి విరిగి పోవటాలు వగైరా. ఆ విధంగా ఎప్పటికప్పుడు అసెంబ్లీ రణరంగం సమాప్తం అవుతుంది.

ఇదంతా చూస్తున్నప్రజలకు ఏమీ పాలుపోక 'ఔరా నాయకులు! కాదు రాజకీయ నాయకులు అనుకొంటారు. వారి రాజకీయ తంత్రములో ప్రజల నెత్తిమీద కుచ్చుటోపి పెడుతున్నారు. వారి నెత్తిమీద పాలుపోసినట్లౌతున్నారు. ఈ విధమైన పాలన సాగటానికి కారణం మాయ ప్రభావమే. అందుకే రాజకీయ తంత్రం అంటే మాయ అని చెప్పబడినది.

ప్రపంచంలో దేనినైనా సాధించవచ్చు నేమో గాని! మాయను వశపరచుకోవటం బ్రహ్మకైనా తరంకాదు. మనల్ని సృష్టించిన బ్రహ్మ కూడా మాయ మూలంగా జన్మించినాడే. అయితే మాయను జయించే మార్గమే లేదా? ఉపాయమే లేదా? అంటే ఉంది అంటుంది గీత.

"దైవీ హ్యేషా గుణమయీ మామ మాయా దురత్యయా
మా మేవ యే ప్రపద్యంన్తే మాయా మేతాం తరాంతితే" (భ.గీ.)

దైవ సంబంధము, త్రిగుణాత్మకము అయిన మాయ దాట శక్యము కానిది. అయినా! నన్ను శరణు వేడిన వారు ఈ మాయను దాటగలరు. భగవానుని త్రికరణ శుద్ధిగా శరణు వేడితే అప్పుడు మాయ మటుమాయం అవుతుంది.

"అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ!
తస్మాత్కారుణ్య భావేన రక్ష రక్ష మహేశ్వర"

యే ప్రభూ! పరమేశ్వరా, నీవే నాకు శరణం, నాయందు కరుణ చూపి నన్ను రక్షించు అని భగవానుని సర్వసాక్షిగా, త్రికరణ శుద్ధిగా ప్రార్థించు అప్పుడు నీ మొర ఆయన ఆలకించి తన మాయను తప్పిస్తాడు.

మాయ దైవశక్తి. అది బహిర్గతమై సత్వరజోతమో గుణములతో కలిసి దృశ్య నామ రూప జగత్తును సృష్టించింది. కనుక "మమ మాయ దురత్యయా" నా మాయ దాట శక్యము కానిది అన్నారు. అయితే ఒక షరతు పెట్టారు. "మామేవయే ప్రపద్యంతే" నన్ను శరణు కోరితే "తరన్తితే" మాయను దాటతావు. శరణాగతికి ఎంతశక్తి ఉన్నదో తెలుస్తున్నది. అందుకే శరణన్న వాడిని శత్రువు కూడా కనికరిస్తాడు. అందుకే స్వామియే శరణమయ్యప్పా, స్వామి శరణం, అన్ని భక్తులు భగవానుని నినదిస్తారు.

మాయ శక్తి ఎంత పవర్‌ఫుల్ అంటే మానవులే కాదు, దేవతలు, మహర్షులు చివరకు త్రిమూర్తులు కూడా మాయాశక్తి నుండి తప్పించుకోలేరు. మాయలో చిక్కిన వారు చేయరాని పనులుచేసి శాపగ్రస్తులై పడరాని పాట్లు పడ్డారు.

మాయ పవర్ ఏమిటో తెలుసుకోవాలని త్రిలోక సంచారి, బ్రహర్షి అయిన నారదునకు కోరిక కలిగినది. శ్రీకృష్ణుని వద్దకు పోయి 'అయ్యా నీ మాయ శక్తి ఏమిటో తెలుసుకోవాలని ఉంది' అంటాడు. 'నారదా! అది ప్రమాదకరమైనది వద్దు' అంటాడు. ఒక్కసారి అందులో పడ్డావా! పైకి తేలవంటాడు. అయినా నారదునికి మాయచేష్టలు తెలుసుకోవాలనే ఉబలాటం చావలేదు. మళ్ళీ అర్థిస్తాడు. భగవానుడు "నీ కర్మ అనుభవించు" అంటాడు.

నారదా! నాకు దప్పికగా ఉంది ఊరులోకి పోయి నీళ్ళు తీసుకురా అంటాడు. నారదుడు ఒక ఇంటికి వెళ్ళాడు, మంచి నీళ్ళు అడిగాడు, ఒక రూపలావణ్య ముగ్ధ మనోహరి తనముందు నిల్చింది. అంతే నారదునకు కళ్ళు తిరిగాయి ఆ అందం చూచి. ఆ రూపంలో కరిగి పోయిన నారదుడు ఆమెను సొంతం చేసుకోవాలనుకొన్నాడు.

ఏవేవో తంటాలు పడి ఆమెను వివాహం చేసుకొన్నాడు, సంసారి అయ్యాడు, పిల్లలు కలిగారు, కుటుంబ జీవనం సాగిస్తున్నాడు. ఒకరోజు

పెద్ద తుఫాను వచ్చింది. అందులో తన భార్య పిల్లలు కొట్టుకుపోయారు. దిగాలుగా ఏడుస్తూ కూర్చున్నాడు. ఇంతలో మాయల మారి కృష్ణుడు వచ్చాడు. భుజం మీద చెయ్యివేసి "నారదా! మంచి నీళ్ళెక్కడ అన్నాడు" మంచి నీళ్ళేమిటన్నాడు నారదుడు "మమ మాయా దురత్యయా" అన్నాడు భగవానుడు.

యోగమాయ శక్తితోనే తనుతాను సృజించుకున్నాడు శ్రీకృష్ణుడు. బలరాముణ్ణీ, అయన్ను గోకులం చేర్చి కాపాడింది యేగమాయనే. తరువాత శ్రీకృష్ణుని ఆనతిని వివిధ రూపాలలో యోగమాయ పూజలందుకొంటుంది.

మాయ శక్తి, దాని మర్మం తెలుసుకొన్నాక వివేక వంతుడైన మనిషి సాధించవలసినది మాయ బంధము నుండి విముక్తి. సమస్త జీవులు పుట్టుటకు మర్మ స్థానము మాయ. మాయలేనిదే ఎవరం లేము. వ్యవహారం ఏదిగాని మాయ చేతనే జరిపింపబడుతున్నది.

ఆపదలో ఉన్న గజేంద్రుడు, ద్రౌపది మొదలగువారు, రామదాసు పోతన వంటి భక్తులు, జ్ఞానులు భగవంతుని శరణు కోరుకుంటారు. భగవానుని చరణాల వద్ద ఇంత చోటు ఇవ్వమని వేడుకుంటారు, దుష్ట కర్మల నుండి రక్షణ కోరతారు. యయాతి అంజనేయుని శరణు వేడి ప్రాణాలు దక్కించుకొన్నాడు. గయుడు అర్జునుని శరణుజొచ్చి కృష్ణుని ప్రమాదము నుండి బయటపడ్డాడు. ఇప్పుడు కూడ ఎందరో శరణార్థులు ఇతర దేశాల నుండి శరణు కోరుతున్నారు. కనుక సమస్తలోకాలకు ఆశ్రయుడైనవాడు, సర్వజగత్తును రక్షించే పరమాత్మను శరణు వేడు ఆయన స్థానం దొరుకుతుంది.

దాటశక్యము గాని దైవమాయను, జీవుల చావుపుట్టుకలు కార్యరూపమైన మాయనుండి రక్షించబడాలంటే, ఎవరుగాని మనసా

వాచా, కర్మణా ఆ పరమాత్మను శరణు కోరటము, అప్పుడు ఆ జీవి లక్ష్యము నెరవేరక పోదు.

యదార్థాన్ని, సత్యాన్ని చెప్పే వారే కాదు అ విధముగా నడచుకనేవారు మహాత్ములే. వారిలో మాయ మర్మములుండవు. మాయా సంసారంలో పడి నాది, నేను అనే భావనతో ప్రవర్తించుతారు, మాయా సుడిగుండము నుండి ఎప్పటికి బయట పడలేరు. జీవుడు పరమాత్మను చేరుటకు మాయ అనే అభౌద్యమైన కంచు కట్టడము అడ్డముగా ఉన్నది. ఈ గోడను ఛేదించడానికి శరణాగతితో బాటు భక్తి జ్ఞాన వైరాగ్యముల ద్వారా దుర్భేద్యమైన మాయ పొరలను చీల్చికొని ఆవల ఉన్న పరమాత్మను గాంచవచ్చును.

# 3. వాంఛితార్థము

మానవ ప్రవృత్తికి ప్రేరణయే కోరిక అన్నారు పెద్దలు. ప్రతిప్రాణికి కోరిక కలగటం సహజము. కాని మానవుల కోరికలకు ప్రత్యేకత ఉన్నది. అవసరమయింది, లభించిన దానితో తృప్తి పడక, అభివృద్ధి చెందాలనే ప్రేరణతో విజ్ఞాన పథములో మానవులను ముందుకు నడిపిస్తుంది కోరిక.

అడక్క పోతే అమ్మయిన పెట్టదన్నటు, మనిషికి కోరికలే లేకపోతే భౌతిక పరంగా ఎదగలేడు. తాను ఉన్నత శిఖరాలు అధిరోహించాలనే తపన లేకపోతే ఎక్కడ వేసిన గొంగలి అక్కడే అన్నట్టుంటుంది మనిషి జీవితం.

మనిషి మంచె చెడ్డలు, జయాపజయాలు ఆ మనిషి కోర్కెలపై ఆధారపడి ఉంటాయి. కోర్కెలో శక్తి లేక పోయినట్లయితే మనిషి మనిషిగా ఉండి పోయేవాడు. నాగరిక మానవుడు కాలేకపోయేవాడు. అప్పుడు మనిషకి జంతువుకు తేడా లేకుండా పోయేది. మానవుడు అన్ని జీవుల మీద ఆధిపత్యం సంపాదించటానికి కారణం అతనిలో ఉన్న బలీయమైన కోర్కెలు.

కోర్కె కలగడం జీవులకు సహజమైతే మనుష్యులకు ఎలాంటి కోర్కెలుండాలి? పరిమితమైన, ధర్మబద్ధమైన కోర్కెలే ఉండాలి. అప్పుడు మానవుడు ఉన్నత మార్గంలో పురోగమిస్తాడు. ధర్మవిరుద్ధమైన కోర్కెలుంటే ఆలస్యముగానైనా నాశనము గాక తప్పదు అన్నారు. పెద్దల మాటలు సద్ది అన్నం మూటలు. కట్నం డబ్బుతో కోడలి పిల్లని కొనితెచ్చుకోవటం అధర్మమే కాదు చట్ట విరుద్ధము. ఇది ఆశకు అంకురము. ఆశ అనర్థానికి హేతువు. పరిమితమైన కోర్కెలుండటం మనిషి పురోగతికి చిహ్నం.

కోరిక, ఆశ, అత్యాశ, దురాశలకు అర్థాలను అర్థం చేసుకోని

ధర్మ బద్ధముగా నడిచేవారు సంతోషముగా జీవిస్తారు. ఆశను పాశముతో పోలుస్తారు. అత్యాశపరులు ఎన్ని సిరిసంపదలతో ఉన్నా తృప్తిగా జీవంచలేరన్నది అనుభవం చెప్పే పాఠం.

ఒక బాటసారి అడవి దారిన పోతుండగా ఒక చెట్టునుండి "నీకు బంగారం ఐదు గోతాలు కావాలా'అన్న మాటలు వినిపించాయి. అటుఇటూ చూస్తే ఎవ్వరూ కనబడలేదు. 'కావాలన్నాడు"అయితే ఇంటికెళ్ళి చూసుకో అన్న మాటలు మళ్ళీ వినబడ్డాయి. పరుగు పరుగున ఇల్లు చేరుకొన్నాడు. ఇంట్లో 5 గోనే సంచులు చూసాడు. ఒకటి విప్పిచూసాడు బంగారు నాణాలు కనబడ్డాయి. కానీఐదో సంచి ఖాళీగా ఉంది. దానిని కూడా బంగారు నాణాలతో నింపాలని రాత్రింబవళ్ళుకష్టపడి ఎన్నో రీతుల దానిని పూడ్చటానికి ప్రయత్నించాడు కాని అది నిండలేదు. దిగాలు పడిపోయాడు. ఏం చెయ్యాలో అనే ఆలోచనలోపడి నిద్రాహారాలు లేకుండా జేసుకొన్నాడు.

ఈయన్ని గమనించిన మిత్రుడు 'కొంపదీసి ఐదు బంగారు గోతాలు కావాలని అడిగినట్టున్నావు"అన్నాడు. బాటసారికి ఆశ్చర్యం. ఇది నీకెట్టా తెల్సింది అన్నాడు. నేనుకూడా ఇదే సంఘటన ఎదుర్కొన్నాను అన్నాడు. ఆ బంగారు నాణాలు ఖర్చుపెట్టుకోవడానికి పనికి రావు, ఇంకా కూడబెట్టటానికి 5వ గోతం ఎప్పుడూ నిండదు. ఇది గ్రహించిన బాటసారి వీటిని ఇచ్చిన వానికే ఇచ్చేస్తాడు. ఉన్నవాడు ఇంకా దాన్ని పదింతలు చేయడానికి పూనుకుంటాడు. ఈ కథ ఆశ అంటే ఏమిటో చెబుతుంది కదూ?

కోరికలు జీవులకు పుట్టుకతోనే వస్తాయి. ఎన్నో జన్మలు గడచిన తరువాత కోరికల పర్యవసానము తెలుసుకొని వాటిని అధిగమించ డానికి ప్రయత్నించాలి. ఈ నగ్న సత్యాన్ని గ్రహించని మానవడు చచ్చి పుడుతూనే ఉంటాడు. ప్రపంచములో ఏ మూలను జూచినా భౌతిక పరమైన వాంఛలతో మనుష్యులు నిండా మునిగి ఉన్నారు. తీరే కోర్కెలే కాదు

తీరని కోర్కెలను తీర్చుకోవటానికి యమయాతనలు పడుతున్నారు. కలిగిన దానితో తృప్తి పడేవారు కరువైపోయారు.

కోర్కెల రెండవ పార్శ్యం చూద్దాము : - "కామ ఏష క్రోధ ఏష రజో గుణ సముద్భవః" మనిషి పాపాలు చేయటానికి కామక్రోధాలే కారణం. ఇవి "రజోగుణ సముద్భవం". రజో గుణము వల్ల కలిగినవి. కామమే (ఆశ) జీవునికి భయంకరమైన శత్రువు. కామక్రోధాలు అన్నదమ్ములు, ఎప్పుడూ విడిపోని జంట. రాగద్వేష ప్రతిరూపాలు కామ క్రోధాలు. అరిషడ్వర్గాలలో కామానికి ప్రథమ స్థానం లభించింది. ఇది అసురగుణములో నాయకుడు. క్రోధము ఉపనాయకుడు. జీవుల మోక్షానికి మహా ప్రతిబంధకాలు. కామం కుంభకర్ణుని లాంటి తిండిపోతు.

"కామ రూపేణ కౌంతేయ దుష్పూరేణా నలేనచ"... కుంతి కుమారా కామము ఎన్నటికి తరగనిది. అగ్నివలె తృప్తి చెందనిది. అట్టి కామముచే (కోరిక) జ్ఞానము కప్పబడినది. కామానికి ఒక్కరూపం కాదు, విశ్వరూపాలున్నాయి. చిల్లుకుండలో నీళ్ళు పోసి నింపలేము. అట్లే ఆశను కూడా తృప్తి పరచలేము. ఇంద్రియ సుఖములను అనుభవించుటలో ఆశ ఎన్నటికి తృప్తి చెందదు. ఒక కోరిక తీరితే వెంటనే మరో కోరిక వచ్చి కూర్చుంటుంది. దేనిని కాదనలేము. అట్లాగని ఆ కోరికను పక్కన పెట్టలేము.

కామానికి (కోరికలకు) కళ్ళు, ఒళ్ళు రెండు లేవు. కాని అందరి కళ్ళు, ఒళ్ళు దానివే. దీనికి "తృప్తాసి" లేదు. నిప్పు అంటుకున్నాక దాని అంతంజూచి బూడిదను మిగుల్చుతుంది దాని అనవాలుగా. కామము అగ్నికి బాబు. బూడిద అనవాలన్నా మిగులుస్తుంది నిప్పంటుకుంటే. బలమైన కోర్కె కలిగిందంటే దానిని అనుభవించిన తరువాత అనవాలు కూడా లేకుండా చేస్తుంది. కామం అత్యాచారం జేసి శవాన్ని నామరూపాలు లేకుండా చేస్తారు కామాంధులు.

నేటి ప్రపంచ మానవుల ప్రవర్తన పరిశీలిస్తే ప్రతివాడు లేక ప్రతిది ఇంచుమించు ఒక్క కోర్కెతే కాదు గంపెడు కోర్కెలతో ఉంటూ ఈ గంప ఎప్పుడు నిండుతుందా అని చూస్తున్నారు. అదెప్పుడు నిండుకోవాలి? ఎప్పటి కప్పుడు అందులోకి వచ్చిపడుతుంటే అది చిల్లులున్న ఒక గంప అందులో నీళ్ళు పోస్తే ఏమవుతాయి. అలాగేగుండె నిండా కోర్కెలు నింపుకొన్న కామార్తులకు, భగవానుని నిలపటానికి ఆ గుండెలో చోటులేదు.

అందుకే చెప్పారు జీవులకు కోర్కెలే నిత్యశత్రువులని. ముఠాకక్షలు, ఆ నాయకుడు పోయినాకైనా అవి తగ్గుతాయి. కాని ఈ కోర్కె శత్రువు ఈ జన్మతోనే సరిపుచ్చుకోదు, జన్మజన్మలకు వెంటాడుతూనే ఉంటుంది. దానికి దయాదాక్షిణ్యాలు లేవు. ప్రాణుల్ని తన బాహువుల్లో బంధించుకొని ఉంటుంది. దీని హస్తాలు ఆకాశం అంత ఎత్తు ఉంటాయి. అందుకే ఇవి "జ్ఞానినా నిత్యవైరిణా" జ్ఞానం వున్న మనుష్యులకు కామపిశాచి ఎల్లప్పుడూ ఉండే శత్రువు. అందుకే జ్ఞానులు వీటిని ఎట్లా వదలించుకోవాలని శతవిధాల ప్రయత్నిస్తారు.

జీవుల్లో ముఖ్యంగా మనుష్యుల్లో ఈ కోర్కెలు ఎక్కడ దాక్కొని ఉంటాయి అంటే "ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాది స్థాన ముచ్యతే" కోర్కెలకు ఆశ్రయ స్థానములు ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి. కామ వాసనలు బుద్ధిలోపల చిత్తమందు అణిగి యుండును. కామ స్థానము మానవ శరీరములో ఎంత లోతులో నున్నదో చూడండి. పంచ జ్ఞానేంద్రియము లందు, బొడ్డు దగ్గర ఉన్న బుద్ధియందు, హృదయమందున్న మనస్సు నందు. ఈ స్థానాలలో పట్టు సంపాదించి జీవుని అజ్ఞానిగా జేయుచున్నవి. జీవించటమే అజ్ఞానం. అజ్ఞాన జీవనం తెలుసుకోవటమే జ్ఞానము. ఆత్మజ్ఞాని పరమాత్మను చేరును.

మనుష్యుల్లోని ఇంద్రియ మనోబుద్ధుల స్థావరాలను ఆక్రమించుకొని పట్టుసాధించి, జీవుల్ని తన పిడికిల్లో పెట్టుకోవటానికి

ప్రయత్నిస్తుంది కామరాక్షసి. మనిషిలోని ఆత్మజ్ఞానాన్ని తొక్కిపెట్టేస్తుంది. వారిని ప్రేమాను రాగాల్లో, మోహ బంధాలలో బంధిస్తుంది కామం. ఇంతగా మనిషిలో వ్రేళ్ళూన్చిన కోర్కెలను బయటకు లాగాలంటే బుద్ధి ద్వారం అడ్డంగా ఉంది. ఎలాగో ప్రయత్నించి ఈ ద్వారం నుండి బయటపడితే మనో ద్వారంలో ప్రవేశిస్తుంది. ఇందులో నుండి అంత తేలికగా బయటకు రాదు ఈ కోర్కెల వలయం.

ఏమైనా సరే కోర్కెల వలయాన్ని చేధించటానికి భగీరథ ప్రయత్నము చేసి బయట పడగలిగితే, ఐదు ద్వారాల ఇంద్రియ అంతః పురంలో తిష్టవేస్తుంది. ఈ ద్వారాలు ఉక్కులాంటివి. ఇవి ఒకదానిని మించి మరొకటి బలంగా ఉంటాయి. అంతటి శక్తివంతమైన ఇంద్రియాలను నిర్భందించాలంటే సాధకుడు ఎలాంటివాడుగావాలో మనం ఊహించవచ్చు. అంటే మానవుల్లో నూటికి కోటికి కాదు, బిలియన్స్‌లో ఒక్కడు కూడా కనబడడు.

ఎంతటి మహాజ్ఞానియైన కామావరణములో ఎప్పుడో ఒకప్పుడు చిక్కకుండా పోడట. కోర్కెలకు బయట స్థావరాలు పనికిరావు. అందుకే మనిషి అంతరంగములో స్థానం సంపాదించుకొన్నాయి. అక్కడకు యముడు కూడా రాలేడని స్థావరాలు ఏర్పరచుకొని మనుష్యుల్ని ఇష్టం వచ్చినట్లు డాన్సులు చేయిస్తున్నాయి. కనుక కోర్కెల పవరేమిటో ఇప్పటికైనా అర్థమయిందా!

ఒక సంసారి వద్ద విచిత్రమైన ఒక బాతు ఉన్నది. అది రోజుకొక బంగారం లాంటి గ్రుడ్డు పెడుతుంది. దానిని విక్రయించి జీవనం సాగిస్తున్నాడు ఆ సంసారి. జీవితం ఎదుగు బోదుగు లేకుండా ఉన్నది. ఒక్క గ్రుడ్డుతో ఎంతకాలం ఇలా బాధ పడాలని బాతు పొట్టనిండా ఎన్నో బంగారం లాంటి గ్రుడ్లున్నవి కాబట్టి అవన్నీ ఒక్కసారిగా తీసుకొని ధనవంతుడై పోవాలని ఆశపడ్డాడు. అంతే బాతును తెగ్గోసాడు. ఇంకేమున్నది ఆ రోజు గ్రుడ్డు ఉన్నది. మిగిలినవి రక్త మాంసాలే. అది

చూచి బావురుమన్నాడు. తన అత్యాశకు కుమిలిపోయాడు. ఈ కథ కోర్కెల పవరేమిటో చెబుతుంది.

''కామక్రోధ వియుక్తానాం'' కామ క్రోధములను జయించినవారు. కామక్రోధాలకు తృప్తి శత్రువు. మానవులు చెడ్డపనులు చేయటానికికోర్కెలే మూలకారణం. అరిషడ్వర్గాలలో మొదటి స్థానం ఆక్రమించి, పురుషార్థాలలో 4వ స్థానంలో ఉన్న మోక్షానికి ప్రతి బంధకముగా ఉన్నాయి. వీటికి సరైన మందు వైరాగ్యం. తొమ్మిది వైరాగ్యాలలో ప్రౌఢ వైరాగ్యమే దీని రోగం కుదర్చగలదు. నేటి నాగరిక మానవుల్లో కోర్కెలేని వారు అంటే ధర్మ విరుద్ధములైన కోర్కెలు లేని వారున్నారా? ఉన్నారంటే నమ్మలేము.

ఆధ్యాత్మిక పరంగా చెప్పాలంటే మనిషి దైవాన్ని పొందటానికి కోర్కెలు కలిగి ఉండాలి. అంతేగాని ప్రాపంచిక సౌఖ్యాలను అనుభవించ డానికి కాదు. మనిషిలోని ఆశ అణగారినప్పుడు శాంతికి మార్గమేర్పడు తుంది.

'ప్రహతి యదా కామాన్ సర్వాన్ పార్థా మనోగతాన్'' పార్థా! మనుజుడు తన మనస్సులో నున్న కోర్కెలనన్నింటిని త్యజించునో అప్పుడు సంతుష్టుడౌతాడు. కోర్కెలు మనస్సు యొక్క పొరలలో వాసనా రూపంలో నుండును. కనుక మనస్సులో ఏ మూలన దాక్కొన్న చిన్న కోరికనైనా సాధన చేత ఏరి పారెయ్యాలి. అప్పుడు మనిషి సంతుష్టుడౌతాడు, శాంతికి చేరువులో ఉంటాడు.

కోర్కెలే జన్మకి కారణం. ఈ జన్మలో మిగిలిపోయిన కోర్కెలు తీర్చుకోవటానికి మరో శరీరం వస్తుంగి. అదే "అంత కాలేచ మామేవ స్మరన్'' అవసాన కాలమందు భగవంతుని స్మరిస్తూ ప్రాణాలు వదిలితే ఆయన స్థానం లభిస్తుంది. లేదంటే పోయిన తరువాత మరో బాడీలో చేరిపోతావ్.

మనిషికి కోర్కెలు కలగటం సహజం. ఎవ్వరూ దీనిని కాదనరు. కాని ఆ కోర్కెలు ధర్మయుతముగా ఉండాలి. ఆశల పందిరిలో పడి అంతం కావద్దు. దీనినే పదే పదే చేబుతుంది శాస్త్రము. అనుభవం కూడా అదే. కనుక ఇకనైనా తెలుసుకొని ఆశలు పెంచుకోవద్దు. ఉన్న వాటితో తృప్తిగా బతకటం నేర్చుకో.

# 4. కర్మానుష్ఠానము

"కర్మణ్యే వాధి కారా స్తే మాఫలేషు కదాచన।
మా కర్మ ఫల హేతుర్భూర్మాతే సంగో ఽస్త్వ కర్మణి॥" (భ.గీ.)

కర్మలను చేయుట అందే నీకు అధికారము కలదు. వాని ఫలితంపై నీకు అధికారము లేదు. నీవు కర్మ ఫలమునకు కారణం కారాదు. అట్లని కర్మలు చేయుట మానరాదు.

కర్మ రహస్యమంతా ఈ శ్లోకంలో చెప్పబడినది. సర్వ సాధారణముగా చదువు వచ్చి రాని వారు కూడా ఏదో సందర్భములో ఘంటసాల పాడిన ఈ శ్లోకాన్ని విని వుంటారు. విద్యాధికులు ఈ శ్లోకాన్ని సందర్భానుసారము ఉటంకిస్తారు.

సర్వసామాన్యంగా అనుకున్నది జరగనవడం బాధ అనిపించినప్పుడు కర్మ కర్మ అంటూ కొందరు నెత్తి బాదుకుంటారు. తలపెట్టిన కార్మము జరగటానికి కలిగిన ఆటంకాన్ని కర్మగా భావిస్తారు. నిజానికి కర్మ పదం అర్థం అది కాదు. కర్మ అనే రెండక్షరాల పదం గీతా శాస్త్రములో అమోఘమైన అర్థంతో నిండియున్నది.

రామ, కృష్ణ, సీత, రాధ, తల్లి, తండ్రి, గుడి, బడి అనే రెండక్షరాల మాట గొప్ప భావనతో కూడుకొన్నవి. చదువుకు మూలం అక్షరాలు, వాక్యాలు. వాక్యం కర్త, కర్మ క్రియలు కలిగినది. చేసేవాడు, అనుభవించేవాడు, చేసేది మూడవది కూడా కర్మ రూపమే. కర్మ అనే సంస్కృత పదం తెలుగులో క్రియ అని అర్థం. అంటే ఏదైన గాని చేసేది. క్రియతోనే అన్ని పనులు జరుగుతాయి. కనుక కర్మకు ఎంతటి మహత్తు ఉందో తెలుస్తుంది.

జ్ఞాన విజ్ఞాన సంపత్తి కలిగిన భగవద్గీత ద్వాపరయుగం ఆఖరి దశకములో ఆవిర్భవించినది. ఇంతకు ముందు కృత, త్రేతాయుగ,

ద్వాపరంలో మూడువంతుల కాలం కరిగి పోయినది. ఆ యుగ మానవుల విధి విధానాలు, నడవడికలు వివిధ శాస్త్రాలు తెలియజేస్తున్నాయి.

ఆ కాలపు మానవులు కూడా కర్మలను వివిధ రీతుల్లో ఆచరించారు. అయితే వారు అవలంబించిన విధానము రెండు విధాలుగా ఉన్నది. ఒకటి కర్మ ఫలమును ఆపేక్షించి కర్మలు చేసే ప్రాపంచిక సంస్కారము గలవారు. రెండు ఆ కర్మ ఫలాన్ని త్యజించి సన్యసించిన వారు. వీటికి తోడుగా మూడవ తరగతిని గీత లేవనెత్తినది. అది ఎవరైనగాని కర్మలు చేస్తూ దాని ఫలితాన్ని అపేక్షించవద్దని దాని వలన కర్మ పవిత్రయై చిత్తము శుద్ధికాగా జ్ఞానం లభిస్తుందని చెప్పబడింది.

భగవద్గీత కర్మను గూర్చి బహువిస్తారముగా చెప్పటమే కాదు అత్యంత ప్రాధాన్యతను ఇచ్చినది. అందు మొదటి తాంబూలంగా ప్రధమ అధ్యాయము నుండి 6వ అధ్యాయం వరకు కర్మయోగాన్ని విశేషించి విశదపరచినది.

ప్రతి మనిషి కర్మలు చెయ్యాలి. కర్మ ఫలాన్ని అధికారకంగా పొందలేక పోవటాన్ని, కర్మ ఫలాన్ని ఆశించవద్దని. అట్లాగని కర్మలు చేయుట మానకూడదని.

దీనిభావం ఒకదానికి ఒకటి విరుద్ధముగా కనబడుచున్నది. అహా! నాకు కాదు మీకు కూడా తెలియక అడుగుదాము! పని చేసేది ఫలితాన్ని పొందటానికే కదా! అది కూడా తాను అనుభవించటానికే కదా! ఫలితం రాదంటే ఎవరైనా పనులు చేస్తారా? ఏ పని పాటు లేకుండా (ఫలితం) పైసలు ఎలా వస్తాయాయని శత విధాల ప్రయత్నించే లక్షలాది జనం ఉన్న ఈ రోజుల్లో పని చెయ్యి, ఫలితం ఆశించవద్దనే సిద్ధాంతము ఎంతవరకు వర్కౌటవుతుంది?

ఒళ్ళు అలవకుండా కూర్చున్న చోటునుండి కదల కుండా

పెదాలతో మాటలు పొర్లిస్తూ జేబులు నింపుకొనే పెద్దమనుష్యులున్న ఈ నాగరిక కాలంలో పాతబడిన ఈ సిద్ధాంతము రాద్ధాంతముగా కనబడుతుల్లా! అవును అనే అనాలి.

కర్మ రహస్య మేమిటంటే? కర్మ ఫలము ఈశ్వరాధీనం. ప్రకృతి నియమానుసారము ప్రతిపనికి ఎప్పుడెంత, ఎప్పుడు రావాలో అప్పు డొస్తుంది. తొందరపడి ఎక్కువ తక్కువ ఆశించినా రాదట. తగిన ఫలితం, అది ఏది గాని వచ్చి తీరుతుందట. ఈ చిన్న కిటుకు తెలుసుకున్న వారు ఫలితం గూర్చి అంత ఆరాటపడరు.

నిజానికి కర్మఫలం కర్మకంటే భిన్నం కాదు. వర్తమానంలో చేసిన కర్మకు భవిష్యత్తులో కర్మ ఫలం దొరుకుతుంది. వాస్తవానికి ఒక క్రియ తన ప్రతి క్రియలోనే సమాప్తమౌతుంది. రాబోయే ఫలం ఆశతో మనస్సును కలవర పరచుకోవటం వర్తమానాన్ని తప్పించుకొని భవిష్యత్తులో బ్రతకడమే అవుతుంది.

కర్మలు అనేక విధాలుగా ఉన్నాయి. 1. నిత్యనైమిత్తిక కామ్యకర్మలు, 2. కర్మ, వికర్మ అకర్మలు, 3. అగామి సంచిత ప్రారబ్ధ కర్మలు, 4. సంకల్ప వికల్ప కర్మలు, 5. పాపుణ్య కర్మలు, 6. విద్యుక్త కర్మలు, 7. నిషిద్ధ కర్మలు, 8. ఆచార అనాచార కర్మలు మొదలగునవి అయా సందర్భాన్ని బట్టి వాటిని చెబుతారు.

మనుష్యులు ఏయే పనులు ఎవ్వడు ఏ విధముగా ఆచరించాలి, ఆచరించకపోతే వచ్చే అపచారమేమిటి? ఆచరిస్తే కలిగే ఫలమేమిటి ఏయే కర్మలు బంధిస్తాయి. ఏ కర్మలు ముక్తి మార్గాన్ని చూపిస్తాయో కర్మ యోగములో భగవద్గీత వివరంగా చెప్పింది.

పని చెయ్యి చెయ్యి అని వేధిస్తారు. అసలు నాకు పనిచేయటం ఇష్టం లేదు. ఏ పని చేయకపోయినా నా సాపాటుకు ఏలోటు లేదు,

హాయిగా బ్రతకగలను అనవచ్చును. అలాగనే వారు ఉండకపోరు. అందుకు సమాధానంగా గీతాశాస్త్రం ఏమి చెబుతుందో చూద్దాము.

"నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠష్య కర్మ కృత్".......(భ.గీ.)

కర్మ చేయకుండా ఎవరు గాని (జీవుల) క్షణ కాలమైన ఉండలేరు. ప్రకృతి వలన బుట్టిన గుణములచే ప్రతివారు బలత్కారముగనైనా కర్మలు చేయును.

భౌతికంగా కర్మ త్యాగము అసాధ్యమంటున్నారు గీతకర్త. కారణం? భగవానుని రూపమగు ప్రకృతి తన గుణములచే ప్రతిజీవి చేత కర్మలు చేయించును. అందుచేత మానవులే కాదు సృష్టిలోని ప్రతిప్రాణి తాను కర్మలు చేయుచుండును.

సృష్టిలో జీవమున్న ప్రతిది కర్మలు చేయటం అనివార్యము. ఇది ప్రకృతి శాసనము. కర్మయే జీవిధర్మము. బ్రతకాలంటే పనులు చేయాలి. పనిచేయకపోతే జీవనం జరుగదు. అందుచేత 'నహికశ్చిత్ క్షణమపి" ప్రతివారు పనిచేయకండా క్షణ కాలం కూడా ఉండలేరు. శారీరకముగా పని చేయకపోవచ్చు. మానసికమైన ఆలోచనలు కూడా కర్మ రూపమే.

శరీరంలో ఎప్పుడూ కర్మ జరుగుతూనే ఉంటుంది. తినటం, తిరగటం, మాట్లాడటం, నిద్రించడం మొదలగునవి అందరూ చేసేవే. ఇవి తప్పకుండా జరిగేవి. కర్మచేయటం ఆగిపోయిందంటే అది మరణించినట్లే. మనుష్యులందరూ 24 గంటలు ఏదొక పనిచేస్తూనే ఉంటారు. దీనికి కారణం ప్రకృతి సహజహమైన ప్రవృత్తి.

దేహం మారితే కర్మ విధానము మారుతుంది తప్ప కర్మకు విశ్రాంతి ఉండదు. జీవుల్లో ఉన్న సత్త్వరజతామస ప్రవృత్తులు జీవులను కర్మలు చేయటానకి ప్రోత్సహిస్తాయి. దీనిని తప్పించుకోవటానికి బ్రహ్మకైన తరం కాదు. మనల్నందర్ని కన్నవాడికే కర్మ చేయకపోవటం

తప్పలేదంటే (ఆప్టాప్) చివరకు నీవు నేను ఎంత, పని దొంగ కాలేక పోవటానికి. అందుచేతనే కర్మత్యాగం భౌతికముగా అసాధ్యమన్నది గీత.

"కర్మ బ్రహ్మోద్భం విద్ధి....." కర్మ బ్రహ్మము చేతనే ఏర్పడినది. వేదము బ్రహ్మం నుండి వెలువడినది. అట్టి వేదం కర్మ కాండను గూర్చి చెప్పింది. మానవ జాతికి ప్రామాణికములైన వేదాలు కర్మాశ్యకతను, వాటి ఆచరణవలన కలుగు శ్రేయో ప్రేమో మార్గాలును గూర్చి విశదము గావించినవి.

ప్రకృతి కూడా కర్మలాచరిస్తుంది. భూతజాలమును ఉద్భవింప జేయటం, (పుట్టుట) అవి పెరగటం, తరువాత విరగటం అంటే మరణించటం, అంతేకాదు ప్రకృతిని కన్నాయన కూడా "ఏవచ కర్మణి" కర్మలు చేస్తాడట. ఆయనకు కర్మలు చేయవలసిన అవసరం గాని, ధర్మముగాని, విధిగాని ఏదీలేదు. అయినా మనందరి కోసము కర్మలు చేస్తున్నానని ప్రవచించాడు గీతకర్త.

ప్రకృతి ప్రతిప్రాణిచేత కర్మలు చేయిస్తుంది. పనిచేయటంతో ఫలితం వస్తుంది. ఆ ఫలితాన్ని అనుభవించటానికి సమస్త జీవరాసులు వచ్చాయి. అంటే కర్మ చేయటం తప్పదు. ఫలితం అనుభవించటం కూడా తప్పదు. అందుకోసం జీవికి జనన మరణాలు తప్పటం లేదు.

అయితే ఎక్కువగా, మొత్తం మంది పనిచేసి ఫలితాన్ని అనుభవించ టానికే జీవితం అనుకొని ఆ విధంగా సర్వ ప్రయత్నాలు చేస్తున్నారు. అతి స్వల్పంగా ఉన్న జ్ఞానులు కర్మ ఫలాన్ని ఆశించకుండా లోక సంగ్రహార్థము కర్మలు చేస్తూ కర్మ బంధము నుండి తప్పించుకొంటారు. ఫలితముగా వారికి జన్మరాహిత్యము కలుగుతుంది.

"అయుక్తః కామ కారేణ ఫలే సక్తో నిబధ్యతే...." (భ.గీ.) సామాన్యుడు ఆశచే ప్రేరితుడై కర్మలందాసక్తితో ఉండి కర్మబద్ధుడగు చున్నాడు.

"అయుక్తః కామకారేణ" వివేకము లేని వాడు కర్మ ఫలాన్ని ఆశించి ఫలితం కోసమే కర్మలు చేస్తూ ఫలితానికి బంది అవుతున్నాడు. తాను జీవనమరణాల ఊబిలో చిక్కుకొంటున్నాను అనే స్పృహ లేకుండా ఉంటాడు. అలా ప్రతి మనిషి, మంచిదో చెడ్డదో కర్మలు చేస్తూ లేక రెండునూ చేస్తూంటాడు. వాటి ఫలితం రాసులు రాసులుగా పేరుకు పోతుంది. దీనినే సంచిత కర్మ అన్నారు.

ఈ సంచుల్లో ఉన్న కర్మరాసిలో ఒక భాగం తీసి భగవానుడు ప్రాణికి జన్మనిస్తాడు. కర్మ ఫలమునునుసరించి వాని యొక్క పుణ్యాపాప వాసనలు ఆ జీవి మనస్సుకు పట్టును. దాని వలన అతనికి సత్సంకల్పములు లేదా దుస్సంకల్పములు కలుగును. వీటి అనుభవమే ప్రారబ్ధకర్మ.

దక్షుని కుమార్తె సతీదేవి తండ్రిచేసిన అవమానానికి యోగాగ్నిలో దగ్ధమై మరల పార్వతిగా జన్మించి పరమ శివుని పతిగా పొందినది. ఇది పూర్వజన్మ సంస్కార బలము వలనే. దీనిని పురాకృత కర్మ అందురు.

మనిషి ప్రారబ్ధకర్మననుభవిస్తూ జీవన యాత్ర సాగించి మరికొన్ని కర్మలు చేయును. అది దుష్కృతము లేదా సుకృతము గావచ్చును. ప్రారబ్ధకర్మ ననుభవిస్తూ చేసే కర్మ ఫలం భవిష్యత్తులో అనుభవించుటకు ఉండిపోవును. దీనినే అగామి కర్మ అందురు. వర్తమనానంలో చేసి మిగిలిపోయిన కర్మ ఫలం సంచితములో చేరిపోవును. ఈ విధముగా మనిషి సంచిత ప్రారబ్ద అగామి కర్మఫలం అనుభవిస్తూ చావుపుట్టుకల బంధములో బందీ అవుతున్నాడు.

లౌకిక జీవనం సాగించే సంసారులు బంధములో బ్రతుకుతున్నాము అనే స్పృహ లేకుండా సంతోషముగా ఉన్నామనే భావనతో ఉంటారు. జీవిత సత్యంలో దూరాలోచన ఉండదు. ఎక్కువ

ఫలితాన్ని రాబట్టుకొని భౌతిక సుఖాలను అనుభవించాలని ఆశపడుతూ ఉంటారు.

100 రూపాయలు పెట్టుబడి పెట్టి వేలు గుంజాలని, 10 ఎకరాలు భూమి ఉన్నవాడు దానిని 100 చెయ్యాలని సీలింగ్‌ను తప్పించి మరీ సంపాదిస్తాడు. ఒక ఫ్యాక్టరీ పది ఫ్యాక్టరీలు అయిపోవాలని, ఇలా ఎవరు చేసే పని అది ఒకటికి వందింతలు కావాలని, లాభాలే లాభాలు రావాలని అప్పుడే తృప్తి అనుకుంటారు. ప్రతివాడికి టాటాలు, బిర్లాలు, అబానీలు, ప్రేమ్‌జీలు, లక్ష్మిమిట్టల్‌కు మించిన శ్రీమంతుడు అయిపోవాలని, ప్రపంచంలో నెంబర్‌వన్ సంపన్నుడు కావాలని కలలు కంటున్నారు. నేటి ప్రపంచ జనాభా నడత ఈ బాటలో పయనిస్తుంది.

ఒక ఊళ్ళో ఒక వర్తకుడున్నాడు. అతనికి బంగారమంటే ప్రాణం కన్నా మిన్న. తన వ్యాపారమంతా బంగారమైపోవాలని అనుకొంటూ బంగారము పొందే వ్రతం చేసాడు. ఆ దేవత కరుణించింది. 'నీ కోరికేమిటన్నది' నేను పట్టిందల్లా బంగారము కావాలన్నాడు. దేవత "తథాస్తు" అంది.

ప్రారంభమైంది వర ప్రభావము. నిద్రలేచి చెంబు పట్టుకున్నాడు, తరువాత బక్కెట్టు, నీళ్ళు ముట్టుకున్నాడు, తినేందుకు కుర్చీలో టేబులు ముందు కూర్చున్నాడు. త్రాగే నీళ్ళు, తినే అన్నం, కన్న కూతురున్ని ముట్టుకోగానే అన్నీ బంగారమైపోయాయి. ఇంకేముంది అన్ని బంగారమే, అంతా బంగారమే అయింది.

బంగారము తిని చావలేడు. అలా అని అన్నం లేదు, నీళ్ళు లేవు చివరకు బ్రతుకు బంగారము కాదు గాని బండలయ్యే ప్రమాదమొచ్చింది, అమ్మో తల్లి, ఈ బాధ భరించలేను కరుణించమని దేవతను మళ్ళీ ప్రార్థించాడు. బుద్ధిగడ్డితిని కాదు బంగారం తిందామని కోరికోరి కోరి తెచ్చుకున్నాను ప్రాణాల మీదకి కనుక దయుంచి తనకి

ఇచ్చిన వరాన్ని రద్దు చేయమని ప్రార్థించాడు. ఎంతైనా తన భక్తుడు కనుక దేవి కరుణించింది. వరాన్ని వెనక్కి తీసుకొంది. అమ్మయ్య బ్రతికానురా జీవుడా, అని, ఇలాంటి బుద్ధి మాలిన పని చేయకూడదని అమ్మకు చేతులెత్తి దణ్ణం పెట్టి పదే పదే నమస్కరించాడు.

ఇలా జీవులు కర్మలు చేస్తూ మరణ దేవత కబంద హస్తాలలో బందీలు కావల్సినదేనా? దీనికి తరుణోపాయము లేదా? లేకేం. ఆచరించాలంటే చాలా ఉన్నాయి. విషానికి విరుగుడు, చీకటికి వెలుగు, పాపానికి పుణ్యము, నరకానికి స్వర్గము ఇలా క్రియకు ప్రతి క్రియ ఉండనే ఉంటుంది.

కర్మ ఫలితాన్ని దాటటానికి ఉపాయం భగవద్గీత నిష్కామ కర్మ యోగంగా చెప్పింది. "నియతం కురు కర్మత్వం కర్మ జ్యాయోహ్యకర్మణం...." స్వధర్మానుసారం నియమిత కర్మలు చేయాలి. కర్మ చేయకపోతే జీవితం కూడా జరుగదు. కర్మ చేయక పోవటం కంటే అది చేయటే శ్రేష్టము. "శ్రేయోన్ స్వధర్మో విగుణః" తన కర్తవ్యమును పాలించుట శ్రేష్టమైనది. వర్ణధర్మముగా గాని తన మనస్సుకు నచ్చిన కర్మ చేయుట స్వధర్మము. ఎవరు మనస్సుకు నచ్చిన పని వారు చిత్తశుద్ధిగా శ్రద్దాసక్తులతో ఆచరించాలి.

"నియతం కురుకర్మత్వం" విధిగా పాటించవలసిన కర్మలు తప్పక చేయాలి. వృత్తి పరమైన కర్మలేకాదు. పరహితమైన కర్మలు, యజ్ఞాలు చేయటం, దాన ధర్మాలు చేయటం, పరోపకార సేవలు చేయటం, పుణ్యకార్యాలు మొదలగునవి శాస్త్ర విహిత కర్మలు తప్పక చెయ్యాలని శాస్త్రాదేశము.

ఏ కర్మజేసినా తస్మాద సక్త స్సతతం.....ఫలాపేక్ష లేకుండా నియమిత కర్మలు ఆచరించుట వలన మోక్షము పొందవచ్చును. మనిషి నిద్ర లేచింది మొదలు ఏవేవో పనులు చేస్తూనే ఉంటాడు. అయితే

కామ్యకర్మలు అనగా శాస్త్రవిహిత కర్మలు, తన విద్యుక్త కర్మలు, దానధర్మాలు మొదలగునవి చెయ్యాలి. నిషిద్ధ కర్మలు తాగుడు, జూదము, వ్యభిచారము, దొంగతనము, అబద్ధాలాడటం మోసం మొదలగునవి మనిషైనవాడు చేయకూడదు.

కామ్యకర్మలు "అసక్తఃహి ఆచరమ్ కర్మ...." నీ కర్తవ్యమును ఫలాపేక్ష లేకుండా ఆచరింపుము. నేను చేస్తున్నాను అనే కర్తృత్వ భావాన్ని వదులుము. కర్మ ఫలితము ఏది గాని అదిదైవానికి సమర్పించి నీపని నీవు చేయుము, అప్పుడు ఆ కర్మ యోగముగా మారుతుంది.

అప్పుడు "బ్రహ్మాణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతియః లిప్యతే నసపాపేపద్మ పత్ర మివాంభసాః" ఎవడు ఫలాపేక్ష నాశింపక బ్రహ్మార్పణముగా కర్మలు నాచరించునో అట్టివాడు తామరాకుపై నీటి బిందువువలె పాపమున చిక్కుబడడు.

కర్మలు చేస్తూ దైవాన్ని పొందాలనుకొనే వారికి ఎంతటి గొప్ప సందేశమిది. పనులు చేసుకుంటూ వాటి ప్రభావం మనస్సుపై పడకుండా చేసుకోవటం వలన అహంకారము నశిస్తుంది. నాలోనున్న దైవమే ఈ పనులన్ని చేయిస్తుంది. కనుక ఫలితం కూడా ఆయనే అనుభవించాలని, ఇదంతా ఎక్కడ నుండి వచ్చిందో అక్కడికే చేరుతుందనే సత్యాన్ని తెలుసుకొన్నప్పుడు, నేను చేసేది ఏముంది, అంతా ఆయనదే, నేను నిమిత్తమాత్రుడనని యధావిధిగా కర్మలాచరించిన తామరాకుపై నీటి బొట్టు చందముగా కర్మ నిన్ను బంధించదు. అది నిష్కామ కర్మఫలమయి యోగ మౌతుంది.

పుట్టిన ప్రతిప్రాణి కర్మ చేయక తప్పదు. ప్రతి కర్మకు ఫలితం కలుగుతుంది. దానిని అనుభవించాలి. ఈ అనుభవం చిత్తములో సంస్కారముగా ఏర్పడుతుంది. అది మరల కర్మ చేయటానికి

ప్రేరణనిస్తుంది. మళ్ళీ కర్మ ఫలితం, జనన మరణాలు, ఈ విధముగా కర్మ జీవిని బంధిస్తుంది.

వాసన ప్రేరణతో కర్మ జరుగుతుంది. కర్మను యోగంగా చేసినప్పుడు వాసనలు క్షయమవుతాయి. భోగాసక్తితో కర్మలాచరిస్తే నూతన వాసనలు (సంస్కారములు) ఏర్పడతాయి. కనుక కామ్య కర్మలు ఫలాను సక్తితో గాక, నిష్కామముగా ఆచరించినప్పుడు వాసనలు క్షయమవుతాయి. నిష్కామ కర్మ యోగమవుతుంది. అప్పుడు మనిషి సంసార బంధ విముక్తుడగును.

జనక మహారాజు ఈ ప్రపంచ సుఖాలు అస్థిరాలని తెలుసుకొని రాజుగా తన కర్తవ్య కర్మలను నిస్సంగంగా ఆచరించి తరిస్తాడు. ఇదే రీతిలో అశ్వపతి, ఇక్ష్వాకుడు, అంబరీషుడు, ధర్మరాజు మొదలగు రాజర్షులు ఫలాపేక్షను వదలి కర్మలు జేసి జన్మధన్యము గావించుకొన్నారు.

''కుర్యాత్ విద్వాన్ చికీర్షలోక సంగ్రహమ్'' జ్ఞానులు ఫలాపేక్షలేని వారై లోకకళ్యాణము కొరకు కర్మలాచరిస్తారు. దీనిననుసరించి సామాన్యులు వారి కళ్యాణము కోసం నిష్కామ కర్మలాచరించి కర్మ బంధము నుండి బయటపడగలుగుతారు.

కర్మ ఫలితాన్ని త్యాగము చేసినప్పుడు కర్మయోగి పొందే స్థానాన్ని సామాన్యుడు పొందుతాడు. కాని సామాన్యులు తనకు లభించు ఫలం చుట్టు ముళ్ళకంచె వేసుకొని కాపాడుకొంటూ ఉన్నంతకాలం జన్మ పరంపర తప్పదని గ్రహించాలి. కనుక ఫలితం కోరి కర్మలు చేస్తూ మరుజన్మ కావాలో లేక నియమిత కర్మలు నిష్కామముగా ఆచరించి చావులేకుండా చేసుకోవాలో అన్నది నీ నడత మీద ఆధారపడి ఉన్నది.

ఫలం దక్కించుకోవటానికి ప్రయత్నించావా తస్మాత్ జాగ్రత్త.

# 5. "విశేషబుద్ధి"

మానవుడు మనిషిగా జీవించటానికి కారణమైనది బుద్ధి. అట్టి బుద్ధి స్వరూప స్వభావాలను తెలుసుకొవటం ఎంతైనా అవసరము.

బుద్ధి అంతః కరణ చతుష్టయములో ఒకటి. ఒక్క మానవ, దేవ దానవులకు మాత్రమే పరమాత్ముడు ప్రసాదించిన వరం. మరే ఇతర ప్రాణులకు లేనిది. బుద్ధి చేతనే మానవుడు జ్ఞాన విజ్ఞానాభివృద్ధిని గాంచుచున్నాడు.

బుద్ధి మానవ శరీరములో నాభిస్థానములో ఉండును. ఇక్కడే మణిపూరక చక్రమున్నది. దీనికి అధిపతి శ్రీ మహా విష్ణువు. మనస్సు కల్పించిన సంశయములను నివృత్తి గాంచునది బుద్ధి. ఇది పరబ్రహ్మ స్వరూపము.

మనిషిని నీతి నియమాలతో లేక అధర్మాములతో, అవినీతి, అన్యాయ అక్రమార్గాలున నడిపించునది బుద్ధియే. మానవుడు దుష్టుడు, దుర్మార్గుడు కావటం లేదా మహాత్ముడు, మాధవుడు కావటం బుద్ధి వల్లనే జరుగుతుంది.

"మహ భూతాన్యహం కారో బుద్ధి రన్యకర్త మేవచ" (భ.గీ.14.5) క్షేత్ర మంటే పంచమహాభూతాలు, అహంకారము, బుద్ధి, మూల ప్రకృతి మరియు 13 అంశములతో కూడినది.

తైజ సాహంకారము వలన బుద్ధి తత్త్వం ఉదయించును. దీని తత్త్వం ద్రవ్యముల యొక్క బాహ్య స్ఫురణ, విజ్ఞానానికి కారణం. బుద్ధి ఐదు విధాలుగా వర్తించును. 1. సం^యము, 2. విపర్యము, 3. నిశ్చయం, 4. స్మృతి, 5. స్వాప్యము ఇవి బుద్ధి లక్షణాలు.

తైజ సాహం కారశక్తి ద్వివిధములు 1. క్రియాశక్తి అది ప్రాణ సంబంధముగా నుండును, 2. విజ్ఞాన శక్తి, ఇది బుద్ధి సంబంధముగా

నుండును. పంచకోశములతో కూడిన శరీరములో విజ్ఞానమయ కోశము బుద్ధి స్వరూపం.

బుద్ధి జీవుని ప్రతిబింబించును. విజ్ఞానమయ కోశమైన బుద్ధి జీవుల జనన మరణములకు హేతువగుచున్నది. ఇది ఆత్మకి ఉపాధి. సృష్టిలో నున్న జీవరాశులన్నిటిలో ఉన్నతుడు మానవుడు. అతడు ఆధిపత్యము చెపట్టటానికి బుద్ధి కారణం.

ఈ బుద్ధి కనుక లేకపోతే మనిషి పశువుగా ప్రవర్తిస్తాడు. అప్పుడు బుద్ధిలేని జీవుల్లో చేరిపోతాడు. భగవంతుడు ప్రత్యేకించి మనుష్యులకు ప్రసాదించిన బుద్ధి ఆయన్ని తెలుసుకోవటానికి ఎంతగానో ఉపకరించును.

సనత్ కుమారుడు నారదునకు బ్రహ్మోపాసన గూర్చి చెబుతూ "విజ్ఞానియైన వాడే సత్యము చెప్పును' కనుక సత్యము కొరకు జ్ఞాన విజ్ఞానాలను తెలుసుకోమని హితం చెబుతాడు. విజ్ఞానము కొరకు బుద్ధిని అపేక్షింపమని ఉపదేశిస్తాడు. మనోబుద్ధులను వశపరుచుకొన్న మహాత్ముడు బ్రహ్మ స్వరూపాన్ని పొందుతాడు.

ప్రపంచ వ్యవహారములందు లీనమైనవారికి రకరకాల బుద్ధులు పుట్టును. ఎన్నెన్నో ఆలోచనలు చేస్తూ తొందరగా కుబేరుడై పోవాలని, లేదంటే రాజకీయ నాయకుడై ప్రధాన, ముఖ్యమైన మంత్రి అయిపోవాలని, అలా జరిగిపోయిన తరువాత జీవితాంతం ఆపదవుల్లో కొనసాగిపోవాలను కొనే వాళ్ళు, బిచ్చగాడు ఒక్కసారిగా టాటా, బిర్లా లాగా అయిపోవాలని, సముద్ర మధ్యంలో భవంతి కట్టుకొని ఒక భూమినే కాకుండా, మూడు వుంతుల నీళ్ళున్న భూప్రపంచాన్ని ఏకచ్ఛత్రాధిపతిగా ఏలుబడి సాగించాలని కలలుగనే వాళ్ళు ఎందరు లేరు.

జీవితంలో ఉన్నత స్థానాన్ని పొందాలనే లక్ష్యముతో తన

బుద్ధినంతా కూడగట్టుకొని తదేక దీక్షతో కార్యసాధన చేసిన వానికి అసాధ్యమంటూ ఏమీ ఉండదు. అప్పుడు సామాన్యుడు మాన్యుడవుతాడు.

తుకారాం, నందనార్, భక్త రామదాసు వంటి భాగవతోత్తములు, జగదీష్ చంద్రబోస్, రామానుజమ్ వంటి శాస్త్రవేత్తలు నిశ్చయాత్మ బుద్ధితో గొప్ప ఫలితాలను సాధించి రికార్డులు స్థాపించారు "వ్యవసాయాత్మికా బుద్ధి" తోనే.

బుద్ధి మనిషిలో అనేక విధములుగా విభజించబడి ఉంటుంది. కృషి చేయనివానిలో బుద్ధి శక్తి విచ్ఛిన్నమై ఉంటుంది. అప్పుడు దాని శక్తి అంతంత మాత్రంగా ఉంటుంది. మనిషి తనలోని శక్తినంతా కూడగట్టు కోవటం వల్ల బుద్ధి స్థిరమై తన లక్ష్యసాధనకు తేలిక అవుతుంది.

బుద్ధికి అనేకానేక అర్థములు గలవు. జ్ఞానము, వివేకము, తెలివి, మనస్సు, ప్రతిభ, ప్రకృతి గుణములో నొకటి, అంతఃకరణములో నున్నది, ఆలోచన, తలపు మొదలగునవి. మానవ జాతిలో బుద్ధి వివిధముగా ఏర్పడినదని వేదమే చెబుతున్నది.

ఆకాశమందలి 1/2 భాగంలో 4వ భాగములోని ఒక భాగము, అగ్ని అందలి అర్ధ భాగములో గల 4వ భాగములోని నొక భాగము కలిసి బుద్ధిగా ఏర్పడినది. ఇది అంతట సంచారము చేయును, విషయమును నిశ్చయించును.బుద్ధికి సప్తవిధి తత్త్వములున్నవని ఋగ్వేదము చెప్పుచున్నది.

1. పంద అనగా అసలు తెలుసుకోదగిన తత్త్వము, 2. మేధ అనగా విన్న వాటిని మరచి పోకుండుట, 3. చార్విత అంటే ఊహా శక్తి, 4. చత్వారి అనగా అనేక పర్యాయములు ఒక విషయమును విసుగు చెందకుండా వినుట, చూచుట, తినుట మొదలగు కర్మలు చేయుట. ఇవి ప్రకృతి నైజములు. 5. గృహీతి అనగా గ్రహింపదగిన దానిని

గ్రహించుట. 6. శ్రేషి అనగా శ్రవణాది మూలకంగా గురు శుశ్రూషాది విషయములందు మెలకువ కలిగి వర్తించుట. 7. ప్రతిభా అంటే ప్రజ్ఞాను భవంతో విషయావిష్కరణ చేయగలుగుట.

మనిషి ఏ కార్యము చేయొచ్చు, ఏ కార్యము చేయకూడదని నిర్ణయించు స్వభావము బుద్ధి. బుద్ధి నిర్ణయించిన మార్గమున కర్త ఆ కర్మను చేయును. సూక్ష్మ శరీరములో ఒక అంశమైన బుద్ధిని మహత్తు అని చెప్పబడును. బుద్ధి లక్షణం అధ్యవసాయమును నిర్ణయించును.

బుద్ధి మనో ప్రాణముల అగ్రభాగము నుండి మనస్సును పనిముట్టుగా చేసుకొని "నేను" చేయుచున్నాను, అనుభవించు చున్నాను అనే కర్తృత్వభోక్తృత్వ అభిమానం కలిగి యుండును. దీనిని బిందు వందురు. ఇది సమస్త కార్యాకారణములకు ఆధారమై, వాసన సంసర్గములకు నియమైయున్నది.

బుద్ధి తనంతతానుగా సంచరించలేదు. ప్రాణాది వాయువులతో, ఇంద్రియాలతో మనస్సును ఆధారముగా జేసుకొని చలించుచుండును. అందుకే అన్నారు బుద్ధి చంచలమైనదని.

బుద్ధి జాగృతి, స్వప్నావస్థలందు మనస్సుతో కలిసి దాని రూపమునే పొందును. సుషుప్తి యందు జడ స్వభావము కలదియై యుండును. బుద్ధి అనాది నుండి జీవికి ముక్తి లభించునంత వరకు పుణ్యాపాప కర్మరూపమైన సుఖదఃఖములను అనుభవించు చుండును. తనను తాను తెలుసుకోలేదు. చంచల స్వభావము కలిగియుండు బుద్ధి బిందురూపమున ఉండును.

మనిషిలోని మనోబుద్ధులు ఆ మనిషిని నడిపించును. అది సకామకర్మగాని, నిష్కా కర్మగాని బుద్ధి చేతనే జరుగును. బుద్ధి త్రిగుణములతో కలిసి కర్మలు చేయును. సత్త్వ గుణముతో నున్నప్పుడు ధర్మము, జ్ఞానము, ఐశ్వర్యము, వైరాగ్యముగా నుండును. అదే బుద్ధి

తమోగుణముతొ నున్నప్పుడు అధర్మము, అజ్ఞానము, అనైశ్వర్యము, అవైరాగ్యముతో నుండును. రజోగుణముతో చేరినప్పుడు ఈర్ష్యాద్వేషాలు కలిగి అందుకు తగిన ప్రయత్నాదులు చేయును.

ఈ బుద్ధియే "మహతః పరమ వ్యక్తామవ్యక్తాత్పురుషః పరః" ఈ మహత్తు అంటే బుద్ధి జీవి బంధమోక్షములకు కారణమగుచున్నది. దీనినే కర్మయోగము మరియు బుద్ధి యోగమని చెప్పబడినది.

అనిలాంసముచే ఏర్పడిన బుద్ధి నిశ్చయాత్మకం. బుద్ధి ఆత్మకు ఉపాధి. మానవుడు మహనీయు డవటానికి గాని లేదు దుర్మార్గుడు అవటానికి గాని కారణం బుద్ధియే. మనిషి ఉచ్ఛ నీచ స్థితులకు కారణం కూడా ఇదియే. జీవుని సుఖ దుఃఖాలకు నిలయం బుద్ధి. బుద్ధిని వెన్నంటి అహంభావం ఉంటుంది. యోగ సాధనచేత బుద్ధి శుద్ధియై పరమాత్మను చేరటానికి దారి చూపిస్తుంది. బుద్ధి యోగ మభ్యసించిన ధీమంతులు అన్నిటియందు సమభావము కలిగి ఫలాపేక్ష రహితముగా కర్మలను ఆచరించెదరు. అందుకే "బుద్ధౌ శరణమన్విచ్ఛ" సమత్మా బుద్ధిని ఆశ్రయించమని అర్జుననకు ఉపదేశించాడు శ్రీకృష్ణుడు.

బుద్ధికి విశ్లేషణతో పాటుగా ధృఢనిశ్చయము, ఉద్వేగాలను అదుపుజేసుకునే శక్తి కూడా ఉంటుంది. అందువల్లనే బుద్ధి చమత్కారముతో, విజ్ఞానముతో కార్యములను చక్కబెడుతుంది. దీనివల్ల మానవ జీవితాన్ని ఏ గమ్యమువైపు నకైనా తీసుకెళ్ళవచ్చును. అందువల్ల బుద్ధిని సారథి అన్నది వేదాంతము. ప్రార్థుని రథసారథి బుద్ధి ప్రాబల్యము వల్ల ఒక్కపాండవులే కాదు ధర్మం జయించింది.

జ్ఞాన రూపమైన బుద్ధి పంచాంశముతో కూడి ఉంటుంది. మతి, శృతి, అవధి, మనస్సు, కైవల్యము. మానవునికి తత్త్వవిచారణ శక్తి, ఏకాగ్రత బుద్ధి మూలమునే కల్గును, వాక్కు మనస్సుకంటే శ్రేష్టమైనది బుద్ధి. "మనోవాద వచో భూయో యదావై..." అట్లే "యధావై

విజానాత్యధ'' విజ్ఞానమే తెలియదగినది. అదే విధముగా "విజానాతిమతిస్త్వేవ" బుద్ధియే తెలియదగినదని సనత్ కుమారుడు నారదునకు ఉపదేశిస్తాడు. అట్టి పరమోత్కృష్టమైన బుద్ధి మాత్రముచే మనిషి భక్తి, జ్ఞానం సాధించి పరమాత్మను దర్శించి బంధ విముక్తుడౌతాడు.

జ్ఞాన విజ్ఞాన రూపిణియైన బుద్ధికి కామ, క్రోధ, లోభ, మోహాలు, శోకము, పరాసుత, ఈర్ష్యాసూయలు, మానము, విచికిత్స, హింస, జుగుప్స అనే గుణాలు క్షయము కలిగించును. బుద్ధికి పట్టిన రోగాన్ని వదలగొట్టటానికి భగవానుడు "మయి బుద్ధిం నివేశయః" నాయందు బుద్ధిని నివసింపజేయి. సాధనా చతుష్టయము ద్వారా భక్తి, జ్ఞాన, వగైరాదుల ద్వారా బుద్ధిని పరమాత్మను గాంచుటకు ప్రయత్నించిన బుద్ధి క్షయమయిపోయి అది అక్షయమైపోతుంది.

బుద్ధి గలవానికి ముందుచూపు, దూరదృష్టి ఉంటాయి. అనగా జ్ఞానాన్ని కలిగి ఉంటాడు. తెలివి ఉండటం జ్ఞానం కాదు. చదువుకున్న వాడికి చదువు రాని వాడికి తెలివి ఉంటుంది. తెలివి విశ్లేషణ కలిగి ఉంటుంది. చదువు కొన్నవాడు సమస్యల్ని ప్రత్యేకించి పరిష్కారం చేస్తాడు. అదే చదువురాని వానిలో విశ్లేషణ ఒక దశలోనే ఉండి పోతుంది. అందుకే పెద్ద చదువులు లేక ఉన్నత పదవుల్లో ఉన్నవారు ఆధ్యాత్మిక గురువుల ఆశిస్సులు పొందుతుంటారు.

"దదామి బుద్ధి యోగః" భగవంతుని ప్రీతితో సేవించిన వానికి బుద్ధి జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. మానవుడు బుద్ధి ప్రసాదముతోనే విజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకొని సర్వజీవుల మీద ఆధిపత్యముతో బాటు సర్వకామములను పొంద గలుగుతున్నాడు. బుద్ధి మాత్రం చేతనే మనిషి జ్ఞానం పొంది బంధ విముక్తుడవుతున్నాడు. బుద్ధి యోగము ఆచరించువారు కాయముచే చేయు కర్మలు విడువరు. వివేకముచే కర్మ ఫలమును త్యజించును. "కర్మణైవ సంసిద్ధి మా స్థితా జనకా

దయః" జనకుడు మున్నగువారు నిష్కామ కర్మచేతనే మోక్షమును పొందెను.

పరమేశ్వరుని ప్రేరణ నిమిత్తముగా ప్రకృతి నుండి మహతత్త్వము ఉదయించినది. దాని నుండి అహంకారమేర్పడినది. దీని నుండి మనస్సు ఏర్పడినది. ప్రకృతి వికారమైన మహతత్త్వము సత్త్వగుణ ప్రధానమైనపుడు బుద్ధి అనబడును. ఇది మనస్సుకు కారణమగుచున్నది. కార్యము కారణమునకు అధీనము. "మనసశ్చ పరాబుద్ధిః (కఠొ-ఉప) మనస్సుకంటే బుద్ధి సూక్ష్మమైనది.

మనస్సు స్థిరమైనప్పుడు బుద్ధి విశుద్ధమౌతుంది. అప్పుడది భగవానుని చేరటానికి దారి చూపుతుంది. మనిషికి భగవంతుడు బుద్ధిని ప్రసాదించి సమస్త జీవుల మీద ఆధిపత్యము వహించే శక్తిని ప్రసాదించాడు. అందుకే మనిషి ప్రజ్ఞావంతుడు. వివేకంతో మనిషి, మంచి చెడ్డలను తెలుసుకొని కర్మలను ఆచరిస్తున్నాడు. కనుక మనుజుడు కర్మలను నిష్కామముగా ఆచరించగలడు. అందుచే బుద్ధి మూర్తులగు మానవులు కర్మఫల త్యాగ సమర్థులని చెప్పబడినది.

సూక్ష్మశరీరంలో భాగమైన బుద్ధి మనిషికే సొంతమైనది. బుద్ధి మనిషిని ఎంతపైకైనా ఎత్తగలదు, లేదు అధఃపాతాళానికి త్రొక్కకలదు. నిశ్చయాత్మకమైన బుద్ధి సాత్వికమైనప్పుడు జ్ఞాన వైరాగ్యములతో ధర్మయుతంగా ప్రవర్తించి మనిషి ఉన్నతమైన స్థానాన్ని కైవశం చేసుకుంటాడు.

"మనసస్తు పరాబుద్ధిః" మనస్సుకంటే బుద్ధి శ్రేష్టమైనది. "విజానాతి మతిస్త్వేవ" బుద్ధిని అపేక్షించుము, నరుణ్ణి నారాయణుడిగా, మనిషిని మాధవునిగా మార్చగల శక్తి ఉన్నది బుద్ధికి మాత్రమే అంటారు గీతాచార్యులు. మనిషిలోని బుద్ధి సమత్వముతో కూడినప్పుడు ఫలరహిత కర్మను, కర్తవ్యత్యాగము జేయును. తనను బంధింప ప్రయత్నించిన

కర్మబంధమును కర్మయోగి ముక్తి మార్గముగా మార్చుకొనగలడు.

"యోగః కర్మ కౌశలమ్" బంధ విముక్తిగా కర్మలాచరించిన మోహవిముక్తి, నిరాసక్తము, నిశ్చయాత్మకమైన బుద్ధి కలుగును. అప్పుడు బుద్ధి సమాధి స్థితికి చేరును. జీవన మరణాలే సుఖదుఃఖాలకు, బంధానికి కారణమని తెలుసుకొంటాడు కర్మయోగి. కర్మయోగ కౌశలముతో నిష్కామకర్మ యోగాన్ని ఆచరించిన శుద్ధోధనుని బుద్ధి ప్రజ్ఞావంతమైతుంది. అలా ప్రజ్ఞయందు స్థితుడైన శుద్ధోధనుడు స్థిత ప్రజ్ఞుడైనాడు. ఆ విధముగా శుద్ధోధనుడు బుద్ధుడై ఎందరికో ఆదర్శమూర్తియై బ్రహ్మ నిర్వాణమును పొందినాడు.

ఎవరుగాని, ఎట్టివారుగాని, పాడుబుద్ధిని, దుష్టబుద్ధిని వివిధ ధర్మకార్యములచేత, భక్తి సాధనలచేత, నిష్కామ కర్మలాచరించిన బుద్ధి శుద్ధమైనప్పుడు బుద్ధిమంతుడౌతాడు. బుద్ధిమంతుడు సాధించలేని ఘనకార్యమేముంటుంది.

# 6. నైతిక ప్రవర్తన

నీతిగా జీవించుటమే నైతిక ప్రవర్తన. ధర్మ బద్ధములైన నియమములకు కట్టుబడి ప్రవర్తించుట నీతి. "నిత"అను సంస్కృత పదము నుండి నీతి పదము వచ్చినది.

నీతి అంటే ఉపాయము, న్యాయమని అర్థం. మంచిని ప్రోత్సహించి, ధర్మమార్గమున నడిపించు విచక్షణా జ్ఞానమే నీతి. మంచి చెడ్డలను విచక్షణ చేయునది నీతి. నీతిమంతుని సుగుణాలే అతని సంపదలు. ధన సంపదలు లేక పోయినా నీతిగలవాని కీర్తి ప్రతిష్టలకు లోటు ఉండదు.

నీతి అంటే పవిత్ర ధర్మంమని కూడా. పరస్త్రీలను తల్లితో సమానంగా, పరుల సొమ్మును మట్టితో సమానంగా, సకల ప్రాణులను తనతో సమానంగా ఎవరు చూచునో అట్టివారే నీతివర్తనులు అని చెప్పబడినది. నీతిమంతునికి నిందాభయం ఉండదు. "యాన్య వద్యాని కర్మాణిన తాని సేవితవ్యానినో ఇతరాణి" (తైత్త.ఉ.) అపవాదములు గాని కర్మలను మాత్రమే ఆచరించ వలయును. మరే ఇతరములైన కర్మలను ఆచరించ కూడదు. నిజమైన నీతిమంతుడు అట్టి కర్మాచరణమునే చేయును.

ఏ వ్యక్తిగాని తన వ్యక్తిత్వాన్ని నిలుపుకోవటానికి, ధర్మమార్గము ననుసరించటానికి, కీర్తి ప్రతిష్టలు ఆర్జించటానికి, నైతిక ప్రవర్తన ఎంతగానో దోహదం చేస్తుంది. మనిషైన వాడు నీతిని గూర్చి, నీతిగా బ్రతకటం గూర్చి ఆలోచించాలి.

నీతిగా బ్రతుకుసాగితే మనస్సుకు ప్రశాంతత కలుగుతుంది. ప్రశాంతిని పొందిన చిత్తము జ్ఞాన మార్గాన్ని చూపుతుంది. జ్ఞాని సత్యాసత్యము వివేకించి చూచును. "న హిజ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే" జ్ఞానముతో సమానమైనది, పవిత్రమైనది ఈ

ప్రపంచమున ఎచటను లేదని భగవద్గీత చెబుతున్నది. ఈ జ్ఞానమును మనిషి నీతి వర్తనము ద్వారా పొందును. ఇంద్రియ నిగ్రహముతోనే నీతి అలవడుతుంది. "జితేంద్రియః" పంచతన్మాత్రలు జ్ఞానేంద్రియాలతో సంయోగ మయినప్పుడు మనస్సు ద్వారా పురుషుడు విషయములను అనుభవించుచుండును. విషయాలు, ఇంద్రియాలు జడములు. పరమాత్మను తెలుసుకొనే శక్తి వాటికి లేదు. కనుక వాటిని ఆహార నియమముల ద్వారా, అభ్యాస వైరాగ్యముల ద్వారా నిరోధించవచ్చును.

న్యాయబద్ధమైన ప్రవర్తన గల వారికి జంతువులు కూడా సహకరిస్తాయట. సముద్ర వారధి నిర్మాణానికి అతి చిన్న ప్రాణులైన ఉడతలు కూడా శ్రీరాముడికి సహాయం చేసాయి. అదే అన్యాయ మార్గములో నడిచే రావణాసురునికి తన సోదరుడు విభీషణుడు సహకరించక, ధర్మవర్తనుడు, నీతిమంతుడైన శ్రీరామునికి సహాయం చేసాడు.

ఏ మనిషికిగాని ఒక లక్ష్యమంటూ ఉన్నప్పుడు దానిని సాధించటానికి భౌతికముగాను, ఆధ్యాత్మికముగాను క్రమ పద్ధతిలో నడిచినప్పుడు తన గమ్యాన్ని చేరుకోగలడు, నీతి నియమాలు గలవారే లక్ష్య సిద్ధిని పొందగలరు.

అనేక శాస్త్రాలు నీతిని గూర్చి బోధించాయి. పరిపాలకులకు, ఉన్నత పదవులలో ఉన్నవారు ధర్మ బద్ధముగా, సత్ప్రవర్తనతో పరిపాలన సాగించటానికి నీతి శాస్త్రమేర్పడినది. దీనికి మొట్టమొదటగా శుక్రాచార్యుడు, చాణిక్యుడు, విదురుడు మొదలగువారు పునాదులేచారు. తదుపరి భర్తృహరి మొదలగువారు వ్రాసినారు. రాజనీతి, దండనీతి, ప్రకృతి, యుద్ధనీతి మొదలగు అనేక నీతులను గూర్చి వివరించారు. శరీర సౌందర్యము ఎంత ఉన్న హృదయ సౌందర్యము లేకపోతే అది వ్యర్థమే అన్నాడు వివేకానందుడు. ఈ రెండు సౌందర్యాలను కలిగిన వివేకానందుడు జ్ఞానమూర్తి.

హృదయ సౌందర్యమంటే నీతిగా ప్రవర్తించటము. త్రికరణ శుద్ధిగా మానవ ధర్మాలను పాటిస్తూ ఇతరులను ప్రేమిస్తూ, ఆప్యాయంగా ఆదరంగా మంచిగా మాట్లాడుతూ ఇతరులకు సహాయం చేస్తూ "సర్వ భూతహితే రతాః" అన్ని జీవరాసులకు మేలుచేస్తూ జీవించటమే నీతివర్తనము.

ప్రస్తుత సమాజంలో నీతిమంతులు కరువైపోయారు. ఎక్కువగా అవినీతిపరులే రాజ్యాలేలుతున్నారు, అధికారాలు చెలాయిస్తున్నారు. నీతి బాహ్యులు తాత్కాలిక ప్రాపంచిక సౌఖ్యాలను అనుభవించుచున్నారు. మానవత్వాన్ని, వ్యక్తిత్వాన్ని మంటలో గలిపి, అక్రమముగా, అన్యాయముగా, అధర్మముగా అహంకార పూరితముగా పొందిన ధన సంపాదనతో భౌతిక సుఖాలను పొందుచున్నారు.

ప్రపంచములో ఎన్ని దేశాలున్నా, ఎన్నో జాతుల ప్రజలున్నా అందరిలో కాకపోయినా ఎందరెందరిలోనో అవినీతి నరనరాల జీర్ణించుకుపోయినది. నాయకులకు రాజనీతి లేదు, అవినీతి తప్ప. పెద్ద పెద్ద అధికారులకు నీతిబాట కంటక బాటగా కనబడుతున్నది. అయినా కాడికి దోచుకోవటానికే యత్నాలు సాగుతున్నాయి.

దోచుకొనేది 'లంచం' అనేక రూపాల్లో చేరుతుంది. న్యాయస్థానంలో ఉన్న న్యాయమూర్తులు కూడా దీనికి అతీతంగా లేరు. అవినీతి న్యాయమూర్తులు అంతటా వ్యాపించి ఉన్నారు. 'లంచం' అదే 'లంజం' ఇచ్చిపుచ్చుకోవటంలో రాజకీయ నాయకులదే ప్రథమ తాంబూలం. ఐ.ఎ.యస్., ఐ.పి.యస్., డాక్టర్లు, ఇంజనీర్లు, ఇలా ఒక తరగతివారు అని చెప్పలేము, ఇంకా చిన్నా చితక ఉద్యోగులు, వ్యాపార్థులు, ఒకరేమిటి అవినీతి ఆధారంగా సంపాదించే అక్రమార్కులు ఈనాడు సంఘములో అత్యధిక సంఖ్యలో ఉన్నారు. నీతిమాలిన వాళ్ళ పనులు పట్టుదల చూస్తూ ఉంటే ఏదో ఒకరోజు నీతికు ముందు ఉండే 'అవి'ను కొట్టేయించి, అవినీతే సరియైన నీతియని, అధర్మమే అసలైన

ధర్మమని, అసత్యమే సత్యానికి మూలమని అంతా తారుమారు చేసి వారి నైతిక ప్రవర్తనను చాటుకుంటారేమో అనే చెప్పలేనంత సందేహము కలుగుచున్నది.

"ఆత్మార్థం జీవలోకేస్మిన్ కోన జీవితి మానవః" ఈ లోకంలో ఏ మానవుడు తన కోసం తాను జీవించకూడదు. పరోపకారం కోసమే జీవించాలి. ఇది ప్రకృతి మూల ధర్మం. జీవితంలో సంతృప్తి పడటం నేర్చుకొన్న వ్యక్తి ఎప్పుడూ సంతోషంగానే ఉంటాడు. అసంతృప్తితో బ్రతికే ప్రతి అవినీతి పరుడు దుఃఖాన్నే అనుభవిస్తుంటాడు.

అన్యాయంతోనూ, అక్రమంతోనూ రాజీపడటం కన్నా మించిన నేరం మరొకటి లేదన్నాడు నేతాజి. నిజాయితీ పరులకు కొన్ని అపజయాలు కలిగినా అవి తాత్కాలికమే. అవినీతి పరుని విజయం శాశ్వితం కాదు. నీతికి అపజయం లేదు అని ఎన్నో సంఘటనలు నిరూపించాయి.

సాంఘీక జీవనంలో గల బరువు, బాధ్యతలను విస్మరించకుండా మన బ్రతుకు తోటివారికి ఉపయోగపడేదిగా ఉండాలి. నీతినియమాలు లేని మనిషి కోతికంటే హీనుడన్నారు. నైతిక ప్రవర్తన లేని మానవుని పురోభివృద్ధి, అభివృద్ధి కాదు, అది పాపపంకిలమైనది.

నీతి, ధర్మం, న్యాయం ఈ లోకంలో ఇంకా ఉన్నాయి కాబట్టి మానవ మనుగడ సాగిపోతూ ఉన్నది. సూటిగా చెప్పాలంటే నైతిక ప్రవర్తన మీదనే మానవ మనుగడ యావత్తు ఆధారపడి ఉన్నది. పూర్తిగా నీతి అడుగంటి పోయిన రోజున మానవజాతి క్రమంగా అంతరించక తప్పదు. చెప్పేటందుకే నీతులున్నాయని అవినీతి పరులనుకుంటే తస్మాత్ జాగ్రత్త ... జాగ్రత్త....

# 7. సోహం-సుఖనిద్ర

"జగత్స్వప్న సుషుప్తి అవస్థాత్రయ...జీవయుక్తమేవ" జీవుడు. 1. జాగ్రదవస్థ, 2. స్వప్నావస్థ, 3. సుషుప్త్యావస్థ అనే త్రయావస్థలను కలిగి యున్నాడని శారీరకోపనిషత్తు చెబుతున్నది.

జాగ్రదావస్థలో ఏకాదశేంద్రియాలు, ప్రాణము, స్థూల శరీరము కర్మలు చేయును. జీవులు జాగర్తి కులై వారి పనులను చేయుచుండుటను జాగ్రదావస్థ అన్నారు. స్వప్నావస్థలో మనస్సు మాత్రమే పని చేయును. అసలు మనస్సు పని చేయకపోవటం అనేది జరుగదు. కాని సుషుప్త్యవస్థలో మనోకర్మలు ఆగిపోవును. అయితే యోగులు కూడా మనస్సు అలజడులను, కదలికలను అనేక యోగ, ధ్యాన సాధనల ద్వారా బంధిస్తారు. "సర్వ సంకల్పసన్యాసీ యోగరూఢిస్తదోచ్యతే" సమస్త సంకల్పములను పరిత్యజించు వానిని యోగారూఢుడని గీత చెబుతున్నది.

కలలు కనటం అనేది ప్రతి జీవి లక్షణం. మనుష్యులే కాదు జీవమున్నది ప్రతిదీ కలలు కంటుంది. జాగ్రదవస్థ నుండి జీవుడు మనస్సును తప్పించుకొని నిద్రలోని అంటే సుషుప్తిలోకి వెళ్ళేముందు, అట్లాగే జీవుడు సుషుప్తి నుండి బాహ్యావస్థలోకి వచ్చేటప్పుడు కలలు వస్తాయి. కలలు కనేది మనస్సే. కలలు పూర్తిగా నిద్రపోకముందు, తెల్లవారు జామున మెలకువ వచ్చేముందు వస్తూంటాయి. తెల్లవారు జామున వచ్చే కలలు నిజమవుతాయని పెద్దలంటారు. "స్వప్నం నిద్రాజ్ఞానాలంబనం వా" నిద్రలో కలిగే జ్ఞానాన్ని భావించటం కల. కొన్ని కలల్లో జాగ్రత్తులోని అనుభవం మనస్సులో నాటుకొని కలలో ఆనందం అనుభవించినట్టు ఉంటుంది. అందుకే కొన్ని కలలు నిజమౌతాయంటారు.

సుషుప్తి. ఈ అవస్థలో మనస్సు కూడా పని చేయదు. కేవలం

జీవాత్మ స్థూల శరీరంలో సాక్షి మాత్రుడుగా ఉంటాడు. సుషుప్తినే గాఢ నిద్రను సుఖనిద్ర అంటారు. ఈ స్థితిలో మనిషి బాహ్యాస్పృహను కోల్పోతాడు. నిద్ర అంటే అసలు ఇదే.

"సుఖమహ మస్వాప్సంనకించిద వేదిషమ్" సుఖముగా నిద్రించితిని ఏమి తెలుసుకొన లేకపోతిని అనటం. "అభావ- ప్రత్యయా లంబనా వృతిర్నిద్రా" అభావాన్ని ఆశ్రయించి ఉండే వృత్తి నిద్రావృత్తి అన్నాడు పతంజలి మహర్షి. నిద్రావృత్తి స్వప్న వృత్తి అనే రెండు వృత్తులున్నాయి. నిద్ర నుండి మేలుకొన్న తరువాత నేను నిద్రించాను అన్న జ్ఞానం మనకుంటుంది. ఈ నిద్రాను భవం కేవలం స్మరణ మాత్రమే. అనుభవించని విషయం గూర్చి స్మృతి ఎప్పుడూ ఉండదు. నిద్రించే సమయంలో చిత్తంలో ఎలాంటి వృత్తులు లేకుంటే అనుకూల ప్రతికూల అనుభవాలేవి కలుగవు. నిద్రించాను అంటాము అదే స్వప్నాలు లేని సుఖనిద్ర.

దీనిని బట్టి నిద్రావస్థలో కూడా చిత్తంలో వృత్తులుంటాయని తెలుస్తుంది. జాగ్రదవస్థలో అంటే మనిషి నిజజీవితంలో చేసే అనేకమైన పనులు వివిధములైన ఒత్తిడిలతో బరువు, బాధ్యలతలతో కూడి ఉండుట వలన వాటి ప్రభావం చిత్తంలో వృత్తుల రూపంలో ఏర్పడిపోతాయి. వీటి ప్రభావం వలన జీవుడు సుఖనిద్రకు దూరమవుతాడు.

ప్రాణం నిలవాలంటే అన్నం తినాలి. అది ప్రాణిధర్మం. అలాగే నిద్రకూడా ప్రాణి ధర్మం. అసలు నిద్ర ఎందుకు వస్తుందంటే? అన్నం ఎందుకు తినాలి అనే ప్రశ్నలాగుంటుంది. సృష్టిలో ప్రతి పదార్థము కొన్ని లక్షణాలు కలిగి ఉంటుంది. అట్లాగే జీవుడు అవస్థాత్రయాన్ని కలిగి ఉంటాడనేది, తత్వ్త శాస్త్రంతో బాటు గీతా శాస్త్రం, జీవ శాస్త్రం చక్కగా వివరించాయి.

అన్నం తినాలి. ఆకలేస్తే గాని తినం. తినకపోవటానికి కారణం అనారోగ్యం కారణంగా వచ్చును. అన్నం తినకపోతే నిస్సత్తువ, నీరసం, పనులు చేసుకోలేక పోవటం జరుగుతుంది. అలాగే నిద్రరాక పోవటానికి రకరకాల ఒత్తిడులతో బాధ్యతలతో మనిషి విశ్రాంతికి దూరమవుతుంటాడు. దురలవాట్లకు గురి కావటంతో బాటు అనారోగ్యం కారణంగా కూడా నిద్రలేమి జరుగుతుంది. ఈ కారణాలు స్వయం కృతం.

మనిషికి వృద్ధాప్యం వస్తున్నప్పుడు, స్త్రీలు మోనోపాజ్ స్థితి ఎదుర్కొంటున్నప్పుడు, అనుకోని సంఘటనలు జరిగినపుడు మనస్సు కకావికలమై నిద్రుదూరవౌతుంది. ఇలాంటివి మరికొన్ని నిద్రరాకపోవటానికి సహజమైన కారణాలు.

శిశువు పుట్టినపుడు రోజుకు 18 గంటలు నిద్రపోతుంది. తల్లి గర్భంలో ఉన్న శిశివు కూడా నిద్రపోవటం, కలలు కనటం గూర్చి శరీరక, గర్భో పనిషత్తులు వివరించాయి. వయస్సు పెరుగుతున్న కొద్ది నిద్ర తరిగి పోతుంటుంది. అయితే ఏ మనిషికైనా ఎంత నిద్ర అవసరమంటే రోజుకి 4 నుండి 6 గంటలు సరిపోతుందని, కాదు 7 లేక 8 గంటలు కావాలని భిన్నాభిప్రాయాలు వెలువడ్డాయి. ఎవరికెంత నిద్ర సరిపోతున్నదన్నది ఆ మనిషి శరీరావస్థ మీద ఆధారపడి ఉంటుంది.

మగత నిద్ర, కలత నిద్రలో శరీరంలో ఉష్ణోగ్రత తగ్గడం, శ్వాస, నాడి వేగం పెరగటం, కండరాలు నిశ్చేతనంగా ఉంటాయి. ఆ స్థితిలో కొన్ని దృశ్యాలను చూస్తున్నట్టు వుంటుంది వీటినే కలలు అన్నారు. ఇది నిద్రగాని నిద్ర అసుఖనిద్ర. ఈ తరహా నిద్రవల్ల మనిషి ఆరోగ్యం దెబ్బతింటుంది. నిద్రకి ఆరోగ్యానికి అవినాభావ సంబంధం ఉంది.

నిద్రలేమి వల్ల శారీరక, మానసిక సమస్యలు వస్తాయి. రోగనిరోధక శక్తి క్షీణిస్తుంది. దానితో బి.పి., స్థూలకాయం, మధుమేహం వచ్చే అవకాశాలు ఉన్నాయి. జ్ఞాపకశక్తి నశించటం, శరీరశక్తి సామర్థ్యాలు

తగ్గిపోవటం జరుగుతుంది. మనిషి సహజ లక్షణమైన నిద్రను పలు కారణాల వల్ల దూరం చేసుకుంటే శరీరావస్థ దెబ్బతింటుంది. అలాగే ఒక రోజు అన్నం తినకపోతే కూడ ఆ మనిషి శరీరక మానసిక ఇబ్బందులకు గురి అవుతాడు.

నిద్ర. గాఢనిద్ర, సుఖనిద్రయే సుషుప్త్యావస్థ. ఈ దశలో శరీర ఉష్ణోగ్రత, గుండె వేగం తగ్గిపోవటం జరుగుతుంది. మెదడులోని విద్యుత్ ప్రేరణలు బాగా తగ్గిపోతాయి. శరీరం దేనికి స్పందించనంతగా మారిపోతుంది. ఈ స్థితిలో మనస్సు పూర్తిగా హృదయంలోకి పోతుంది. అప్పుడు జీవుడు మాత్రం సాక్షిగా ఉంటాడు.

ఎవరు కోరుకున్నా ఆరోగ్యం, ఆనందమయ జీవితమే కదా! ఆరోగ్యముగా ఉన్నప్పుడే సుఖసంతోషాలు కలుగునని అందరికి తెలిసినదే. ఆరోగ్యంగా ఉండాలంటే సరైన ఆహారం, సరిపడ్డ నిద్ర ఎంతైనా అవసరము. ఆర్థిక స్తోమత ఒక్కటే మనిషికి ఆనందాన్ని ఇవ్వలేదు. దానికి తోడు ఆరోగ్య రక్షణ ఉంటే మానవ జీవితం ఆనందమయమౌతుంది.

మనిషి జీవితంలో ఎక్కువగా ప్రాధాన్యత నిచ్చేది ఆరోగ్యానికే కదా! అందుకే ఆరోగ్యమే మహాభాగ్యం అన్నారు పెద్దలు. భాగ్యరూపమైన ఆరోగ్యం కావాలంటే మనిషి మంచి నిద్రను పొందాలి. మంచినిద్ర రావటానికి కొన్ని చిట్కాలు చెప్పారు. పరిసర ప్రాంతాల పరిశుభ్రత, మంచిగాలి, వెలుతురు ఉన్న విశ్రాంతి గదిలో నిద్రించటం, పగటి నిద్ర మత్తులో పడకుండటం, నిద్రపోవటం,లేవటంలో ఒక సమయం పాటించడం, నిద్రకు ఉపక్రమించేముందు కాఫీ, టీ, డ్రింక్స్ వంటి మత్తు పదార్థాలు సేవించక పోవటం, తేలిక పాటి ఆహారం తీసుకోవటం, గ్లాసుడు నీళ్ళలో కొంచెము తేనెను వేసుకొని త్రాగటం, నిద్రకు ఒక అరగంట ముందు గోరువెచ్చని నీటితో స్నానం చేయటం వంటిచాలా చిట్కాలు చెప్పారు నిద్ర కొరకు.

రోజుకు 6 లేక 7 గంటల సుఖ నిద్రవల్ల రోగ నిరోధక శక్తి పెరుగుతుంది. శరీరము శక్తిని పుంజుకుంటుంది. కీలక హార్మోనులు సక్రమంగా పని చేస్తాయి. ఉత్సాహము, ఉల్లాసముతో బాటు సామర్థ్యము పెరిగి చక్కటి ఫలితాలను సాధిస్తారు. (జ్ఞాపక శక్తి పెరుగుతుంది) అన్నిటికంటే ఆయుర్ధాయము పెరుగుతుంది. అందుకేనేమో దేవుళ్ళు కూడా నిద్రుపోతూ కనబడతారు. త్రిమూర్తులు, త్రిమాతలే కాదు, ధ్యానపరులు, యోగులు కళ్ళు మూసుకొని నిద్రపోతున్నట్టు చూస్తాము. అయితే దేవుళ్ళ నిద్ర పరనిద్ర, యోగులది యోగనిద్ర, మనందరి నిద్ర సుఖనిద్ర.

ఏమైతేనేమి నిద్రకు ఇంత చరిత్ర ఉన్నది. దాని వలన ఎన్నో ప్రయోజనాలున్నాయి. అటు తిండి, ఇటు నిద్రను పనిగా పెట్టుకొని అదే పని చేయకండి. అట్లాగైతే కుంభ కర్ణుడు ప్రక్కన చేరి పోతారు. ఆయన శాపగ్రస్తుడయ్యి ఆ రెండిని స్వీకరించాడు. మీరేమి శాపగ్రస్తులు కాదు కదా? అతి నిద్ర అన్నిటికి చేటు. అందుకే అతి నిద్రాలోలుడు తెలివిలేని మూర్ఖుడన్నారు పెద్దలు. కావలసిన దానికంటే ఎక్కువగా నిద్రిస్తే అది కూడా ప్రమాదకరమైన దవుతుంది. ఒళ్ళుబండబారి పోతుంది, మెదడు మొద్దుబారి పోతుంది, అప్పుడు ప్రమాదంలో పడక తప్పదు మరి.

"ప్రమాదాలస్య నిద్రాభిః" మరపుచేత, లేక నిద్ర చేత "బధ్నాతి" బంధించుట. నిద్ర తమోగుణము వలన వచ్చును. అదే నిద్ర అధికమైతే మతిమరుపు కలుగుతుంది. దాని వలన సోమరితనం వస్తుంది. సోమరి జీవితంలో ఏది సాధించలేడు. నిద్ర అవసరమన్నారు కదా అని గంటల తరబడి నిద్ర మత్తులో పడితే "లలి లాలి పరమానంద, రామగోవిందాకు బదురు అతి నిద్రా లోలుడు తెలివిలేని మూర్ఖుడు అని పాడాల్సి వస్తుంది. ఎందులోగాని అతి పనికిరాదు. "అతి సర్వత్ర వర్జయేత్".

నిద్రఅవసరం. అది రాకపోతే ఏం చెయ్యాలి? అనేందుకు అనేక

మార్గాలు చెప్పారు. ఇక్కడ చెప్పే నిద్ర సూత్రం ఏమిటంటే? పడుకోవటానికి ముందు ప్రక్క మీద చేరి "ఓ పరంధామా! ఈ దినము నేను చేసిన కర్మలన్నింటిని మనసా వాచా కర్మణా నీకు అర్పించు తున్నాను, దయతో స్వీకరించి నాకు సుఖనిద్రను కలుగజేయమని" ప్రార్థించాలి.

తదుపరి ప్రక్క మీదకు ఒరగి ఎడమ ప్రక్కకు తిరిగి, దుప్పటి కంఠము వరకు కప్పి, శ్వాస ముక్కుతో పీల్చేటప్పుడు "సో"అను అక్షరమును. అట్లాగే శ్వాసను బయటకు వదిలేటప్పుడు "హం" అను అక్షరాన్ని చెప్పుతూ వదలాలి. ఇలా గాలి పీల్చేటప్పుడు, వదిలేటప్పుడు "సోహం" అంటూ ఉంటే చల్లగా నిద్రలోకి జారిపోతావు. దీని ప్రభావం వల్ల దుస్వప్నములు రావు. హాయి హాయిగా నిద్ర పోగలుగుతావు. పైగా మగత, కలత నిద్ర కాదు సుఖనిద్ర పోతారు.

"సోహం" ఆత్మసంబంధమైన మంత్రము. ఈ మంత్ర ప్రభావంచే జీవుడు శాంతించి నిద్రకు ఉపక్రమిస్తాడు.

# 8. త్యాగఫలం మోక్షం

"సర్వ కర్మ ఫల త్యాగం తతః కురు యతాత్మ వాన్" (భ.గీ.12-11) నీవు చేసే ప్రతి కర్మ ఫలాన్ని నాకు సమర్పించు, ఇది గీతా సందేశము. ప్రతి మనిషి నిద్ర లేచింది మొదలు రాత్రి నిద్రపోయేవరకు అనేకమైన పనులు చేస్తూ ఉంటాడు. చేతలతో చేసే కర్మలే కాదు, మనస్సుతో చేసే కర్మ ఫలాన్ని కూడా భగవంతునికి సమర్పించమంటున్నాడు గీత కర్త.

ప్రతివ్యక్తి తన స్వభావానికి అనుగుణంగా ఒంటిపనులు, ఇంటి పనులు, పరుల పనులు ఇంకా పలురకాల పనులు చేస్తూ కాలం గడుపుతుంటాడు. అందులో చాలా పనులు స్వలాభం కోసమే చేసేవిగా ఉంటాయి. దానిలో ఎంత లాభం రాని, దానిని నీవే తీసేసుకో, కొంచెము కూడా నాకొద్దు, కాని ఒక్క మాట చెప్పు 'కృష్ణార్పణమని' అది మనస్ఫూర్తిగా చెప్పు. నాకదే చాలు, తృప్తిపడిపోతాను. ఒక ఆకుపెట్టి మొక్కు , ఇన్ని నీళ్ళు నాకు పోసి మిగిలిన పదార్థాలు, వస్తువులు నీవు అనుభవించు. ఆ ఆకు, నీళ్ళే నాకు చాలు. కాని ఒక మాట ఆ ఇచ్చేది మనస్సు పెట్టి ఇవ్వు., దానిని నేను స్వీకరించి నీకు కావల్సిందిస్తానని భగవానుడు బహుచక్కటి ఉపాయాన్ని అందించాడు మానవ జాతికి.

ఏ కర్మచేసినా అది భగవంతుడే చేయిస్తున్నాడు అనే భావనతో చేసి ఆ ఫలితాన్ని భగవానునికి అర్పణ చెయ్యాలి. ప్రతి వ్యక్తి తన బుద్ధికి తోచిన కర్మలు చేస్తాడు. అవి పుణ్య పాప కర్మ లేవైనా గావచ్చు, ఆ కర్మ ఫలాన్ని భగవానుడు తనకు అర్పించమంటున్నాడు. భగవానుని యందు మంచి చెడ్డలు, స్త్రీ పురుషుల జీవుల బేధాలు లేవు. అందుకు ఆ కర్మ ఫలం ఏది గాని ఆయనకు త్యాగం చేయమంటున్నాడు. తరువాత నీ గూర్చి ఆయన చూచుకుంటాడు.

"సర్వ కర్మ ఫలత్యాగం ప్రాహుస్త్యాగం" (భ.గీ. 18-2) సర్వకర్మల ఫలమును వదులుటయే త్యాగము. చేసిన పనికి ఫలాన్ని ఆశించకపోవటం త్యాగమన్నారు, "విచక్షణాః" పండితులు. త్యాగము అంటే విషయాసక్తిని వదలుట. తాను పొందినది ఇతరుల కొరకు వదలి పెట్టుట. త్యాగం దైవ గుణం.

"త్యాగోత్రివిధః సంప్రకీర్తితః" (భ.గీ. 18-4) త్యాగము మూడు విధములుగా చెప్పబడినది. అవి తామస, రాజస, సాత్త్విక త్యాగములు. స్వధర్మాను సారముగా ప్రాప్తములైన కర్మలను, విద్యుక్త కర్మలను త్యజించుట, తామసత్యాగం. యజ్ఞం చేయటం, ధ్యానంచేయడం వంటివి, శరీరాన్ని బాధించడమే అవుతుందని అవి మనవల్లకాదు అని శ్రమకు భయపడి కర్మలు చేయకపోవటం రాజసత్యాగము. స్వ ధర్మాను సారముగా వచ్చిన కర్మలను విధిగా ఆచరించుటలో కష్ట నష్టములను లెక్కచేయకుండా, కర్మ ఫలాన్ని ఆశించకుండా, నిస్సంగముగా వాటిని ఆచరించుట సాత్త్విక త్యాగము.

"మోహాత్ తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః" కేవలం మోహముచేగాని, అజ్ఞానముచేగాని విద్యుక్త కర్మలను చేయటం తామసం. మానవుని పరిపక్వమునకు తగిన విధముగా నిత్యకర్మలు ఏర్పడినవి. తినడం, పండటం, తన పని చేసుకుపోవటం, డబ్బు సంపాదించడం, తన కుటుంబ క్షేమం చూసుకోవటం, ఇవే తన విద్యుక్త కర్మలను కోవటం, సంఘానికి తానేమికాను, ఏమి చేయలేనని నడచు కోవటం, స్వార్థం కోసం ఏ పని చేయటానికైనా వెనుకాడకపోటం తామస త్యాగికి సరిపోతుంది.

శ్రమ లేక పోతే జీవనము లేదు. శరీరము వచ్చింది కర్మలు చేయటానికేనని రాజస స్వభావులు కష్టపడతారు. కాని కొందరు శరీరము అలసి పోకుండా పని చేయటానికి చూస్తారు. ఫలితాన్ని పొందటానికి ముందే ఉంటారు. అదృష్టం కొద్ది మనిషిగా పుట్టాను.

ఎవడో కర్మ దరిద్రుడగు పాపివలె నా శరీరమును కష్టపెట్టి ఎందుకు ఎండబెట్టుకోవాలి? పాటుపడి ఫలితం అనుభవించడమేమిటి? ఈరోజు నాకు లభించిన సుఖమును అనుభవించి సౌఖ్యముగా ఉంటాను అనుకొంటూడ రాజస త్యాగి. ఇట్టి వానికి చిత్తశుద్ధి కనుచూపు మేరలో కనబడదు.

"శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ధ్యానం విశిష్యతే
ధ్యానాత్కర్మ ఫలత్యాగ త్యాగాచ్ఛాన్తి ర నంతరమ్॥" (భ.గీ. 12-12)

అభ్యాసం కంటే జ్ఞానం దాని కంటే ధ్యానం మేలు, ధ్యానం కంటే సర్వ కర్మ ఫల త్యాగం మేలు. అట్టి కర్మ ఫలత్యాగంచే శాంతి లభించును. ఫలత్యాగం యొక్క విశిష్టత ఏమిటో తెలియజేయుచున్నది శ్లోకం.

సాధనతో దేనినైనా సాధించవచ్చును. చెప్పిందే అనేక సార్లు చెప్పటం, చేసిందే అదేపనిగా చేస్తే విషాన్ని కూడా అమృతం లాగ త్రావచ్చునన్నారు పెద్దలు (ప్రాక్టీసు మేక్స్ పర్‌ఫెక్ట్) అభ్యాసము కూసు విద్య. పట్టుదలతో అభ్యాసము చేస్తే మనిషి మహాత్ముడవ వచ్చును.

అభ్యాసం కన్నా జ్ఞానం మేలు. అభ్యాసముతో అన్నిటిని సాధించవచ్చును. దానికంటే జ్ఞానం ఉత్తమమైనది. ప్రపంచాన్ని గూర్చి తెలుసుకోవటం జ్ఞానం. ప్రకృతి పురుషుల సంయోగముచే ఏర్పడినది ప్రపంచము. ఈ రెండింటిని వేరు వేరుగా తెలుసుకోవటం జ్ఞానం. "జ్ఞానీత్వాత్మైవ మేమతమ్" జ్ఞాని భగవానుని ఆత్మ స్వరూపం. అట్టి జ్ఞానం ఉత్తమమైనదంటే, దాని కంటే ధ్యానం ఉత్తమోత్తమమైనది. "జ్ఞానాధ్యానం విశిష్యతే" జ్ఞానం కంటే ధ్యానం గొప్పది. జ్ఞానాన్ని సాధన ద్వారా అనుభవమునకు తెచ్చుకొనుట ధ్యానం. చిత్త ఏకాగ్రత దాని సంబంధమగు జీవన విధానము, సమత్వము, సమదృష్టి కలిగియుండుట ధ్యానము. ఇది రాజయోగము, జీవన్ముక్తికి కారణమైనది.

ధ్యానం వలన మనో నిగ్రహం కలిగి శాంతి లభిస్తుంది. దీనికంటే "ధ్యానాత్కర్మ ఫలత్యాగః" ధ్యానం కంటే కర్మఫల త్యాగం ఇంకా గొప్పది. ఫలత్యాగమే కర్మయోగము. ఇదే విషయాన్ని గీతలో పదే పదే చెప్పబడినది. స్వధర్మాన్ని ఆచరించటం, పర ధర్మానికి ప్రాకులాట లేకుండటం. కర్మఫలితాన్ని గూర్చి అతిగా ఆలోచించకుండా, కర్మను యోగముగా మార్చుకొని కర్మలాచరించిన కర్మఫల బంధము నుండి విముక్తులగుదురు. అప్పుడు జ్ఞానులు పొందే స్థానాన్ని కర్మయోగులు పొందుతారని నిష్కామ కర్మ సిద్ధాంతాన్ని గీత బలపరచినది. అందుకే ధ్యానం కంటే కర్మఫల త్యాగం అత్యుత్తమమయినదని చెప్పబడినది.

"త్యాగా శాంతి అన్తరయ్!" కర్మ ఫలాన్ని త్యజించుట వలన జీవితంలో శాంతి ఒనగూరును. త్యాగం రజోగుణ స్వభావము. మానవ జీవన సరళిలో ఎందరో త్యాగమూర్తులు కనిపిస్తారు. వారు అప్పుడు, ఇప్పుడు ఎప్పుడు ఉంటారు. శిబిచక్రవర్తి తన శరీరాన్ని కోసి ఇచ్చాడు. ఏకలవ్యుడు తన బొటన వ్రేలు నరికి గురువు గారికి బహుమానంగా ఇచ్చాడు. కోట్లు గడించిన శ్రీనివాస నాయక్‌కు కనువిప్పు కాగా తన సర్వస్వాన్ని దానం చేసి పురందర దాసుగా మిగిలాడు. దధీచి మహర్షి తన అస్తులను త్యాగం చేస్తాడు. తన సహజ కుండలాలు ప్రాణాలు రక్షించేవని తెలిసినా వాటిని త్యాగం చేస్తాడు దాన కర్ణుడు. భర్త కోసం జీవితాన్ని సహగమనం చేసే స్త్రీమూర్తులున్నారు. ఒక కుటుంబంలో అందరూ సంతోషంగా ఉండాలంటే, అందులో ఏ ఒక్కరో తన సుఖాలను, భావి జీవితాన్ని త్యాగం చెయ్యాలి. ఇలా ఎందరో త్యాగధనుల గాధలు చరిత్రపుటల్లో భద్రంగా ఉన్నాయి.

ఒక్క మానవ జాతియే కాదు పశు పక్ష్యాదులు సైతం త్యాగము జేసి జీవితాలను చరితార్థము చేసుకొన్నాయి. నాడీ జంఘుడనే కొంగ తనను సంహరించిన వానికే ప్రాణభి పెట్టిన త్యాగశీలి. కామ రహితమైన

ప్రేమ ఆత్మత్యాగాన్ని కోరుతుంది. ఇదియే శాశ్వితమైనది, అజరామరమైనది.

అభ్యాసము, జ్ఞానం, ధ్యానం, నిష్కామ కర్మ ఫల త్యాగము ఒకదాని కంటే మరొకటి గొప్పదని చెప్పి, దాని వలన కలిగే ఫలం, శాంతి పదమని చెప్పబడినది. త్యాగం వలన చిత్తము శాంతిస్తుంది. కర్తృత్వ రాహిత్యము, అహంభావ త్యాగంతో చిత్తము పరిశుద్ధము కాగా ఆత్మ ప్రత్యక్షము కాగలదు. కర్మ ఫల త్యాగం వల్లనే శాంతి లభించును. స్వార్థాన్ని విడిచిపెట్టి కర్మఫలాన్ని ఈశ్వరార్పణ మొనర్చిన, మనో నిబ్బరం కలిగి పరమాత్మ స్థానమైన శాంతి పధము లభించును. శాంతి ధామమే మోక్షప్రదము.

# 9. మనోవాక్ సంయమము

"సంత్యక్త వాసనా న్మౌనాధృత్ నాస్త్యుత్తమం" మనిషి తన జీవన ధర్మాన్ని ఆచరిస్తూ అంటే భార్యా బిడ్డలను, తన వృత్తి వ్యవహారములను సక్రమముగా నిర్వహిస్తూ ఆ సమయములో అవసరమున్నంత వరకే మాట్లాడి, ఆ వెంటనే మనస్సునకు ఏ తలంపు లేకుండా ఏ కార్యము చేయక ఉండుట మౌనము.

మనోవాక్కాయ కర్మలచే ఏ విధమైన కార్యములు చేయకుండుట మౌనము. కేవలం నోటితో మాట్లాడకుండా మనస్సునిండా ఏవేవో తలంపులతో ఉండుట మౌనము కాదు. మాట్లాడక పోవటంతో బాటుగా మనస్సులో కూడా ఎలాంటి తలంపులు లేకుండా ఉండుటయే మౌనము.

"నాన్యోపతాని వచనం మౌనవ్రత మితీర్యతే" అన్యులకు తాపము కలిగించని మాట మౌనము. కేవలం మాట్లాడకుండటమే మౌనము కాదు. ఇతరులకు ఏ మాత్రము హాని కలిగించని మాట కూడా మౌనమే. అంటే మాట్లాడకుండటమేనని అర్థం. మౌనం పాటించు వాడు ముని లేక మౌని.

మౌనాన్ని వ్రతముగా ఆచరించాలి. వ్రతమంటే నోము, శపథము, నడవడిక, కార్యము, వేదవిహిత క్రియ, సంస్కారము మొదలగు అర్థములు గలవు. పురాణములందు అనేకానేక వ్రతములు వివరించబడినవి. ఆశయ సాధన కోసము చేయు వివిధ ప్రక్రియలు వ్రతాలు. వ్రతమాచరించుటకు అనేక నియమ ఆచారములున్నవి. కార్యాలు నిర్విఘ్నముగా సాగిపోవాలంటే వినాయక వ్రతమాచరించాలి.

ఏకాదశి వ్రతాని గూర్చి శివుడు పార్వతికి చెబుతాడు. ఏకాదశి రోజున ప్రాతః కాలమున లేచి నిత్యకర్మలు ముగించుకొని వైష్ణవ

మందిరానికి వెళ్ళి తాను వ్రతమాచరించుటకు నిశ్చయించుకొన్నాని, దానిని నిర్విఘ్నంగా చేయూలాగున చూడమని శ్రీహరిని ప్రార్థించాలి. ఆరోజు ఉపవాసం ఉండి, శ్రీమన్నారాయణుని ధ్యానిస్తూ ఆనాటి రాత్రి జాగరణ చెయ్యాలి. జాగరణ సమయాన్ని భక్తి ప్రపత్తులతో గడపాలి. మరుసటి రోజు ఉదయాన ద్వాదశి ఘడియలుండగా శ్రీహరిని పూజించి నైవేద్యము పెట్టి వ్రత ఉపవాస దీక్ష విరమించాలి.

ఏకాదశి వ్రతం శ్రీ మహావిష్ణువుకు అత్యంత ప్రీతి పాత్రమైనది. అంబరీషుడు ఈ వ్రతాన్ని ఆచరించి మహోన్నతుడైనాడు. శ్రీకృష్ణుడు తన ఒక్కదానికే స్వంత కావాలని సత్యభామ నారదుని సలహామీద "పతివశ్య" వ్రతము ఆచరిస్తుంది. "మీరజాలగలడా నా అనతి సత్యాపతి వ్రత విధాన మహిమన్"అని సత్యభామ వ్రతమహిమ చక్కగా వివరిస్తుంది. ఇంత చేసినా ఆమెకు వ్రతము చెడ్డా ఫలం దక్కలేదు.

పురాణాలు విప్పితే కోకొల్లలుగా వ్రతాలున్నాయి. వ్రత ఉద్దేశ్యము వ్రతి తలపెట్టిన కార్యసాధన ఫలం కోసం. మౌనం పాటించడము కూడా కొన్ని నియమాలతో కూడుకొని ఉన్నది. అందుకే మౌనాన్ని వ్రతముగా ఆచరిస్తే దాని ఫలితం విశేషముగా ఉంటుంది.

బౌధాయన ధర్మసూత్రం వ్రతములను గూర్చి చెబుతుంది. "ఉపన్నాయే న వయోత్ర తతా శాక భక్షతా ఫల భక్షతా ప్రసృత యావకో హిరణ్య ప్రాశనం ఘృత పాశనం సోమ పాశనం ఇతి మేద్యని" నీళ్ళు త్రాగి యుండుట, పచ్చికూరలు, పండ్లు, గంజి త్రాగుట, హిరణ్యా అహారం, ఘృత ప్రాశనము, సోమపానము అనునవి పవిత్ర వ్రతములు. కేవలం ఆచార వ్యవహారములతో చేయు వ్రతములే కాదు, నీళ్ళు త్రాగి బ్రతకటం కూడా వ్రతమట. అహారం దొరకని అభాగ్యులు నీళ్ళు త్రాగి కడుపు నింపుకొని, కాళ్ళు ముడుచుకుని పడుకోవటం, అలాగే సాత్విక అహారము తీసుకొంటూ ధ్యాన, తపస్సు లాచరించుటకు చేయు భోజనాదులు 'మామూలు వ్రతాలు కాదు పవిత్రవ్రతాలు.

మౌనవ్రతానికి ప్రధాన అంగాలు నోరు, మనస్సు. మనస్సు అంతరింద్రియము. వదరు బోతులు, ఏదో ఒకటి ఎప్పుడూ మాట్లాడే వాగుడు కాయలు. చపలచిత్తులు మౌనవ్రతం పాటించలేరు. నోరున్నది వాగటానికే కాదు, తినటానికి త్రాగటానికి, నవ్వటానికి, ఏడ్వటానికి, చుంబించటానికి, కరవటానికి, మంచి చేసుకోవటానికి, చెడు తెచ్చుకోవటానికి మొదలగు వాటికి ఉపయుక్తమైన జ్ఞానేంద్రయము. వీటన్నింటిని చేయించి ఆటలాడించేది మనస్సు. కనుక మౌనవ్రతధారి వీటిని అదుపులో పెట్టుకోవటానికి శ్రద్ధాసక్తుల ప్రయత్నించాలి.

మౌనవ్రతము చేయువారు మితభాషణం చేయుట మొదట అలవర్చుకోవాలి. మౌనవ్రతం చేయటానికి తగిన స్థలము, వాతావరణం కూడా అవసరం. అన్నిటిని ప్రేమించటం నేర్చుకోవాలి. ఉత్సాహంగా, సంతోషముగా ఉండటానికి ప్రయత్నించాలి. అన్ని జీవులు నా జీవనం వంటివే, అందరిలోనూ భగవత్ స్వరూపమున్నది, నాకు ఎవరి యందు ద్వేషము, అసమానతలు లేవు, నేను దేనికి అధైర్యపడవలసిన పనిలేదు మొదలగు విషయాలను మౌనవ్రత సమయంలో మనస్సులో అనుకోవాలి.

మనస్సు నియంత్రణతో బాటు వాక్ సంయమము పాటించాలి. ఆయా వ్యక్తికిగల అవకాశమును బట్టి, మనస్సు పరిస్థితిని బట్టి మౌనవ్రతకాల పరిమితిని నిర్ణయించుకోవాలి. మనస్సు నిర్లిప్తంగా, ప్రసన్నముగా ఉండాలి అంటే తానుచేసే వ్యవహారములు ఒక క్రమ పద్ధతిలో ఉండాలి. తన నిత్య కార్యక్రమములు ప్రణాళికా బద్ధంగా, నిర్దిష్టమైనవిగా ఉండాలి. తాను నీతి నియమాలకు కట్టుబడి జీవించటచానికి అలవాటు పడినప్పుడు మనస్సు నిర్లిప్తముగా నుండును. అప్పుడు మౌనవ్రతము అవలంబించిన వ్రతి అద్భుతమైన శక్తులను పొందును. ఆచార్య వినోభా భావే గారు ఎన్నోసార్లు మౌనవ్రతాన్ని ఆచరించినట్లు అట్లే గాంధీజి కూడా మౌనవ్రతం ఆచరించినట్టు మన

మందరము చదువు కొని తెలుసుకొన్నాము. దీని వలన వారు మహాత్ములు కాగలిగినారు.

యమ, నియమాలు యోగానికి మొదటి రెండు అంగాలు. యోగాభ్యాసము గావించిన యోగి భగవత్ స్వరూపుడౌతాడు, తానెవరో తెలుసుకోగలుగుతాడు. యోగి అంటే కృష్ణ పరమాత్మకి పరమప్రీతి. అందుకే అర్జునా "యోగీభవ" అంటాడు.

యోగాంగమైన నియమములో తపస్సు ఒక అంశము. తపస్సు ద్వంద్వములను జయించుటకు చేయు సాధన. అందులో మౌనమొకటి. మౌనము రెండు విధాలు 1) కాష్టమౌనము అంటే ఏ విధమైన సంజ్ఞలు కూడా చేయకుండా ధ్యాన ముద్రలో నుండుట. ఇది తాపసులు, యోగులు పాటించుమౌనము. 2) ఆకార మౌనము అంటే వాక్కును మాత్రము నిరోధించి, సంజ్ఞలు ద్వారా కార్యములు చేయుట. మౌనవ్రతి మొదటగా చేయు ప్రయత్నము.

మనుష్యులు వివిధములుగా ప్రవర్తిస్తుంటారు. కొందరు ఏదేదో మాట్లాడుతూ పనులు చేస్తూ 'యమ' బిజీగా ఉంటారు. కొందరు తక్కువగా మాట్లాడుతూ పనులు చేసుకుపోతుంటారు. తక్కువగా మాట్లాడే వారంటే వాగుడు కాయలకు భయం. వదరుబోతు అర్ధగంట అనర్గళముగా మాట్లాడితే తక్కువ మాట్లాడు వారు ఒక్క మాట మాట్లాడి ఊరుకొంటారు. అసలు వీరి భావన ఏమిటో ఎదుటు వారికి అర్థం కాదు. "వీడేంటిరా బాబు మాట్లాడితే నోటిముత్యాలు రాలిపోతాయా అన్నట్టు మాట్లాడతాడు. మాట్లాడటం రాదా? మూగవాడు లాగుంటాడు. ఏమైనా ఇటువంటి వారిని అర్థం చేసుకోవటం కష్టం బాబు"అని వాళ్ళను వదిలేస్తారు.

తక్కువ మాట్లాడే వారిని నెమ్మదస్తులంటారు, మంచి వారంటారు. ఆ మంచి తనం తక్కువగా మాట్లాడే కోడలి పిల్లకు

శాపంగా మారుతుంది. ఏమైన అను, తిట్టు, కొట్టు, ఉలకదు, పలకదు ఏం మనిషో! అమ్మా బాబు ఎట్లా కన్నారో, మా పాలిటపడేసారు'అని అత్త ఆడపడుచులు ఆరెళ్ళు పెడతారు. వారు ఎంత నోరు పారేసుకొన్నా కోడలు తన మూగనోము వదలదు. తక్కువ మాట్లాడేవారిలో మనోసక్తి ఎక్కువగా ఉంటుంది.

'ఎంత మాట్లాడితే అంత ఆయుః ప్రమాణము తరిగి పోతుందని మనిషి జీవన ప్రమాణాన్ని శ్వాసమీద లెక్కకట్టారు యోగిపుంగవులు.'

| వివిధ సమయములలో | | బయటకు వెళ్ళి శ్వాస | లోపలికి ప్రవేశించు శ్వాస | నష్టపోవు పోవుశ్వాస |
|---|---|---|---|---|
| 1. | మాట్లాడనప్పుడు | 12 అంగు॥ | 8 అంగు॥ | 4 అంగు॥ |
| 2. | నడచునప్పుడు | 16 అంగు॥ | 8 అంగు॥ | 8 అంగు॥ |
| 3. | పనులు చేయునప్పుడు | 20 అంగు॥ | 10 అంగు॥ | 10 అంగు॥ |
| 4. | పోట్లాటలప్పుడు | 24 అంగు॥ | 12 అంగు॥ | 12 అంగు |
| 5. | నిద్రపోవునప్పుడు | 48 అంగు॥ | 30 అంగు॥ | 18 అంగు॥ |
| 6. | పరుగులెత్తుట(ఆటలు) | 54 అంగు॥ | 27 అంగు॥ | 27 అంగు॥ |
| 7. | సంభోగ సమయంలో | 64 అంగు॥ | 24 అంగు॥ | 40 అంగు॥ |

సాధారణముగా మనుష్యుడు ఒక రోజులో 21,600 శ్వాసలు వ్యయము చేయును. అట్లు చేయుటచే 100 సం. వరకు జీవించును. దీనికంటే ఎక్కువ శ్వాసను ఖర్చు పెట్టిన ఆయుః ప్రమాణము అంత తగ్గిపోవును. (జీవబ్రహ్మైక్య రా.సా.)

ఇక్కడ ఆయుః ప్రమాణము చెప్పవలసిన అవసరము ఏమిటంటే మౌనవ్రతము ఆచరించుట వలన శ్వాస వ్యయమును తగ్గించుకొని మరింత ఎక్కువ కాలం బ్రతకటం జరుగుతుంది. ఎవరు కోరుకొన్నా ఎక్కువ కాలం బ్రతకాలనే కదా? అందుకు మౌనవ్రతం మంచి వరం.

మౌనవ్రతం వల్ల అనేకమైన ఫలితాలను పొందుతాడు వ్రతి. మౌనవ్రతం వల్ల అమూల్యమైన ప్రాణశక్తిని కాపాడు కొనవచ్చును. వాక్ఇంద్రియాన్ని మౌనం వల్ల జయించిన ఇతర ఇంద్రియాలను అరికట్టటకు మార్గం సుగమం అవుతుంది.

మౌన వ్రతమును పాటించిన వారి మనస్సు నిశ్చలమైన నిర్మల మౌతుంది. అప్పుడు తన అంతరాత్మ నుండి ఒక విధమైన ప్రబోధము వినబడుతుంది. ఆ స్థితికి చేరిన వారు అహంకార రహితులై ఆనందదాయకమైన జీవితమును అనుభవించును. మనోవాక్ సంయమము ఒక తపస్సు. అట్టి తపస్వి ఆధ్యాత్మిక పరంగా అనేకమైన శక్తులు కలిగి యుండును. వీరు సాధువులు, సన్యాసులు, మునులు, ఋషితుల్యులుగా ఉంటారు.

మౌన సాధన శక్తి ఏమిటో ఈ క్రింది కథ తెలియజేస్తుంది.

అర్జున సుతుడు పరీక్షితుడు కలియుగ ప్రారంభమున రాజ్యపాలన చేపట్టాడు. ఒకనాడు వనానికి వేటకై వెళ్ళి వేటలో అలసిపోయాడు. దప్పిక వేసింది. ఎక్కడ వెదికినా నీళ్ళు కానరాలేదు. కొంత దూరము వెళ్ళిన తరువాత మౌన ధ్యానములో నున్న శమీక ఋషిని గాంచాడు. దాహతాపం దుర్భరం కాగా ఆ మునిని నీళ్ళడిగాడు. ఆముని ఉలుకు పలుకు లేకుండా ఉన్నాడు. ఆకలి దప్పులతో బాధపడుతున్న పరీక్షితునికి, ముని మౌనం తనను నిరాదరణకు గురిచేసినట్లనిపించింది. అదుపు తప్పిన మనస్సు స్థితిలో ఒక చచ్చిన పామును ఆ ముని మూపున వేసి వెళ్ళిపోయాడు.

మౌన సమాధిలో నున్న ఋషి, విషయం తెలుసుకొనే స్థితిలో లేడు. శమీక ఋషి కుమారుడు శృంగి అక్కడిగి వచ్చి తన తండ్రి మీద ఉన్న మృత సర్పాన్ని చూసాడు. శృంగికి చెప్పరానంత దుఃఖం వచ్చింది. తన తండ్రికి ఇంత అవమానము చేసిన వాని మీద చెప్పరాని

ఆగ్రహం వచ్చింది. అంతే కౌశికీ నదికి పోయి ఆచమించి, శుచియైన నీళ్ళు దోసిట తీసుకొని "ఏడవ నాడు తక్షక ఫణీంద్ర విషాతల హేతిసం హతిన్"అని శపించాడు. శృంగి శాపనార్ధ ప్రకారము ఆనాటి నుండి 7వ నాడు తక్షక సర్ప విషజ్వాలలకు పరీక్షిన్మహారాజు హతుడయ్యాడు.

శ్రీమద్భాగవతం అందించిన ఈ కథ శమీక ఋషి, ఆయన కుమారుడు శృంగి మౌనిమూర్తుల అద్భుత శక్తిని తెలియజేయుచున్నది.

జప తప ధ్యానయోగ సాధనలన్నీ నిర్మలమైన మనస్సుతో మౌన రూపంలో సాగిపోయేవే. వీటి ఫలితం ఆత్మజ్ఞానం పొందటం, చివరకు ఆనందో బ్రహ్మలో ఐక్యమయి పోవటం. భగవంతుని కోసం పరితపించే వారు మనోవాక్ సంయమం పాటించి ఆత్మరూపంలో ఐక్యమైపోండి.

# 10. ప్రణామము

"నమః పురస్తాదథ పృష్ఠతస్తే,
నమోఽస్తుతే సర్వత ఏవ సర్వ...." (భ.గీ.)

ఓ భగవాన్! నీకు ముందు వెనుకలకు నమస్కారము చేస్తున్నాను. సర్వ రూపా! నీకు అన్ని వైపులకు నమస్కారము. "సర్వం సమా ప్నోషి తతః అసి సర్వః" భగవాన్! నీవు అంతటా వ్యాపించి సర్వ స్వరూపుడవయ్యావు. బ్రహ్మాండ విశ్వరూపాన్ని దర్శించిన అర్జునుడు "కృష్ణా సర్వం నీవై సర్వత్రా వ్యాపించి యున్న నీకు అనేక విధాలుగా నమస్కారాలు చేస్తున్నాను"అంటాడు విశ్వరూప సందర్శనము చేసినప్పుడు.

నమస్కారము చేయు వ్యక్తికి మరి దేనికి గాని తన విధేయతను తెలియజేయటం నమస్కారము. నమస్కారాలు అనేక విధాలుగా చేస్తుంటారు. నమస్కారమండి, నమస్కార్, నమస్తే, నమోనమః, వందనము, ప్రణామము, దండాలు, ప్రార్థన, స్తుతి, నమాజు మొదలైనవి.

నమస్కారాలు ఆయా వ్యక్తుల సంస్కారాన్ని బట్టి పెడతారు. నమస్కారము పెట్టుటకు బేధము లేదు. చిన్నవారు పెద్దవారికి, పెద్దవారు చిన్న వారికి, ఇరువురి మధ్యనే కాదు, దేవతలకు, దేవుళ్ళకు, దైవశక్తులు కలిగిన (అ)సమాన్యులకు, చెట్లకు, పుట్టలకు, పశు పక్ష్యాదులకు ఇలా దేనికైనా నమస్కరిస్తూ ఉంటారు. మనుష్యులు మాత్రమే కాదు నమస్కరించేది, జంతువులు, కోతులు వగైరాలు దణ్ణాలు పెట్టడం మనం చూసే ఉన్నాము.

దండాలు వివిధ రీతుల్లో చేస్తారు. రెండు అరచేతులు కలిపి నెత్తిమీద పెట్టి పెడతారు. ఇంకొకరు అరచేతులు కలిపి నుదిటి మీద పెట్టి చేస్తారు. గుండె మీద పెట్టి చేస్తారు. కొందరు ఒక చేతిని చిన్నగా

విసురు కొంటూ చేస్తారు. ఇంకొందరు ఒక చెయ్యి ఎక్కువగా కిందికి పైకు ఊపుతూ చేస్తారు. వేరు కొందరు సగం వంగి చేస్తారు. కొందరు మోకాళ్ళ మీద వంగి చేస్తారు. వేరు కొందరు పాదాలు తాకి చేస్తారు. మరికొందరైతే పాదాల మీద పడి చేస్తారు. వేరు కొందరు పూర్తిగా నేల మీద బోర్లగా పండుకొని చేస్తారు. మ్రొక్కుకొన్న వారు దొర్లుకుంటూ చేస్తారు. ఇలా ఎవరి బుద్ధికి తోచిన విధంగా వారు నమస్కారాలు చేస్తుంటారు.

"నమః పురస్తాత్ అథపృష్టతః తే" నేను నీకు ముందూ వెనుక నమస్కరించుచున్నాను. "నమః అస్తుతే సర్వతః ఏవ సర్వం" నీకు అన్ని వైపులకు నమస్కరించుచున్నాను. అర్జునునికి ఎందెందు వెదికినా అందందు కనబడుచున్నది భగవంతుని రూపం. సర్వము వ్యాపించి ఒక్కరూపంగా కనబడితే కదా, ఒక్క నమస్కారముతో సరిపుచ్చు కోవటానికి అన్ని దిక్కులు వ్యాపించగా ఏ దిక్కు చూచినా ఏవేవో రూపాలు, అద్భుతాలు ఆ విశ్వరూపంలో దర్శనమిస్తున్నాయి.

అందుకే ఇట్లా లాభం లేదనుకొని "మహాదేవా! నీకు ముందు వెనుక, పైనా, క్రిందా, అటుప్రక్క ఇటుప్రక్క, ఎన్ని ప్రక్కలుంటే అన్ని ప్రక్కలకు నమస్కారం, నమస్కారం అంటూ అన్ని నమస్కారాలు సమర్పించాడు అర్జునుడు."

మనమూ నమస్కారములు చేస్తుంటాము. కాని అన్ని లక్షలసార్లు నమస్కారములు ఒక్కసారి చేసి ఉండము. కారణం? అర్జునుడు కొచ్చిన ఛాన్సు మనకు తగలలేదు. ప్రయత్నించితే వస్తుందేమో! "అన్యథా శరణం నాస్తిత్వమేవ శరణం మమ" అని ఆ దివ్యమూర్తులకు నమస్కరించండి, ఆ అదృష్టం మనకు పట్టవచ్చునేమో?

ఒక్కసారి శ్రీకష్ణ పరమాత్మకు నమస్కరిస్తే పది అశ్వమేధ యాగముల అనంతరము చేయబడు అవబృథ స్నానముతో సమాన

మని భారతం చెబుతుంది. నమస్కారం వలన నిరాడంబరత అలవడు తుంది. దానివల్ల మనిషిలోని అహం తగ్గుతుంది. సేవా భావం కలు గుతుంది. దాని ఫలితంగా మనిషిలో వినయ విధేయతలు కలుగుతాయి. తద్వారా భక్తి భావం ఏర్పడుతుంది. అది భగవంతునికి దారి చూపుతుంది.

"త్యాగో సమశ్చబ్దస్యవాచ్యార్థః నమః" అంటే త్యాగమని వాచ్యార్థం. నేను నీకంటే తక్కువ వాడను, నీవు నాకంటే పెద్దవాడనే భావం స్ఫురిస్తుంది. నమస్కారం ఒక మంత్రం లాంటిది. శత్రుభావమును లేకుండా చేయుశక్తి నమస్కార బాణమునకున్నది. పెద్దలకు నమస్కరించు విధంగా విరోధికి కూడా నమస్కరించినప్పుడు అతనిలో నీ యెడల మార్పు కలుగుతుంది. నీవంటే మంచి భావం ఏర్పడుతుంది. ఆ విధంగా నమస్కారం వశీకరణ మంత్రం లాంటిది.

నమస్కారము త్రివిధములు. కాయక నమస్కారం, రెండు అరచేతులు కలిపి చేయు నమస్కారం, సాష్టాంగ నమస్కారం, అష్టాంగ నమస్కారము, పంచాంగ, త్రయంగ ఏకాంగ నమస్కారములు కాయకము. 2. వాచిక నమస్కారము నోటితో ఉచ్చరించునది. నమోనమః, దండం, ప్రణామము, వందనం, ప్రార్థన, నమస్తే మొదల గునవి. 3. మానసిక నమస్కారము భగవంతునికి మనఃపూర్వకముగా నమస్కరించుట. మనస్సులోనే చేయు ధ్యానము, జపం. పైకి ఉచ్చరించకుండా లోలోపలే భగవానుని స్మరించటం. నమః తిప్పిరాస్తే మనః అవుతుంది. అంటే నమస్కారము మనస్ఫూర్తిగా చెయ్యాలి.

ఎవరెవరికి ఏ విధములైన నమస్కారములు చెయ్యాలో మనుస్మృతిలో చెప్పబడినది. "అభివాదన శీలస్య నిత్యం వృద్ధోప సే వినః చత్వారి తస్య వర్థంత ఆయుర్విద్యా యశో బలమ్॥" పెద్దలకు ఎప్పుడూ నమస్కరించే స్వభావులకు, పెద్దలను సేవించు వారికి ఆయుస్సు, విద్యా, కీర్తి, బలం వృద్ధి చెందుతాయి.

"అభివాదాత్పరం విప్రో జ్యాయం నమభివాదయన్" బ్రాహ్మణుడు తనకంటే పెద్ద వారికి నమస్కరించి నప్పుడు "అసౌనా మాహమస్మి" అని తనపేరు చెప్పుకోవాలి. పెద్దలకు స్త్రీలకు కూడా ఇట్లే నమన్కరించ వలయును. నమస్కారము స్వీకరించినవారు "ఆయుష్మాన్ భవసౌమ్య" అని ఆశీర్వ దించాలి.

నమస్కార ప్రతి నమస్కారములు అయిన తరువాత బ్రాహ్మణుని కులమడుగవలయును, క్షత్రియుని నామయడుగ వలయును, వైశ్యుని క్షేమము, శూద్రుని ఆరోగ్యము అడుగనలెను.

"శిరో హస్తౌ చ కర్ణౌచ చుబుకమ్ బహు యుగ్మం అష్టాంగ చ నమస్కారమ్". తల, చేతులు, చెవులు, గడ్డము, రెండు భుజాలు నేలపై ఆనించి చేయు అష్టాంగ నమస్కారము అన్నిటి కన్నా ఉత్తమమైనది. ఇది దేవుళ్ళకు, గురువులకు పెద్దలకు చేయు నమస్కారం. ఇది స్త్రీలు చేయకూడని నమస్కారం.

పంచాంగ నమస్కారం. శిరస్సు, చేతులు రెండు, రెండు భుజాలు మోకాళ్ళపై నుండి (వంగి) చేయు నమస్కారం. ఇది స్త్రీలు ఆచరించదగిన నమస్కారము. త్రయంగ నమస్కారము. రెండు చేతులు జోడించి తలపై పెట్టుకొని చేయు నమస్కారం. "ఏకాంగతు నమస్కారం శిరసైవ కృతా భవేత్" తలను మాత్రం వంచి చేయు నమస్కారం ఏకాంగ నమస్కారము.

"ఉరసా శిరసా....ప్రణామో ష్టాంగముచ్యతే" రొమ్మును, తలను భూమికి తాకించి దృష్టి దైవము పైసారించి మనస్సులో దేవుణ్ణి ప్రార్థిస్తూ నమః అని చెబుతూ రెండు పాదాలను కలుపుచూ రెండు చేతులతో నమన్కరిన్తూ రెండు చెవులను భూమికి తాకిన్తూ బోర్లాపడి నమస్కరించటం సాష్టాంగ నమస్కారము. సాష్టాంగ నమస్కారములో

త్రివిధ నమస్కారములు మిళితమై ఉన్నవి. ఇది అన్ని నమస్కారముల కన్నా శ్రేష్టమైనది. స్త్రీలు ఈ నమస్కారము చేయకూడదు.

నమస్కారము చేయక తప్పదన్న భావనతో గాక శ్రద్ధగా మనః పూర్తిగా నమస్కరించాలి. అర చేతులు కలుపుతూ వాటిని నుదిటి మీదగాని, వక్షస్థలము మీదగాని ఉంచి నమస్కరించాలి. చేసే నమస్కారము వినమ్రత భావనతో కూడినదై ఉండాలి. వీటిని పాటించి నమస్కరిస్తేనే నమస్కారము యొక్క నమ్రతా ప్రక్రియ పూర్తిగా అవుతుంది. అప్పుడు నమస్కార ఫలం సిద్ధిస్తుంది.

"నమో నస్తేఽను సహస్ర కృత్వంః, పునశ్చ భూయోపి నమోనమస్తే" (భ.గీ. 11 అ. 39 శ్లో.) భగవాన్ నీకు అనేక నమస్కారములు, అనేక వేల నమస్కారములు, మరల మరల నమస్కారములు. సమస్త దేవతలను నీయందు గాంచినాను. పార్థసారథిలో పరికించి విశ్వరూపాన్ని దర్శించి భగవానుని ఎన్ని విధాల స్తుతించాలో అన్ని విధాలుగా ఆయన్ని స్తోత్రము చేస్తున్నాడు అర్జునుడు.

అర్జునుడు ఎంత ఆర్ధ్రతతో భగవానునికి నమస్కరిస్తున్నాడో దీనివల్ల తెలుస్తుంది. వేల సంఖ్యలో పెట్టిన నమస్కారములు చాల లేదన్నట్టు మరల మరల అంటూ నమస్కారంతో తన వినయ విధేయతలను తెలియజేయు చున్నాడు. ఇది అర్జునుని అనన్య భక్తిని తెలియజేయుచున్నది.

ఈనాడు మనందరము మన భావనను బట్టి నమస్కారములు చేసుకొంటున్నాము. కొందరు మర్యాద కొరకు నమస్కరిస్తారు. క్రింద తరగతి ఉద్యోగులు పై అధికారులకు గౌరవ సూచనగా నమస్కరిస్తారు. గొప్పగొప్ప పదవులను అలంకరించే ప్రధానమంత్రి, ఇతర మంత్రులు, ఆ స్థాయి వాళ్ళు సామాన్యులైన ప్రజలకు నమస్కరిస్తారు ఐదేళ్ళకొకకసారి ప్రజలే వారి దేవుళ్ళని. అదే సామాన్యుడికి ఐదేళ్ళ మధ్యలో

మహామంత్రుల దర్శనం దొరకటం కూడా దుర్లభమౌతుంది. దేవుడు దయతలచి మంత్రిగారి దర్శనం లభిస్తే సామాన్యుడు పెట్టే దండం వాడి హృదయ లోతుల్లో నుండి వస్తుంది. అది స్వీకరించేవారు ప్రతి నమస్కారం చేస్తారు. గాని అది యధాలాపంగా ఉండే నమస్కారము. ఇలా నమస్కారము పరిస్థితుల బట్టి ఇచ్చిపుచ్చు కొనేవిగానే ఉండిపోతున్నాయి. ఈ నమస్కారములు సామాన్యముగానే మిగిలిపోతాయి.

కొందరన్నట్టు తన కవసరమైన వాడిని 'కాకా' పట్టటానికి పెట్టే దొంగ నమస్కారములు. నమస్కారమనకపోతే ఏమనుకొంటాడో వీడు, మనపని జరగాలంటే ఒక నమస్కారమేగా, పడేస్తేపోలా, అని తెచ్చిపెట్టుకొనే నమస్కారము. ఎదుటి వాడిమీద గౌరవం చూపించినట్టు నమస్కారము నమస్కారమంటూ పెట్టే కటప నమస్కారాలు, మరీ వంగి వంగి పెట్టే దండాలు, ముఖస్తుతి కోసం పెట్టే నమస్కారములను గూర్చి శాస్త్రాలు చెప్పలేదు. అతి తెలివగల వాళ్ళు చేసే కొన్ని వికట చేష్టలివి. ఇవి గర్హ్యములు.

హిందూ శాస్త్రాలలో అసంఖ్యాకమైన మంత్రాలున్నాయి. ఆ భగవంతుని స్వరూపాన్ని నామముతో స్తోత్రము చేయునప్పుడు ఆ మంత్రం చివర "నమః" అని చెప్పబడుతుంది. అంటే నేను నీకు దాసుడను, నన్ను ఉద్ధరించగలవాడవు నీవే అని ఆత్మార్పణ చేసుకోవటం నమస్కారము యొక్క విధిని తెలియజేలస్తుంది. మనసా, వాచా, కర్మణా నమస్కరించి ఫలితాన్ని అందుకోండి.

# 11. మహాప్రస్థానం

ఆద్యంతములు లేని పరమాత్మ నుండి అవిద్య ఆవిర్భవించి ఆది అంతాలను కల్పించింది. అనాది నుండి ప్రారంభమయిన సృష్టి కల్పాంతములో మళ్ళీ అనాదిలో ఐక్యమౌతుంది. మొదలు ప్రారంభమయితే అంతము ఉంటుంది.

వస్తువు కాని, పదార్థము గాని, జీవులు గాని జన్మించింది మొదలు ఎన్నో మార్పులకు, చేర్పులకు లోనయి అవసాన దశకు చేరుకొన్నాక అంతమై పోతాయి. అవి ఎక్కడ నుండి బయలుదేరినవో మళ్ళీ అక్కడకే చేరుకోవటం సృష్టి ధర్మంగా చెప్పబడతున్నది.

ప్రతి ఆరంభానికి అంతం ఉంటుంది. స్థాపితమైనది ఏ నాటికైనా భూస్థాపితము కాక తప్పదు. సృష్టిలో ఎంత గొప్పది కాని కొంతవరకే స్థితిపథంలో ఉండి తరువాత లయము కావల్సిందే. సమస్త శాస్త్రాలు ఈ సిద్ధాంతాన్నే చెబుతున్నాయి. ప్రారంభానికి ముగింపే ప్రత్నామ్నాయము.

పరబ్రహ్మముచే ప్రారంభింపబడిన సృష్టికర్త. తాను రచించిన ఈ బ్రహ్మాండము కాలనుగుణంగా ప్రవర్తించి కాలునిలో కలిసిపోతుంది.

"జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మమృతస్య చ।
తస్మాద పరిహార్యేఽర్థే నత్వం శోచితు మర్హసి ॥"

పుట్టిన వానికి మరణం తప్పదు, మరణించిన వాటికి జన్మ తప్పదు. అనివార్యమైన ఈ విషయము శోకింపతగదని గీతా చార్యుడు జీవులే కాదు ప్రతి పదార్థం, సృష్టితో సహా చివరకు ముగిసి పోతాయని వచించారు.

సృష్టి అంటే క్రొత్తగా ఏర్పడినది కాదు. అవ్యక్తముగా పరమాత్మలో సూక్ష్మరూపంలో నున్నది వ్యక్త రూపం గాంచటము సృష్టి.

విరాట్పురుషుడు హిరణ్యవర్ణుడు. ఆయన సర్వజీవజాలంతో బ్రహ్మాండాంతర జలాలో 1000 సంవత్సరాలున్నాడు. మహదులు కారణము, విరాట్పురుషుడు కార్యయము. ఈ పురుషునికి దైవశక్తి, కర్మశక్తి, ఆత్మశక్తి అనే మూడు శక్తులు జ్ఞాన క్రియ, భోక్తృత్వ, శక్తులు వున్నాయి.

జ్ఞానశక్తి చైతన్య రూపమైనది. ఇది హృదయమందు ఏకరూపంలో ఉన్నది. క్రియాశక్తి దశప్రాణ వాయువులుగా అయింది. భోక్తృత్వ శక్తి ఆధ్యాత్మికాభేదాలతో మూడు విధాలుగా వర్ధిల్లుతుంది. విరాట్పురుషుడు పరమాత్మాంశమై సమస్త వ్యష్టి రూపాలకి, ఈ రెండింటికి ఆత్మరూపుడౌతాడు.

ఇది పరమాత్మ ప్రథమ రూపం. ఈ రూపంలో సమస్త భూతకోటి వివిధ రూపాలుగా కనబడుతుంది. పరమాత్మ వీక్షించి రూపొందించిన ప్రకృతి కూడా మహా ప్రస్థానం గాంచి, అవినాశి, నిర్వికారం, నిరంజనమైన అవ్యక్త పరమాత్మమతో ముగిసిపోతుంది.

ఆత్మశక్తి చేత ప్రకటితమైన జగత్తు దాని సమయం ఆసన్నమై నప్పుడు గతించిపోతుంది. మళ్ళీ కాల ప్రవాహం కదలినప్పుడు సృష్టి పుడుతుంది. ఆ విధముగా సృష్టికి చావుపుట్టుకలున్నవి. ప్రకృతి చేత పుట్టి జీవించే ప్రాణులు దేహాంతరము చెందకుండా ఉండవు. జీవుల పుట్టుక మరణం ప్రకృతి శాసనం. దీనికి విరుద్ధముగా ఏది జరుగదు.

బుద్ధి రూపపుడైన మానవుడు తెలుసుకోవలసింది, ఎక్కడ నుండి వచ్చాము మళ్ళీ ఎక్కడకు పోతున్నామనేది. అది అనుభవంలోకి తెచ్చుకొన్నప్పుడు చావుపుట్టుకలను దాటే ప్రయత్నం చేయటం బుద్ధిమంతుల లక్షణం. అవిద్య కారణంగా పుట్టిన మనుష్యుడు త్రిగుణాల బంధములో పడి నేను, నాది అనే కర్తృత్వభోక్తృత్వాభిమానం పెంచుకొని ఏషణాత్రయ మోహంలో పడి సుఖ దుఃఖాలను అనుభవిస్తున్నాడు.

మాయాభ్రాంతిలో పడి భౌతికక పరమైన అభివృద్ధి కొరకు దేవుళ్ళా టలో ఏవేవో పథకాలు వేసి వ్యాపారమో, ఉద్యోగమో లేక ఏదో వృత్తిని చేపడతాడు. అది చిన్నగా ప్రారంభమౌతుంది. తన శక్తి, శ్రమ, ఫలించగా సంఘములో పేరుప్రతిష్టలు సంపాదిస్తాడు. అందరూ ప్రశంసిస్తారు. సన్మానాలు చేయించుకొంటాడు. తన కృషి ఫలించినందుకు సంబరపడి పోతాడు.

ఒక తరంతో ప్రారంభించిన దినదినాభివృద్ధి చెందినది, రెండుమూడు తరాలు అభివృద్ధి కొనసాగి తరువాత తరంలో అది క్షీణించడం మొదలయి చివరకు పతనమై ముగిసిపోతుంది. ఇది అనుభవజ్ఞానం.

రాజులు రాజ్యాలు, చక్రవర్తులు సామ్రాజ్యాలు వచ్చాయి. ఎన్నో శతాబ్దాలు యుగాలుగా పాలన సాగింది. కొందరి పాలనలో ప్రజలు సుఖించారు. మరికొందరి పాలనలో దుఃఖించారు. జీవన ప్రమాణాలు పెరిగి ఆనందముగా జీవించారు. అంతా నవ్యంగానే ఉంది. అలాంటప్పుడు రాజులపాలన అంతము కావల్సిన అవసరమున్నదా? అయినా రాజుల పాలన అంతమయింది. రాజుల పాలనలు పోయి ప్రజా పాలనలు వస్తాయని అప్పట్లో ఎవరూ ఊహించి ఉండరు. జరగబోయేది తెలిసిపోతే అది భవిష్యత్తు కాదు. అప్పుడు మానవుడు సామాన్యుడుగా ఉండడు విధిని తన గుప్పెట్లో పెట్టుకొంటాడు.

ప్రజాపాలన వ్యవస్థ వస్తుందని అది ఇంత అధ్వాన్నస్థితిలో నడుస్తుందని ఊహించారా? ప్రజాస్వామ్యాలు మరెంత కాలం మనగలుగుతాయి. ప్రజా పాలన ప్రారంభమయినది కనుక ముగింపు రోజు కూడా వస్తుంది. నెలలు నిండితే గాని బిడ్డ పుట్టడు. పండితేనే గాని పండురాలదు. ఆ సమయం వచ్చే వరకు ఎన్ని అటుపోట్లు

వచ్చినా ఆ స్థితి కొనసాగుతుంది. దాని రోజు వచ్చినప్పుడు నడుస్తున్న చరిత్ర కాలగర్భములో ముగింపు తీసుకొంటుంది.

ఆవిర్భవించింది అంతమొందటానికి కారణం ఏమిటి? అది సృష్టి ధర్మం. ప్రకృతి ప్రతి నిమిషం మారుతుంది. మార్పే సృష్టిరహస్యం. భౌతిక పరమైనది ఏదిగాని అంతరించి పోకమానదు. ఇది దైవాజ్ఞ. మానవ జీవన క్రమాన్ని పరిశీలించిన మనిషి పుట్టింది మొదలు పోయే అంతవరకు ఎన్నో మార్పులు వస్తున్నాయి. ప్రతి మార్పు ఒక ముగింపు "దేహినో స్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా...." జీవునకు ఈ శరీరమందు బాల్యము, యవ్వనము, వార్ధక్యము అవస్థలు కలుగుచున్నాయి.

బాల్య జీవితం సరదాగా, సంతోషంగానే గడిపోతుంది. యౌవ్వనం జీవితంలోకి ప్రవేశిస్తుంది. అసలు జీవితం ఈ దశనుండే ప్రారంభమౌతుంది. ఇది 16 సం॥ నుండి 50 సం॥ వరకుండును. ఆరోగ్యంగా ఆర్థికంగా కుటుంబపరంగా ఎదగటం ఈదశకు చెందినవి. జీవితానుభవం ఈ దశలోనే ఎక్కువ.

మనిషి యవ్వనం నుండి వృద్ధాప్యములోకి ప్రవేశిస్తాడు. ఇది శారీరకంగాను, మానసికంగాను మార్పు తెస్తుంది. వయోవృద్ధుడు సీనియర్ సిటిజన్. ఈయన జీవన సరళి ఒకటి రెండు దశల కన్నా భిన్నంగా ఉంటుంది. శరీర పటుత్వం తగ్గుతుంది. యవ్వనపు ఛాయలు జారుకుంటాయి. రోగాలు పట్టుకుంటాయి. ముసలితనం ఒకశాపమట. ఎంత డబ్బున్నా స్త్రీలు అంతగా ఇష్టపడరట. ఇష్టం నటిస్తే అది డబ్బుకోసమే అవుతుంది మనిషి ఈ మూడు దశలు దాటి ఆఖరు దశకు చేరుకుంటాడు. అదే మహాప్రస్థానం. కౌమారం పోయి యవ్వనం వచ్చినప్పుడు ఎవ్వరూ పట్టించుకోరు. అలాగే యవ్వనం పోయి వార్ధక్యము వచ్చినప్పుడు అంతగా గుర్తించరు. కాని మరణం సంభవిస్తే పుట్టెడు దుఃఖములో పడిపోతారు ముఖ్యంగా సంసారులు.

జ్ఞానులు ఇందుకు భిన్నంగా ఉంటారు. పుట్టుట, పెరుగుట, మరణించుట అనే వికారాలు దేహధర్మాలని అవి ఆత్మ ధర్మములు గావని తెలిసి మరణం సంభవించినా చింతింపరు.

తల్లి గర్భంలో పిండోత్పత్తి జరగటంతో జీవించడం ప్రారంభమవుతుంది. అది పెరిగి, బాహ్యలోకంలోకి శరీరంతో వస్తుంది. ఈ దేహం అనేక మార్పులు పొంది సుఖ దుఃఖాలు అనుభవించి గడువు ముగిసిన తరువాత మహాప్రస్థానం చేస్తుంది. ఈ విధంగా ప్రారంభమైన మనిషి జీవితం కాలగమనంలో ఎన్నెన్నో కార్యకలాపాలు సాగించి బాధలు, కష్టాలు, సుఖసంతోషాలు అనుభవించిన తరువాత జీవితం ముగుస్తుంది.

పుట్టుట గిట్టుట కొరకే అంటారు పెద్దలు. గిట్టింది మరల పుట్టుట కొస్తుందట. ప్రళయముతో పలాయనమయ్యే ప్రపంచము కల్పారంభమున మళ్ళీ పుడుతుంది. ఇవి సృష్టి ఆటలు. ప్రాణి ముగింపు మళ్ళీ ఆరంభం కావటానికట.

ఈ చరాచర జగత్తు రాకపోకలకు ఏదో కారణముండాలి. కారణం లేక కార్యము లేదు. కార్యము లేక పోయిన కారణం ఉంటుంది. అదే అవినాశి ఆత్మ. అంతమయ్యేది అసత్. అనంతమయి ఎల్లప్పుడూ ఉండేది సత్. సత్ పదార్థము పరమాత్మ. ఆరంభానికి అంతానికి అతీతమైనది ఆత్మ ఏకం సత్.

నీవంటే ఎవరు? బాహ్య శరీరము కాదు. నీలోనున్న శరీరి. భాహ్య శరీరము మట్టిలో కలిసిపోవటం కాయం. నీలోనున్న శరీరి పోవటం అన్నది అసత్యము. "అన్తవన్త" ఈ శరీరాలకు చివర మొదలుంది. "శరీరిణః" దేహాత్మకు అంతము లేదు.

భౌతిక పదార్థాలను పరిశోధించి పలు విధములైన ఫలితాలను పొందవచ్చును. చెట్టును, విత్తును పరిశోధించి ఏది ముందు వచ్చిందో

చెప్పవచ్చు. అనేక రకాల విత్తనములను ఒక చెట్టుగా చేయవచ్చును. శరీర కణాల నుండి మరో శరీరాన్ని పుట్టించవచ్చును.

చంద్రునిలో ఏమున్నది? సూర్యకాంతి గతిని. వివిధ గ్రహాలలో లభ్యమయ్యే వాటిని, గాలిలోని ధూళిని, దుమ్ములోని పదార్థాలను, అణువు, పరమాణువు, చెత్తలోని శక్తిని, ఆకాశములోని శబ్దగుణాన్ని, గాలి స్పర్శను, నీటిలోని రసాన్ని, భూమిలోని వాసన మొదలగునవి ఇప్పటి వరకు చేసిన భౌతిక రసాయన వివిధ శాస్త్ర పరిశోధనల వల్ల కనుగొన్న ఫలితాలు.

అదే విధంగా మానవ జీవన వికాశంలో వచ్చే శరీరావస్థలు, శరీరాలకు కలిగే వివిధ రుగ్మతలు తెలుసుకొన్నారు. కఫ, మల, పిత్తములతో కూడిన ఈ శరీరము రూపం, శోభ, సౌందర్యము, రమణీయత అనుగుణాలు కలిగియున్నది. ఈ గుణాలను శరీర మందారోపించుకొని అనురాగం, మమత పెంచుకొను చున్నారు. సగభాగం పాము నోటిలోనున్న కప్ప శరీర పోషణార్థము తన ముందు కొచ్చు కీటకములను తింటుంది. మృత్యువు కోరల్లో ఉండి కూడా తన శరీర పోషణకు ప్రాకులాడుతుంది. అదే విధముగా మూఢులు మట్టిలో కలిసి పోయే శరీరమే మాణిక్యమని హంగులు జేనుకొన విషయ భోగాలను అనుభవిస్తారు.

"అనిత్యాని శరీరాణి" శరీరములు నిత్యములు కావు. అందుకే దేహం క్షణ భంగురమన్నారు. శరీరము పంచభూతముల ఆధారంగా షడ్ వికారములతో కూడియున్నది. 1. పుట్టు, 2. పెరుగుట, 3. జీవించుట, 4. రోగం, 5. వృద్ధాప్యము, 6. మరణము.

శరీరములో వచ్చే ఈ మార్పులే దుఃఖానికి కారణం. మరణం అంటే దేహానికే గాని ఆత్మకు గాదని జ్ఞానులు అంటారు. మనిషి ఎన్ని విధాల భయాల్నైనా తట్టుకుంటాడు గాని మరణ భయాన్ని తట్టుకోలేడు.

ఎన్నో దుర్మార్గాలు చేసినవాడు కూడా చంపేస్తానని కత్తిగాని, పిస్టలుగాని చూపిస్తే "బాబ్బాబు నన్ను చంపొద్దు, నీవు ఏది అడిగితే అది ఇచ్చేస్తా, నాయావదాస్తి రాసిస్తా" అని భయంతో ఒణికి పోతాడు. మరణ భయం ఆవహిస్తే దానికి మందులేదు, మరణమే శరణ్యం.

చావంటే మనుష్యులకు చచ్చేటంత భయం. "పోయినోళ్ళు తిరిగొస్తారా ఏమిటి? బ్రతికి నన్నాళ్ళు బాగా బ్రతికాడు, అందరితో మంచి అనిపించుకొన్నాడు, పాపం పోయాడు". ఇలా పోయినవాళ్ళ గూర్చి రకరకాలుగా చెప్పుకొంటూ ఆ కుటుంబ సభ్యులు ఏకధాటిగా గుండెలు బాదుకొంటూ ఏడ్చేటట్టు చేస్తారు అక్కడకొచ్చినోళ్ళు వాళ్ళను చూచి వీళ్ళు ముక్కు చీదేస్తారు.

రోజులు గడుస్తున్న కొద్దీ పోయినోళ్ళ జ్ఞాపకాలు కనుమరుగైనా అప్పుడప్పుడూ వాళ్ళ పేరున కర్మలు చేస్తూ గుర్తు చేసుకుంటారు. చివరకు అంతా సద్దుమణిగి పోతుంది. ఈ దేహము సేవలు చేయటానికి ఒక సాధనమని గ్రహించాలి. కాని ఈనాడు శరీర పూజను లక్ష్యంగా జేసుకొని దానికి లేనిపోని మెరుగులు దిద్ది, అదే అసలు సౌందర్యమని భ్రమలోపడి నశించే శరీరాన్ని విపరీతంగా పెంచుకుంటున్నారు.

ఈ దేహంలో శరీరి ఉన్నంత కాలమే అదివనికి వచ్చేది. "శరీరమాధ్యంఖలు ధర్మ సాధనం" శరీరానిన్న ఒక మాధ్యమముగా ఉపయోగించుకొంటే సార్థమౌతుంది. కాని నేటి మానవత కట్టిగా కాలిపోయే ఈ శరీరానికి ఎక్కడలేని ప్రాధాన్యతనిచ్చి అందాల పోటీలు పెట్టి అవార్డులిస్తూ ప్రపంచ సుందరాంగులను, దేశ సుందరీమణులను తయారుచేస్తూ వారికి. వి.ఐ.పి. (ఇంపార్టెంటు ఇచ్చి) ప్రాముఖ్యత నిచ్చి సత్కరిస్తున్నారు. అవినాశియగు ఆత్మను మరుగు పరచి వినాశియగు దేహమునకు ఎక్కడలేని విలువనిస్తున్నారు. దేహము, దేహ సంబంధాలు నింధ్యములని శునక సూతరాదులు వంధ్యములన్నారు మహాత్ములు.

"వాసాంసి జిర్ణాని యథావిహాయ....తథా శరీరాణి విహాయజీర్ణాని" (భ.గీ.) మనిషి చినిగిన వస్త్రాన్ని వదలి క్రొత్త వాటిని వేసుకుంటాడు. అట్లే దేహియగు ఆత్మ శిధిలమైన పాత శరీరాన్ని వదలి క్రొత్త శరీరాన్ని ధరిస్తుంది.

మనుష్యులు బట్టలు కట్టుకుంటారు. అవి వాడగా వాడగా పాతవై పోతాయి. కనుక క్రొత్త బట్టలు వేసుకుంటారు. ఇది సహజమైనది. మానవులే కాదు జంతువులు, పక్షులు, కీటకాలు, పాములు సైతము మాసిపోయిన వాటిని వదలి క్రొత్త క్రొత్త వాటిని ధరిస్తాయి. పాము పాత కుబుసము విడిచి కొత్త దానిని వేసుకొనును. గొంగళి పురుగు రంగు రంగుల సీతాకోకచిలుక అగును. ఊసరవెల్లి రంగులు మార్చును.

మనిషి బాల్యము నుండి వృద్ధాప్యము వచ్చే వరకు శరీరము మార్పులు చెందును. చెట్లు ఉన్న ఆకులను వదలి పెట్టి క్రొత్తవాటిని పొందును. ఈ విధముగా సృష్టిలోని చాలా ప్రాణులు పాతవాటిని పనికిరానివాటిని విసర్జించి కొత్త వాటిని ధరించును. అదే విధంగా నాగరిక మనుష్యులు పాత బట్టలు వదలి క్రొత్తవి వేసుకోవటమే కాదు సమయానిన బట్టి డ్రస్సు మార్చుకుంటారు. ఇంట్లో ఒక డ్రస్సు, ఆఫీసుకు ఒక డ్రస్సు, పడగ గదిలో ఒక డ్రస్సు, ప్రయాణంలో ఒక డ్రస్సు, పార్టీలకు మరొక రకమైన డ్రస్సు ఇలా మార్పులు చేస్తూ పోతుంటారు.

ఈ విధంగా శరీరంలో నున్న జీవాత్మ జీర్ణించిన ప్రారబ్ధ శరీరాన్ని వదలి, క్రొత్త అనుభవాల కొరకు క్రొత్త రకం శరీరమును దాల్చును. శిధిల దేహ పరిత్యాగమే మరణం. నూతన శరీరధారణ పుట్టుక. పుట్టినప్పుడు పండుగ చేసుకొంటాము (బర్తడే పార్టీ) ప్రతి సంవత్సరము. అట్లే మనిషిపోయినప్పుడు కూడా పండుగ చేసుకొంటాము అదే సంవత్సరీకము. చావుపుట్టుకలు ఈ స్థూల శరీరానికే గాని దానిలోపలనున్న ఆత్మకు కావని తెలుసుకొన్నవాడు జ్ఞాని. ఆత్మజ్ఞాని చావుపుట్టుకల విషయంలో సమస్థితిలో ఉంటాడు.

జీవించడం, మరణించడం యదార్థము యొక్క రెండు అంశాలు "యస్యఛాయ అమృతం యస్య మృత్యుః" దేహి మరణానంతరము ఊర్ధ్వలోకాలకి పోయి, తేజోమయలోకాన్ని చేరి పితృదేవతలతో, యమునితో ఉండాటని ఋగ్వేదం చెబుతుంది. మృత్యువు తనను గూర్చి తెలుసుకోలేని వారిని చూచి పరిహసిస్తుందట. దాని భావాన్ని గ్రహించిన వారి కది ఎటువంటి బాధ కలుగజేయదట.

"శరీరాణి విహాయ జీర్ణాని" జీర్ణించి పోయిన శరీరాన్ని నీకు నీవే వదలిపెడతావు. రకరకాల తిళ్లుతిని, ఎండకు ఎండి వానకు తడిసి, చలికి వణికి, దెబ్బలకు కమిలి, కాలం గడిచేకొద్ది ముడతలుపడి జీర్ణించుకు పోయిన శరీరాన్ని వదలక ఎలా ఉండగలడు దేహి. కనుక కాలం చెల్లిన శరీరాన్ని వదలి "దేహి" ఇంకో శరీరము చేరిపోతుంది.

భారతదేశములో హైందవులు కొంతలో కొంత శరీరము వేరు ఆత్మవేరు అనే భావనతో ఉంటారు. అందుకు కుటుంబములో ఎవరైనా చనిపోతే శరీరాన్ని దహనం చేయటమో లేక పూడ్చిపెట్టటమో చేసి పితృదేవతలకు తర్పణలు వగైరా చేస్తుంటారు.

అదే పాశ్చాత్య దేశాలలో "హి కిక్‌డ్ ది సోల్" శరీరం ప్రాణాన్ని తన్నేసింది అని ఈ శరీరము తప్ప మరొకటి లేదని భావించుతారి. ఆత్మ అంటే నారికి తెలియదు. ప్రాణం పోయిన శరీరం నిల్వ ఉన్న కొద్ది క్రుళ్ళి కంపుగొడుతుంది. అయితే కట్టిగా మారిన శవానికి ఏవో రసాయనాలు కలిపి భద్రపరుస్తారట. అందుకు ఎంతైనా ఖర్చు చేస్తారట. అక్కడతో ఆగకుండా పోయినవారు వాడు కొన్న వస్తువులు కూడా సమాధిలో పెట్టి వారి పని వారిని, ఆడ వారిని చంపి అందులో వేస్తారట. ఈజిప్టు దేశంలో ఇలా చేసేవార్రట. అందుకే అక్కడ శవాల మీద పిరమిడ్స్ కట్టి వాటిలో శక్తి ఉందని వారు గట్టిగా విశ్వశిస్తారు.

ఈ విధముగా చేయటానికి కారణం ఈ దేహమే అన్ని అని

వారి భావము. ఆత్మజ్ఞానం లేక పోవటమే దానికి కారణం. ఒక లెక్చరర్ గారు తల్లి శవాన్ని పేటికలో పెట్టి యేళ్ళ తరబడి అది చెక్కు చెదరకుండా రసాయన ద్రవ్యాలు వాడి కాపాడినాడట. అందుకు అతడు వివాహం కూడా చేసుకోలేదట. ఇది మన రాష్ట్రంలో జరిగిన విషయం గమనించండి, ఇలాంటి వారికి బూడిదయ్యే శరీరమంటే ఎంత ప్రేమో!

భారతీయ సంస్కృతిలో కొందరు శరీరము నుండి (చిలక) ఆత్మ వెళ్ళిపోయిందని శరీరాన్ని కాల్చటమో లేక పూడ్చి పెట్టటమో చేస్తారు. ఈ శరీరము రసాయన పదార్థాల కలయిక. ప్రాణం శరీరాన్ని వదలి వెళ్ళిన తరువాత అది కాలి బూడిద అవుతుంది. ఆ శరీరములోని రసాయనాలు దేని నుండి వచ్చినవో వాటిలోకి వెళ్ళి కలిసిపోతాయి.

జీవిత సత్యాన్ని తెలుసుకోవాలంటే చావు పుట్టుకలను గూర్చి తెలుసుకోవటం అవసరం. కేవలం బ్రతకడం, అందులో దర్జాగా బ్రతకటం తెలిస్తే చాలదు. నేటి మనిషికి బ్రతకడమే తెలుసు. చావంటే అంతగా తెలియదు. చావంటే అదేదో పెనుభూతమో లేక ప్రాణాన్ని చంపితినే భయంకరమైన రాక్షసనో భయపడి పోతారు. చావుమాట ఎత్తితే చంపేస్తానంటారు. అమాట అనవద్దంటారు. తథాస్తు దేవతలుంటారు అంటారు. చావు దెబ్బకు అకాశం క్రిందపడి పోయినంతగా భయపడతారు. ఇది పూర్తిగా అజ్ఞానదృష్టి, అదే జ్ఞానికి చావుపుట్టుకలొక్కటే.

పండిన పండు చెట్టున ఎంతోకాలం ఉండదు. నేల కొరిగి మట్టిలో కలవటమో లేక అన్నముగా మారి అకలి తీర్చటమో జరుగుతుంది. ఆదిగా ఆరంభమైన పుట్టుక చివరకు మట్టిలో కలిసి పోఉతంది. ఇది అనివార్యమైన ప్రకృతి ధర్మము. దీనిని ఎవ్వరుగాని ఆపలేరు. ఏ శక్తి కూడా ఆపలేదు. "జాతస్యహి ధ్రువో మృత్యుః".

మనిషిని అతి భయంకరముగా భయపెట్టే మరణం ఎక్కడ

నుండో వస్తుందని లేక యమదూతలు తీసుకుపోతారను కోవద్దు. మరణం కూడా ప్రాణంతో బాటు ఆ శరీరములోనే ఉన్నది.

"సహైవ మృత్యుర్వ్రజతి సహమృత్యుర్నిషీదతి ।
గత్వాసుదీర్ఘమధ్వానం సహమృత్యుర్నివర్తతే ॥ (వాల్మీకి రామా)

నీ మృత్యువు ఎక్కడో దూరంగా లేదు. అది నీతోనే వస్తుంది. నీ దగ్గరే కూర్చుంటుంది. నీ ప్రయాణం ఎంత దూరమైనా అంతదూరం నీ వెంటనే ఉంటుంది. తిరుగు ప్రయాణంలో నీతోనే తిరిగి వస్తుందని శ్రీరాముడు చావు స్థానం గూర్చి బహు బాగా చెప్పాడు.

శరీరంలో ప్రాణం దశ వాయువుల రూపంలో ఉండి ఈ శరీరాన్ని పోషిస్తుంది. ఆయుషు పూర్తయినప్పుడు ఆ శరీరాన్ని విడిచిపెటుతుంది. ప్రాణ వాయువు ప్రాణ రూపం అయితే, గుదస్థానంలో ఉండే అపాన వాయువే మృత్యు రూపం. జీవుడు ఆ శరీరాన్ని త్యజించటానికి సిద్ధపడి నప్పుడు అపాన వాయువు హృదయమందున్న ప్రాణ వాయువును కబళిస్తుంది. ప్రాణ సంచారము ఆగి పోతుంది. ఆ శరీరము శవంగా మారిపోతుంది.

జీవుడు ఈ దేహాన్ని విడిచి క్రొత్త క్రొత్త అనుభవాలను రుచి చూసేందుకు తగిన క్రొత్త దేహాన్ని చూచుకొంటాడు నీకు నచ్చే బట్టలకోసం వెదుకొన్నట్టు. ఈ పరివర్తన, పరిణామం మనో బుద్ధులు గల జీవునకే గాని ఆత్మకు లేదు. ఆత్మ నిత్యమైనది, అందుకు దానికి ఆ అవసరం లేదు.

ఏదిగాని ప్రారంభించినప్పుడు హడావిడిగా ఆనందంగానే ఉంటుంది. ఆ కుటుంబంలో ఒక మనిషి పుట్టటం సంతోషదాయకం అవుతుంది. కాని అదే కుటుంబంలో ఒక వ్యక్తి మరణిస్తే చెప్పరాని దుఃఖము కలుగుతుంది. పుట్టినప్పుడు నవ్వటం, మరణించినప్పుడు

ఏద్వటం. సామాన్యమైన చావుపుట్టుకల సారం తెలిసి రెండింటిని సమానంగా తీసుకోవటం వలన జ్ఞానివైతావు.

ఓ మానవుడా! నిన్ను నీవు తెలుసుకో అన్న ప్రవచనం, నీవు ఎన్నో మంచి విషయాలు తెలుసుకోవటం మంచిదే. అంతకంటే ముందుగా నిన్ను గూర్చి నీవు తెలుసుకోవటం అవసరం. సత్యాన్ని తెలుసుకొన్నప్పుడు నీ జీవితంలో మార్పువస్తుంది. అవగాహన పెరుగుతుంది. నీలో ఉన్న ఆత్మ అందరిలో నున్నది అదే నని తెలుసుకొన్నపుడు అహం నశిస్తుంది. అవ్యక్తపరమాత్మ నుండి వ్యక్తమైన ఈ బ్రహ్మాండము మహా ప్రస్తానంతో ముగుస్తుందని తెలుసుకోవటం (నీ నిజస్థితిని తెలుసుకోవటమే) నీ స్వస్వరూపాన్ని తెలుసుకోవటయే.

# 12. ఓం శాంతిః

శుభకార్యాలు మరి ఇతర కార్యక్రమాలు ప్రారంభించే ముందు ప్రార్థన చేస్తారు. ఈ విధంగా చేయటం శిష్ట సంప్రదాయము. తలపెట్టిన కార్యము నిర్విఘ్నంగా కొనసాగాలని అలాచేయటం జరుగుతుంది.

అదే విధంగా కార్యక్రమం ముగించిన తరువాత ఓం శాంతిః, శాంతిః, శాంతిః అని ముమ్మారు శాంతివచనము చెబుతారు. ఎందుకు ఈ విధము శాంతిని మూడుసార్లు ఉచ్చరించాలి. దీనిరహస్య మేమిటో తెలుసుకోవాలి.

విషయసుఖములందు విరక్తి, మనస్తృప్తి, ఉపశమనము, సుఖము, జ్ఞానేంద్రియ నిగ్రహము మొదలగు అర్థములు గలవు శాంతికి. దేవదానవ మానవులే కాదు పశుపక్ష్యాదులు సైతము జీవితంలో సుఖాన్ని సంతోషాన్ని, ఆనందాన్ని ఆశించి శాంతిగా బ్రతకాలను కొంటాయి. శాంతిగా బ్రతికేవారు బహుస్వల్పముగా ఉంటారు. శాంతగుణము వృద్ధిగావించుకొన్నవారు భగవానునికి దగ్గరౌతారు.

పరిపూర్ణ ఆనందం సచ్చిదానంద బ్రహ్మం. సంపూర్ణమైనశాంతి పరంధామము. శాంతిని కోరుకుంటే శమదమాదులు అలవర్చుకోవాలి. శమము బాహ్యాంతరము, బాహ్యాశుచి, శరీరమును పరిసరాలను శుభ్రముగా ఉంచుకోవటం అంతరశుచి. ఇంద్రియ నిగ్రహము. ఇంద్రియాలు విషయాలను అనుభవించవలెనని తపన పడుతుంటాయి. వీటిని శమ దామాదుల ద్వారా అణగద్రొక్కటానికి ప్రయత్నించాలి. పుణ్యకార్యాలు చేయటం ద్వారా భక్తి, జ్ఞాన వైరాగ్యముల ద్వారా ఇంద్రియనిగ్రహాన్ని పొందవచ్చును. అప్పుడు శాంతి ఆ మనిషికి అందుబాటులో ఉంటుంది.

"శాన్తిః" నిష్కలం, నిష్క్రియం, శాంతమ్. ఆత్మ నిర్మలము,

